# నడుము నొప్పా?

## బాధ నివారణ కోసం
# అయొడెక్స్
## రుద్దటం అవసరం

ఇతర ఆయింట్‌మెంట్స్ మీకు బాధనుండి ఉపశాంతిని ఇవ్వవచ్చు. అయొడెక్స్ ఉపశాంతిని ఇస్తూ, బాధను నివారిస్తుంది. దీనిలో అయొడిన్ ఉంది గనుక.

కండరాల నొప్పులకూ. కీళ్ళ నొప్పులకూ ఒకే ఒక ఆయింట్‌మెంట్-అయొడెక్స్.




**అయొడెక్స్-మిమ్మల్ని మళ్ళీ చురుకుగా పనిచేసేలా చేస్తుంది.**

లింటాస్-IODEX.1.31 TL






ముఖచిత్రం : దారిలోదొరికిన ప్రేమలేఖలు.

చిత్రకారుడు : వ. పా.


యువ సాలుచందా రూ. 36-00

దీపావళి సంచికతో రూ. 42-00

డూండీ రూపకల్పనలో మరో మరపురాని కధ

త్రిమూర్తి ప్రొడక్షన్స్ వారి

# అభిమానవతి

స్క్రీన్‌ప్లే దర్శకత్వం డూండీ

నిర్మాతలు జి సాంబశివరావు, పి బాబ్జీ

శ్రీఫిలింస్






ఫిబ్రవరి సంచికలో శ్రీమతి కోమలా దేవి చిన్న నవల, అద్భుత రూపకల్పన; పరిపూర్ణమైన, విజ్ఞానవంతమైన కథ చాలా కాలము తరువాత మన భాషలో చూచి చదివి, హృదయస్పందన పొంది, తీరని ఆనందానుభూతి పొంది ఆమెకు పత్రికాముఖంగా అభినందనలు తెల్పుచున్నాను. ఆ కథా సృష్టికి ఆమె ఉపయోగించిన శాస్త్ర పరిజ్ఞానము ఆ కథకు నిండుతనము కల్గించింది. భగవత్ సృష్టిలో అంతటి అందమైన జంట ఉందో లేదో తెలియదు కాని ఊహలోనైనా అంతటి అందమైన జంటను కూర్చినకథ మరింత అందముగా ఉంది.

డా॥ చంద్రశేఖర రావు,
సింగరాయకొండ

కోమలాదేవిగారి "భార్యా రూపవతీ" నవల చక్కని చిక్కటి కథనంతో పాఠకుల నెంతో ఉత్సాహపరిచింది. ముఖ్యంగా ఈ నెలలో కథలన్నింటిలోను శిరీషగారి "కథకు కాళ్లొచ్చాయి" ఎంతో ఆసక్తికరంగా ఉన్నది. "బృందావనం" సీరియల్ పాఠకులను రంజింపజేస్తూ ముందు ఏమి జరుగుతుందో అన్నట్టు



జీవితాన్ని ఆమె ఎందుకు బలిచేసుకుంది?
ముప్పలనేని శేషగిరిరావు సమర్పించు
రవిశంకర్ ఆర్ట్ పిక్చర్స్
రంగనాయకమ్మ నవల
బలిపీఠం
ఈస్ట్‌మన్‌కలర్
సోల్ డిస్ట్రిబ్యూటర్స్
ఎంటర్‌ప్రైజెస్
నిర్మాత
వై. సునీల్ చౌదరి
మాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం
దాసరి నారాయణరావు
నవయుగ
VEEKAY
సంగీతం చక్రవర్తి
కెమెరా
ఎడిటింగ్ కె. సత్యం
ఆర్ట్ కళాధర్
నిర్వహణ కాసరాజు సుబ్బారావు

వంటి ఉత్కంఠాన్ని కలుగజేస్తున్నది.

సిరికొండ వెంకటేశం, కరీంనగర్.

ఫిబ్రవరి నెల యువ ముఖచిత్రం "మాలకోసం అగ్ని ప్రయాణ సన్నాహం" మమ్మల్ని ముగ్ధుల్ని చేసింది. కోమలాదేవి గారి నవల "భార్యా రూపవతీ" బాగుంది. "బృందావనం" సీరియల్ యువకు మణిపూస. "అగ్ని మాల" యువకు ఆణిముత్యం. అరేబియన్ రాత్రుల కథలు యువకే హైలైట్. "భార్యల్లోనే ఉంది", "మనసు కథ" కథలు చాలా బాగున్నాయి.

న్యాయపతి రమేష్ బాబు.
బరంపురం- ఒరిస్సా.

ఒక్క అసత్యం ఎంతటి విపరీత పరిణామాలకైనా దారితీస్తుందన్న నగ్న సత్యాన్ని తమ కథ 'నిర్మల మొగుడు" ద్వారా బాలగంగాధర్ తిలక్ గారు నిరూపించారు. గాలిలో దీపం పెట్టి దేవుడా నీ మహిమ అనేవారికి "దేవుడిపై కోపం" కథ కనువిప్పు కాగలదు. పురాణం సూర్యప్రకాశరావుగారి "వార్తా వహుడు" చాలా బావుంది. మంచి వైవిధ్యం ఉన్న కథలను పాఠకులకు అందిస్తున్న సంపాదకులకు నా హృదయ పూర్వక అభినందనలు.

బులుసు కామేశ్వరరావు,
గుంటూరు-2

---

# తప్పక చూడండి!

**ప్రతిరోజూ 3 ఆటలు : 2-30, 6-15, 9-30**




**సుదర్శన్ 35 mm**
(ఎయిర్ కూల్డ్)
హైదరాబాద్

**శ్యామ్**
(ఎయిర్ కూల్డ్)
హైదరాబాద్

**అజంతా**
సికింద్రాబాద్

**లక్ష్మి**
వరంగల్

**శ్రీనివాస**
ఖమ్మం



నాన్ని శుభ్ర పరిచే
ఓమో
దాక్కున్న వదలని మురికిని
సహితం లోపలికి చొచ్చుకు
పోయి తరిమేస్తుంది
Soak-n-See
OMO
Washes totally white,
thoroughly clean
It's power-packed!
అమోఘ
శక్తి గలది !
Nett Weight 600 g
లింటాస్.OMO.3A.776 TL (HS)

# రుజువు: ఓమో ముడి ప్రయోగం

(ఇది ఉతికే పద్ధతి కాదు. మామూలుగా ఉతికే సూచనలు ప్యాక్ పైన ఉన్నాయి.)




1. రోజూ ఉతికే బట్టల్లోంచి వంటింట్లో వాడే బాగా మురికి అయిన బట్టను తీసాము.

2. మురికి బాగా దాక్కునే విధంగా ఆ బట్టను ముడి వేసాము.

3. ఆ ముడి వేసిన బట్టను యితర బట్టలతో బాటు ఓమోలో 4 గంటల సేపు నానబెట్టాము.

4. 4 గంటల తర్వాత: దానిని ఆ ద్రవంలో పిండి... జాడించాం.... మరి ఆ ముడి బయట పరిశుభ్రంగా ఉంది. ముడి లోపలో మరి?

5. మేము ముడి విప్పాము— అది లోపల కూడా పూర్తిగా తెల్లని తెలుపుతో పరిశుభ్రంగా ఉంది. వదలని దాక్కున్న మురికిని ఓమో నాన్చి తరిమేస్తుందనటానికి రుజువు యిది. లోపలికి చొచ్చుకుపోయి పరిశుభ్రమైన ఉతుకు యిస్తుంది.

## అవును, అమోఘ శక్తిగల ఓమోలో 4-గంటలు నాన్చితే, తెల్లని తెలుపు, పరిశుభ్రమైన ఉతుకు వస్తుంది.

దీనికి హిందూస్థాన్ లీవర్ వారి పూచీ ఉంది.

హైదరాబాద్‌లో/సికింద్రాబాద్‌లో మాత్రమే లభిస్తుంది


చీలమండ
బెణికిందా?




IODINE OINTMENT
IODEX
cum Methyl Salicylate
3273

తమ్మారెడ్డి కృష్ణమూర్తి సమర్పించు

ధృవ చిత్ర వారి

# చిన్ననాటి కలలు



# మజాగా, హుషారుగా, కసిగా యవ్వనాన్ని జుర్రుకోండి!

కసిగా దూకవలసి వచ్చినప్పుడు చప్పబడిపోయి ఊరుకుంటారా? మీ కోసం కాసుకున్న యవ్వనాన్ని జుర్రుకోండి. మీరు మాత్రం ఎందుకు వదులుకోవాలి? వేలునొక్కితే చాలు వెండి పూత గల మెరిసే బిళ్ళలు. నేటి టానిక్ రసగుళికలు. కాలం చేజారినా, మీరు బేజారు కాకండి. ఎడతెరిపిలేకుండా, శక్తితో, నిండుగా యవ్వనంతో కులకండి.

శక్తివంతమైన జీవనానికి

# ఒకాసా

హార్మో-ఫార్మా లిమిటెడ్ లండన్-బెర్లిన్ వారి ఉత్పత్తి

(పురుషుల కోసం వెండి పూత గల బిళ్ళలు)

పేరెన్నికగన్న అన్ని మందుల దుకాణాల్లోనూ దొరుకుతుంది.

OKASA CO,PVT.LTD.,12K Gunbow Street, P. B. No. 396, Bombay-400001



**FREE** విసుగక ప్రార్థించండి ఉచిత

మానవులు విసుగుచెందక నిత్యమూ ప్రార్థన చేయవలెనని ప్రభువైన యేసుక్రీస్తు సె విచ్చాడు. అన్నీ కలిసివచ్చి లాభం కలిగినప్పుడు దేవుడ్ని స్తుతించటం నష్టపోయి నప్పుడు దూషి చటం కాకుండా ఎల్లప్పుడు ఏకరీతిగా క్రమబద్ధముగా ప్రార్థించాలి. దేవుడనే వ్యక్తి ఒక డున్నా డనే విశ్వాసము కలిగి, తన్ను నమ్మకముతో అడిగినవారికి ఫలితం అందించగలడనే నిరీక్షణతో ప్రార్థించినవారు ఆశాభంగము పొందనేరరు.

రెండవ ప్రపంచయుద్ధం జోరుగా జరిగే సమయములో కొంతమంది భక్తులు కలసి యుద్ధమ వలన నష్టపోయినవారి కొరకు యుద్ధములో మరణించినవారికి భార్యాబిడ్డల అక్కరలు తీర ధనముకొరకు ప్రార్థించుచుండగా, ఇంగ్లాండు దేశములోని 'ఎసెక్స్' అనే పట్టణములో ని సించే ఒక రైతు వారికి కొంత ధనం పంపించారు. "నీళ్ళ కొరతవలన తన భూములనుండి సరిగ్గ ఫలం పొందలేక పోవుచున్నానని లేనియెడల ఇంకా కొంత ఎక్కువగానే ధనం పంపగలి యుండే వాడినని, ఈ జర్మనులు విరివిగా వేస్తున్న బాంబులంటే తనకు చాలా భయమని, అ తన పంటభూమిమీదపడి వాటిని పాడుచేసి అగ్నికి ఆహుతి చేయకుండ తనకోసం బలంగా ప్రార్థి చమని'' వేడుకుంటూ ఉత్తరం వ్రాసాడు.

అసలు బాంబులు ఆ ప్రదేశములో పడనేకూడదని ప్రార్థించటం అసాధ్యమని, ఎటుతిరిగి ఈ : స్థితులలో దేవునిచిత్తం ఆ రైతు జీవితములో నెరవేరునట్లు ప్రార్థిస్తామని వారు ఆ రైతు అభయమిచ్చారు.

ఈ ఉత్తరం అందిన కొద్ది దినములకే ఒక పెద్ద జర్మన్ బాంబు ఆ రైతు ఉన్న గృహ పర రాలలో పడిందిగాని, దానివలన రైతుకుటుంబానికిగాని అతని పశువులకుగాని ఎటువంటి హా కలుగలేదు. అయితే ఆ మారణాస్త్రము భూమిలో బహులోతుగా చొచ్చుకొని పోయినందువల అడ్డబండలు తొలగింపబడి భూమియొక్క అంతర్భాగమందు ప్రవహిస్తున్న జలధారలు పైకి ఉబి ప్రవహించటం ఆరంభించాయి ఈ జలధారలవలన రైతుకుటుంబానికి నీటి ఇబ్బంది తీరు మాత్రమేకాదు, చుట్టూనున్న కుటుంబాలుకూడ ఈ జలములను ఉపయోగించుకొని వారి వ్య సాయమును వృద్ధిపరచుకొన్నారు. ఆ సంవత్సరము తన పంట సమృద్ధిగా పండినందులకు 2( డాలర్లు దైవ సేవకని పంపుతూ తనకోసం వారు చేసిన ప్రార్థనలకు దేవుడు ఎలా జవాబు అను గ్రహించాడో దానిని ఆ రైతు నివేదించుకొన్నాడు.

చిత్తశుద్ధి కలిగి దేవుడున్నాడనే విశ్వాసముతో, మరియు ఆయన చిత్తం మన జీవితము నెరవేరాలనే నిరీక్షణతో ప్రార్థించినప్పుడు దేవునియొద్దనుండి ఇటువంటి ఖచ్చితమైన జవాబుల పొందగలము.

మనం అడిగేవాటికన్న ఊహించేవాటికన్న అత్యధికముగా చేయగలిగిన దేవునిగూర్చి తెలు కొన్నారా ?

— చదలవాడ చంద్రమతీదే

---

**ఉచితం**

మీ ఇంట్లో కూర్చుని బైబిల్ పరిశోధనమీద చక్కటి సర్టి ఫికెట్ పొందాలన్నా, బైబిల్ కి సంబంధించిన అంగమైన విలువ గల పుస్తకాలు కావాలన్నా, ఒక కార్డుమీద మీ అడ్రసుతో స్పష్టంగా వ్రాయండి పోష్టుఖర్చులుకూడ మావే. Hope

**ఉచితం**

ఇదీ అడ్రసు

**ఎస్. జాన్ డేవిడ్**

నిరీక్షణ, పోష్టుబాక్సు నెం. 1.

చిలకలూరిపేట గుంటూరు జి

# యువ

సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు: చక్రపాణి

సంపుటి 31 | మార్చి, 1975 | సంచిక 3

ఏప్రియల్ నెల

## భావపరిచయ పోటీ

**బహుమానం రూ. 10-00**



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

మార్చి నెల

# భావపరిచయ పోటీ

## బహుమతి పొందిన వ్యాఖ్య




ఒకడు క్రాపుజేయు నొకడు గడ్డము గీకు
నొకడు నూనె వ్రాయు నొకడు దువ్వ
సలుపగ సహకార సరణి నిట్లొకసారి
సార్థకమగు 'క్షౌరశాల' పేరు!

అలపర్తి వెంకట సుబ్బారావు,
నందివెలుగు.



-రంగ-

# మారే కాలంలో మారని విలువలు

సి. ఆనంద రామం

రాత్రి పన్నెండు దాటింది. హాస్పిటల్‌లో అందరూ నిద్రపోతున్నారు. నైట్ డ్యూటీ నర్స్‌లు టేబిల్స్‌మీద తలలు వాల్చి మెలకువా, నిద్రా కాని దశలో ఉన్నారు...విమల బెడ్‌పక్కన అయోమయంగా కూర్చున్న లత భుజంమీద చెయ్యిపడటంతో ఉలిక్కిపడి లేచి నించుంది.

"నువ్వా!" అంది విజయ్‌కుమార్‌ని చూడగానే! విజయ్‌ని ఎప్పుడు ఏ సందర్భంలో చూసినా లతకు హాయిగానే ఉంటుంది. తన మనసులో ఉండే చికాకులనూ, తన సమస్యలను అన్నింటినీ మాయంచేసి ఎప్పటి కప్పుడు తనకు అపూర్వమైన శాంతిని ప్రసాదించే మాంత్రికు డనుకుంది.

"నేనే! ఈ సమయంలో ఇక్కడికి రావటానికి ఎంత అవస్థపడవలసి వచ్చిందో తెలుసా! నా అదృష్టం బాగుంది నైట్‌డ్యూటీ డాక్టర్ నా ఫ్రెండ్ ఫ్రెండ్‌కి అన్నగారి..."

లత నవ్వేసి "చాల్లే! ఎందుకొచ్చావ్!" అంది.

"ఇంటిదగ్గిర మీ అమ్మగారూ, నాన్నగారూ నీ కోసం గాభరాపడిపోతున్నారు, మీ తమ్ముడు మా ఇంటికొచ్చాడు. నిన్ను తీసుకొస్తానని చెప్పి, మీ తమ్ముణ్ణి మీ ఇంటికి పంపించి ఇలా వచ్చాను. ఇప్పుడు నువ్వు రానంటే ఒంటరిగా మీ ఇంటికి వెళ్ళి ఈ వార్త చెప్పే సాహసం నాకు లేదు..." భయం నటించాడు విజయ్.

విమల మంచంపక్కనే కునికిపాట్లుపడుతూ, కళ్ళు నులుముకుంటూ కూర్చున్న విమల తల్లి సుగుణ, "వెళ్ళమ్మా! నే నున్నానుగా? పాపం, మీ ఇంట్లో ఎంత కంగారుపడుతున్నారో?" అంది.

లత అప్పటికీ కదలకుండా సందేహిస్తూ, "మీకు నిద్రవచ్చేస్తుందేమో! మళ్ళీ రెండుగంటలకి మందుఇచ్చే సమయానికి నర్స్ వస్తుందో? రాదో? మీరు గుర్తుచేస్తారో, చెయ్యరో?" అంది.

''ఓహో! కన్నతల్లికంటె నీకు శ్రద్ధ ఎక్కువన్నమాట!" సగం పరిహాసంగా సగం అపహాసంగా అన్నాడు విజయ్. సుగుణవంక చూసి తడబడిపోయింది లత.

''అదికాదు! ఎందుకంటే..."

''పరవాలేదమ్మా! నిజమేలే! పెద్దవయసు! కునికిపాట్లు పడతాను – అయినా తల్లినికదా! మొద్దునిద్ర రాదులే! విమలకి నాకంటె నువ్వే ఎక్కువగా ఉన్నావు. నువ్వు వెళ్తానంటే నాకే బెంగగా ఉంది. అయినా వెళ్ళు... ఎంత స్నేహితులయినా ఇలా రాత్రంతా హాస్పిటల్‌లో ఉంటానంటే ఏ తలిదండ్రులూ ఒప్పుకోరు!"

అప్పటికీ సందేహిస్తున్న లతను చూసి "రా!" అన్నాడు విజయ్ ఆజ్ఞా పిస్తున్నట్లే! ఆ స్వరానికి మాత్రం ఎదురుతిరగలేదు లత. ఆ స్వరం ఎప్పుడో తప్ప ఉపయోగించడు విజయ్.

క్షణం ఆగు విజయ్! ఇప్పుడే వస్తాను'' అని విజయ్ ఏ సమాధానమూ
[illegible]
ప్లీజ్ నర్స్!" అని టేబిల్‌మీద తలపెట్టి నిద్రపోతున్న నర్స్‌ను లేపింది. నర్స్

"అరె! అప్పుడే రెండయిందా?" హడావుడిగా మందు తీసుకుని బయలుదేర బోయింది నర్స్.

"రెండు కాలేదు. అప్పుడు గుర్తుచెయ్యటానికి నేను ఉండను! అందుకే... ఇప్పుడే హెచ్చరిస్తున్నాను..."

ఎప్పుడో ఇయ్యవలసిన మందుకోసం తనను ఇప్పుడే లేపినందుకు నర్స్ చికాకుపడి, "మా డ్యూటీ మాకు తెలుసు!" అంది కోపంగా.

'అంత తెలుసు కనుకనే కాబోలు, లేపగానే హడావుడిగా టైంకూడా గమనించకుండా మందియ్యడానికి తయారయ్యావు,' అని లోలోపల అక్కసుగా అనుకుని, "అయామ్ సారీ! మీరు మరిచిపోరని నాకు తెలుసు. ఊరికే గుర్తు చేసాను," అని చికాగ్గా తనకోసం ఎదురుచూస్తోన్న విజయ్ని కలుసుకుంది. తన దగ్గిరకు వచ్చిన లత చేతిని గట్టిగా పట్టుకున్నాడు విజయ్.

"ఇదేమిటి?"

"మళ్ళీ నువ్వు వెనక్కి పారిపోకుండా..."

నవ్వింది లత! విజయ్ చేతిలోంచి తన చేతిని లాక్కుని పారిపోయే శక్తి మాత్రం తనకు లేదు.

లతను చూడగానే పట్టరాని కోపం వచ్చేసింది లత తల్లి సుందరమ్మకి.

"ఏం తల్లీ! ఇది నీ ఇల్లనీ, ఇక్కడ నీ కోసం బెంగపడేవాళ్ళున్నారనీ, ఇప్పటికైనా గుర్తొచ్చిందా?" అంది.

లత తమ్ముడు జగన్ కల్పించుకుని, "దాని ముఖం చూడమ్మా! ఆ దేస్థితిలో ఉందో అర్థంచేసుకో! ఇప్పుడైనా కాస్త నిద్రపోనీ!" అన్నాడు.

ఎర్రబారిన కళ్ళతో, వడిలిపోయిన ముఖంతో, నలిగిన బట్టలతో ఉన్న కూతురిముఖం చూడగానే ఆ తల్లి మనసు కరిగిపోయింది. "పో! పోయి పడుకో!" అంది ప్రేమగానే అయినా కసురుతున్నట్టు.

"ఇంక నేను వెళ్ళొస్తానండీ!" అన్నాడు విజయ్.

"మంచిది నాయనా! వేళకానివేళ నిన్ను కష్టపెట్టాను. ఏం చెయ్యను? ఈ దెయ్యం నీ మాటతప్ప ఇంకెవరిమాటా వినదు..." అని కొంచెం ఆగి ముసి ముసిగా నవ్వుతూ, "అందుకే ఈ తిక్కమేళంతో నువ్వెలా వేగుతావో అనే బెంగ నాకు లేదు," అంది.

విజయ్ నవ్వి వెళ్ళిపోయాడు.

లతకోసం ఆరాటపడటంతో సుందరమ్మ నిద్ర తీరిపోయింది. పక్కమీద

అటూ యిటూ దొర్లి అలాగే కళ్ళుమూసుకు పడుకుంది. తలుపులు తెరుస్తున్న చప్పుడవటంతో భయంగా కళ్ళుతెరిచి నెమ్మదిగా బయటకు వెళ్ళబోతున్న లతను చూసి నిర్ఘాంతపోయింది.

''లతా! ఏవిటే ఇది? దేనికైనా అర్థంపర్థం ఉండాలి. ఇప్పుడు మళ్ళీ హాస్పిటల్‌కు బయలుదేరుతున్నావా?'' చండికలాగ అరిచింది. భయపడి పోయింది లత.

"కాదమ్మా కాదు! ఫోన్ చెయ్యటానికి..."

''ఇంత అర్ధరాత్రి ఫోన్ ఎవరికే!"

"హాస్పిటల్‌కేనమ్మా! ఇప్పుడే వచ్చేస్తాను..."

సుందరమ్మ ఇంకా ఏదో అనబోతుండగానే బయటకు పరుగెత్తింది.

పక్కింట్లో మేడపైన రెండు వాటాల్లో రెండు కుటుంబాలు అద్దెకుంటున్నాయి. సీతారామయ్యగారింట్లో ఫోన్ ఉంది. వాళ్ళమ్మాయి సరోజను మంచిచేసుకుని అప్పుడప్పుడు ఆ ఫోన్ ఉపయోగించుకుంటూ ఉంటుంది లత.

గబగబా వెళ్ళి తలుపు తట్టింది – తలుపులు తెరిచి, "ఎవరు?" అంటూ ప్రత్యక్షమయింది సుభద్రమ్మ. లత పై ప్రాణాలు పైనే పోయాయి. సుభద్రమ్మ పూర్తిగా పాతకాలపు మనిషి – ఆడది గడపదాటడమే ఆవిడ దృష్టిలో మహాప రాధం. చదువుకుని ఉద్యోగాలు చేసుకునే లతలాంటి ఆడపిల్లలపట్ల ఆవిడ కెలాంటి సదభిప్రాయమూ లేదు. "నువ్వా! ఇంత రాత్రివేళ ఇక్కడి కెందు కొచ్చావే? హన్నా! ఎంత జాణవే! నేరుగా ఇంటికే వచ్చేసావా?'' అంది దీర్ఘాలుతీస్తూ.

పెద్ద బొజ్జతో, బట్టతలతో యాభైయేళ్ళు పైబడ్డ ఆవిడ మొగుణ్ణి తలుచుకుని అలాంటి సమయంలోకూడా నవ్వొచ్చి నవ్వేసింది లత.

"ఛీ! ఛీ! సిగ్గులేని ముఖానికి నవ్వే సింగారమని..." దభాలున తలుపులు మూసి గట్టిగా గడియపెట్టుకుంది సుభద్రమ్మ.

తన కంగారుకు తనను తిట్టుకుని సీతారామయ్యగారింటి తలుపు తట్టింది లత. సరోజ నిద్రపోతోంది కాబోలు! సరోజ తల్లి లక్ష్మీదేవి తలుపు తీసింది. లత తడబడుతూ, ''ఫోన్ చెయ్యాలి?'' అంది.

లక్ష్మీదేవి విసుక్కుంటూ "ఫోన్ ఎందుకు పెట్టించుకున్నామా అని ఏడుస్తు న్నాను. వేళాలేదు – పాళాలేదు'' అంది. ఆ మాటలేవీ పట్టించుకోలేదు లత.







గబగబ ఫోన్ దగ్గిరకెళ్ళి హాస్పిటల్‌కు ఫోన్ చేసింది. నర్స్ పలికింది. ''పదమూడో నెంబర్ బెడ్‌లో ఉన్న రోగికి మందిచ్చారా?'' అంది లత.

నర్స్ లతగొంతు గుర్తుపట్టింది.

''ఇచ్చాను!'' అంది విసుగ్గా.

''నిజంగా ఇచ్చారా?''

నర్స్ టక్కున ఫోన్ పెట్టేసింది. తన చేతిలో ఉన్న రిసీవర్ వంక దిగాలుగా చూసి తనూ పెట్టేసింది లత.

లేచి వెళ్ళబోతుంటే ''డబ్బులు?'' అంది లక్ష్మిదేవి.

తను డబ్బులు తేలేదని అప్పుడు గుర్తొచ్చింది లతకి.

''సారీ! మరిచిపోయాను. రేపు తప్పకుండా ఇస్తాను...''

''ఇదొకటి! ఫోన్‌కాల్స్ ఊరికే వస్తాయా? ఆ మాత్రం మేనర్స్‌కూడా తెలియవు. చదువుకున్నారు మళ్ళీ...''

ఆ సణుగుడు వింటూ ఈడ్చుకుంటూ ఇంటికి చేరుకుంది లత.

మరునాడు కాఫీ తాగీతాగకుండానే బయలుదేరింది లత. చేసేదేమీలేక దణ్ణం పెట్టి ఊరుకుంది సుందరమ్మ.

మంచంమీద లేచి కూచున్న విమలను చూడగానే పట్టరాని ఆనందం కలిగింది లతకి.

''హమ్మయ్య! ఇంత త్వరలో నిన్ను డిస్చార్జ్ చేసేస్తారు. మనం ఇంటికి వెళ్ళిపోవచ్చు...'' అంది

"అదేమో! నా కయితే మనం ఇప్పట్లో ఈ హాస్పిటల్ వదలమని అని పిస్తోంది..."

లత ముఖం తెల్లగా పాలిపోయింది. "అదేం! మళ్ళీ నీకు..."

"నాకు కాదు. ఈ సారి రోగం వచ్చేది నీకు! అప్పుడు నీ కోసం నేన, హాస్పిటల్‌లో ఉండాలి! ఎలాగైనా మన కిద్దరకు హాస్పిటల్ తప్పదు!"

లతకు అర్థమయింది. పకపక నవ్వింది.

"నవ్వుతోంది, వెధవ నవ్వు! ఆ మొఖం చూడు! వెంటనే ఇంటికెళ్ళి స్నానం గినంచేసి ఏమైనా తినిరా?"

"వెళ్తాలే! కాసేపుండి..."

"ఇదుగో అమ్మాయ్! నా సంగతి నీకు తెలుసు! నువ్వు కదిలేవరకూ నేను మందూగిందూ ఏమీ తాగను!"

"మొండి! జగమొండి! మహామొండి!"

"అర్థమయిందికదా! బయల్దేరు!"

లత ఉసూరుమంటూ వెళ్ళబోతుంటే వెనకనుంచి "లతా!" అని పిలిచింది విమల.

లత సంతోషంగా వెనక్కు తిరిగింది.

"ఉండిపోమంటావా?"

"పళ్ళు రాలగొడతాను - అందుకుకాదు - వస్తూ వస్తూ మేగజీన్స్ తీసుకురా! బోర్ కొడుతోంది!"

"తీసుకురాను! అప్పుడే నువ్వు చదవకూడదు!"

"తీసుకొస్తావా? తన్నమంటావా?"

"నన్ను తంతే నష్టం నీకే! మళ్ళీ అడ్డంపడతావు!"

"నేను అడ్డంపడితే నష్టం నీకే! ఆ ముఖం చూస్తే తెలుస్తుంది. ఇంక చూడలేకపోతున్నాను. త్వరగా పో!"

నవ్వుకుంటూ విధిలేక బయల్దేరింది లత.

*　　*　　*

రికార్డింగ్ అనుకున్న టైమ్‌కి జరగకపోవటంతో విజయ్‌కుమార్‌కి ఆలస్యమయింది. అతడు రేడియోస్టేషన్‌నుండి బయటపడి ఆటోకోసం చూస్తుండగా రేడియోస్టేషన్ ఎదురుగాఉన్న బార్‌ముందు ఏదో పెద్ద గందరగోళంగా ఉంది. అడక్కుండానే రిక్షావాడు సమాచారం అందించాడు. "ఎవరో పెద్దింటమ్మ! మస్తుగా తాగి పడిపోనాది! రోజులు...!"

ఒక స్త్రీ... అందులో పెద్ద కుటుంబంలో వ్యక్తిలా ఉన్నది. తాగి రోడ్డుమీద పడిపోవటంతో అందరూ ఒక విడ్డూరంగా చూడసాగారు. తన కెందుకని వెళ్ళి పోతున్న విజయ్‌దగ్గిరకి గుంపులోంచి ఎవరో పరుగెత్తుకుని వచ్చారు.

"మిస్టర్ విజయ్‌కుమార్ మీరేనా ?"

"అవును !''

"రేడియో స్టేషన్‌లో మ్యూజిక్ ప్రొడ్యూసర్‌గా ఉన్నది మీరే కదూ ?"

''ఎందు కీ వివరాలన్నీ ?"

"క్షమించండి. అక్కడ పడిపోయినావిడ మీ పేరు చెప్పి మిమ్మల్ని పిలుచుకు రమ్మన్నారు..."

విజయ్ కుతూహలంగా అక్కడికి వెళ్ళాడు. బార్ ముందు కటిక నేలమీద పడి ఉన్న ఆ వ్యక్తిని చూడగానే అతనికి తలతిరిగింది... టాక్సీని రమ్మని పిలిచి క్రిందపడివున్న ఆ స్త్రీమూర్తిని చేతుల్లో ఎత్తుకుని టాక్సీలో పడుకోబెట్టాడు. ''విజయ్ ! నేను...నేను..."ముద్దముద్దగా ఏదో మాట్లాడటానికి ప్రయత్నిస్తోంది విలసిత స్పృహ ఉండీ లేని స్థితిలో... ఆ మాటలేవీ వినగలిగిన స్థితిలో లేడు విజయ్.

విలసితను చేతుల్లో ఎత్తుకుని లోపలకు వస్తున్న విజయ్‌ని నివ్వెరపోయి చూసింది శ్యామల. ఆ ముఖంచూసి తడబడ్డాడు విజయ్ !

"అమ్మా ! ఏమీ అనుకోకు – అన్ని సంగతులూ వివరంగా తరువాత చెబుతాను," అన్నాడు.

శ్యామల ఏమీ మాట్లాడలేదు. ముఖం చిట్లించుకుని వెళ్ళిపోయింది – విలసితను మంచంమీద పడుకోబెట్టి డాక్టర్‌కి ఫోన్ చేసాడు విజయ్.

"ఈవిడ మిసెస్ రాజారావు కదూ ! మీకు...''

కుతూహలంగా, వెటకారంగా అడుగుతోన్న డాక్టర్ ప్రశ్నకు సిగ్గుతో ఏ సమాధానమూ చెప్పలేక ముఖం తిప్పుకున్నాడు విజయ్ ! డాక్టర్ అర్థమయినట్లు నవ్వుతోంటే మరింత బాధ తోచింది.

డాక్టర్ వెళ్ళిపోయేవరకు తలతిప్పి విజయ్‌ను చూడలేదు విలసిత. ఆ తరువాత ''సారీ ! నీకు చాలా ఇబ్బంది కలిగించాను," అంది.

అస్తవ్యస్తంగా ఉన్న అలంకరణతో మంచంమీద పడుకున్న విలసితను పరీక్షగా చూసి నిట్టూర్చాడు విజయ్.

పాలరాతి బొమ్మలా ఉండే విలసితేనా ఈ వ్యక్తి? "విలసితా! సమయానికి నేను రాబట్టి సరిపోయింది కాని, లేకపోతే..."

"సమయానికి నువ్వు రాలేదు - నువ్వొచ్చే సమయానికి నేనే అక్కడున్నాను..."

"అంటే...?"

"ఆ టైమ్‌కి నువ్వు రేడియో స్టేషన్‌నుండి బయటికొచ్చి ఇంటి కెళ్తావని నాకు తెలుసు. దూరంనుంచయినా నిన్ను చూడాలని ఆ బార్‌లో కూచుంటాను రోజూ - ఇవాళ డోస్ ఎక్కువయింది. నీకు దొరికిపోయాను."

మాట్లాడలేకపోయాడు విజయ్. "విలసితా!" అన్నాడు నుదురుపట్టుకుంటూ.

"మళ్ళీ పిలు! నీ నోట నా పేరు విని ఎన్నో యుగాలయినట్లుగా ఉంది. ఆ పేరు మళ్ళీ అలా వింటుంటే పునర్జన్మ ఎత్తినట్లుగా ఉంది..."

"ప్లీజ్ విలసితా! అలా మాట్లాడకు!"

విజయ్ చెయ్యి అందుకోబోయింది విలసిత - చటుక్కున వెనక్కు తీసుకున్నాడు-చిన్నబుచ్చుకుంది విలసిత.

"పోనీలే! నేను వెళ్ళాక ఆ చేతిని ఏదైనా పవిత్రజలంతో శుద్ధిచేసుకో!..." నిష్ఠూరంగా అంది.

"నేనంత పవిత్రుణ్ని కానని నీకు తెలుసు!..."

"మరి ఎందుకిలా...?"

"క్షమించు! జుగుప్సనూ, చీదరనూ కోరి తెచ్చుకోలేను."

పాలిపోయింది విలసిత ముఖం—లేచి కూచుని, "ఇంత శ్రమపడ్డావు. ఇంకా సాయం చెయ్యి-నన్ను మా ఇంటిదగ్గిర దింపెయ్యి," అంది.

"వెళ్ళగలవా?"

"వెళ్ళలేను-కానీ, ఉండలేను కనుక వెళ్తాను."

విలసిత తన దగ్గిర వుంటున్నకొద్దీ తనకు కలుగుతోన్న ఆవేదన విజయ్ భరించలేక పోతున్నాడు—టాక్సీలో విలసితను ఇంటిదగ్గిర దింపి అదే టాక్సీలో వెళ్ళిపోబోయాడు...విలసిత ఒప్పుకోలేదు.

"ఒక్క క్షణం ఇంట్లోకొచ్చి కాస్త కాఫీతాగి వెళ్ళు," అంది.

"ఇప్పుడేం వద్దులే విలసితా..."

"మాలిన్యాలన్నీ నాలోనే వున్నాయి. నే నిచ్చే కాఫీమాత్రం ఒక దీనురాలి హృదయావేదనతో పరమ పవిత్రంగా వుంటుంది-ప్లీజ్! రా!..."

విజయ్ రాక్షసుడుకాడు_అవుదామనుకున్నా కాలేదు. ఎంత ఇష్టంలేక పోయినా విలసితతో లోపలికెళ్ళాడు. విలసిత కొన్ని నిముషాలలోనే ముఖం కడుక్కుని సీట్‌గా తయారయి వచ్చింది వంటవాడువున్నా విజయ్‌కి తనే కాఫీ ఫలహారాలు తీసుకొచ్చింది. కొన్ని నిముషాల్లోనే విలసిత ముఖంలో వచ్చిన మార్పును గమనిస్తూ కాఫీ తీసుకొన్నాడు విజయ్. టేప్ రికార్డర్ తీసుకొచ్చింది విలసిత..."విజయ్! ఒక్క పాట పాడు-రికార్డ్ చేసుకుంటాను-" అంది.

"ఇప్పుడా? మూడ్ లేదు."

"పరవాలేదు. ఏ మూడ్‌లోనైనా నువ్వు బాగా పాడగలవని నాకు తెలుసు. నువ్వు ఎలా పాడినా నేను మైమరచిపోతానని నీకు తెలుసు-పాడు!"

"సారీ విలసితా!..."

"నిన్ను కాదని డబ్బున్న వాణ్ని పెళ్ళిచేసుకున్నాను. అందుకే ఈ టేప్ రికార్డర్ సంపాదించగలిగాను. ఇప్పుడిక ఈ రికార్డర్‌లో నీ పాట రికార్డ్ చేసుకుని అది వింటూ నిద్రించి రాత్రులు గడుపుతాను. నా డబ్బుతో నన్నీమాత్ర మయినా సుఖపడనియ్యవా?"

వినలేకపోయాడు విజయ్.

"ఏం పాడమంటావు?"

"సృష్టిలో తీయనిది..."

పాడాడు విజయ్ తన్మయత్వంతో వింటూ రికార్డ్ చేసుకుంది విలసిత

"వెళ్తాను," అని లేచాడు.

"పోనీ, ఈ ఒక్కరోజుకి ఇక్కడ ఉండిపోరాదూ?"

"నావల్ల కాదు!"

"నేనంత జుగుప్సాకరంగా ఉన్నానా?"

"పడగమీది మణి ఎంతగా ప్రభలు విరజిమ్ముతున్నా దాని నెవరూ ఆశించరు. వెనుకనుంచి విషనాగు పూత్కారాలు కూడా వినిపిస్తూ వుంటాయి..."

"కొంచెంసేపు కూర్చో!"

"నిజం చెప్పు! నేను కూర్చుంటే నీకు హాయిగానే వుంటుందా?"

"ఏం చెప్పను? ఇలా నీతో గడపటమూ రంపపు కోతగానే వుంటుంది..

అయినా వెళ్ళమనలేను. ఎంత దారుణమైన రోగంతో బాధపడుతున్నా, ఆ బాధనే కోరుకుంటాం కాని మరణాన్ని కాదు."

ఇంక విలసిత దగ్గిర కూచోలేకపోయాడు విజయ్. లేచి రాబోతుంటే గుమ్మదగ్గిర రాజారావు ఎదురయ్యాడు.

"అరె! నేను లేకుండా రావటం, పోవటం కూడా జరుగుతోందే!" అన్నాడు ఆశ్చర్యం నటిస్తూ.

"తప్పనిసరి పరిస్థితుల్లో వచ్చాను. వెంటనే వెళ్ళిపోతున్నాను." కోపం అణచుకుంటూ అన్నాడు విజయ్.

"వెంటనే వెళ్ళిపోతున్నారా? అంత త్వరగా వచ్చినపని అయిపోయిందా?" మరింత ఆశ్చర్యంగా అడిగాడు రాజారావు.

విజయ్‌కి అసహ్యమేసింది.

"ఆ వివరాలన్నీ మీ భార్యనడిగి తెలుసుకోండి!" అనేసి వెళ్ళిపోయాడు.

విజయ్ వెళ్ళగానే విలసిత ఆడపులిలా గర్జిస్తూ, "ఆయనను ఎందుకలా అవమానించారు?" అంది.

విలసిత కోపాన్ని రాజారావు కొంచెంకూడా లక్ష్యంచెయ్యలేదు.

"ముందు నువ్విది చెప్పు-వాడిని ఇంట్లో ఎందుకు చేరనిచ్చావ్?"

"అతడు మీ రనుకుంటున్నంత నీచుడు కాదు." విరగబడి నవ్వాడు రాజారావ్.

"ఓ నారీమణీ! నీ పవిత్ర శీలాన్ని గురించి నాకేం బెంగలేదు. కానీ వాడి దగ్గిర డబ్బులేదు. వాడిని చేరదీస్తే మనకే నష్టం. డబ్బున్నవాళ్ళతో స్నేహం చెయ్యి-ఎంతమందితో స్నేహంచేసినా వద్దంటే అడుగు!"

"ఛీ! ఛీ!"

"ఛీ అంటున్నావా? వాడికీ, వాడి ప్రేమకీ తిలోదకాలిచ్చేసి నన్ను పెళ్ళి చేసుకున్నప్పుడు నువ్వు చాలా తెలివైనదానివనీ, నాకు తగిన భార్యవనీ, ఎంతో ఆనందించాను. ఇంతేనా నీ తెలివి? ఆల్‌రైట్. ఇవాళ పేకాటకి అయిదుగురొస్తున్నారు-డిన్నర్‌కి ఏర్పాట్లు చేయించు..."

ఉసూరుమనిపోయింది విలసిత.

డిన్నర్లు... పేకాట... తాగుడు! డబ్బువల్ల కలిగే సుఖాలు ఇవేనా? ఇందు కేనా అందరూ డబ్బుకోసం అంతగా తాపత్రయపడతారు? సరే! తనూ సుఖ పడుతుంది. ఫ్రిజ్‌లోంచి విస్కీబాటిల్ తీసింది—తాగింది. తల తిరుగుతోంది,




కాని, నిద్రరాదు. నిద్రమాత్రలు మింగింది-ఒకటి...రెండు...మూడు...నిద్ర రాదు...టేప్‌రికార్డర్ ఆన్ చేసింది. విజయ్ పాటవింటూ కలతనిద్రలోకి జారు కుంది...పట్టక పట్టక నిద్రపట్టిన ఆ నిద్రలో ఏదో పర్వతంమీద పడినట్లయి కళ్ళు విప్పింది...''నేనే హనీ! నేనే! హౌ స్వీట్...'' ఏవేదో అంటున్నాడు రాజారావు-మండుతోన్న కళ్ళను గట్టిగా మూసుకుంది విలసిత.

* * *

శ్యామల ముభావంగా తన పని తను చేసుకుంటోంటే విజయ్‌కి కష్టం వేసింది.

"అమ్మా! నేను విలసిత దగ్గిరకి వెళ్ళలేదు - తను..." ఆ తరువాత ఏం చెప్పాలో తెలియక ఆగిపోయాడు.

విలసితను తను ఏ పరిస్థితుల్లో చూసాడో తల్లి కెలా చెప్పటం?

"విజయ్! నువ్వు నాకేం పంజాయిషీలూ చెప్పుకోనవసర్లేదు. లత అమాయకురాలు. దానికి అన్యాయం చెయ్యకు - దాని మనసు కష్టపెట్టుకుని..."

"అత్తయ్యా!" అంటూ లత రావటంతో శ్యామల మాటలు ఆగిపోయాయి.

"వచ్చావా! నిండు నూరేళ్ళు నీకు! ఇప్పుడే నీ మాట అనుకుంటున్నాను..."

"నా మాట అనుకుంటున్నారా? ఏమని?"

"ఈ పిల్ల కోడలిగా నా ఇంటి కెప్పుడొస్తుందా? దానికి ఇల్లప్పజెప్పేసి నేను మా ఊరి కెప్పుడు వెళ్ళిపోదామా అని..."

"నేను రాగానే మీరు వెళ్ళిపోతారా?"

"అక్కడ మీ మావయ్యనూ చిన్నపిల్ల లిద్దరినీ కోడలిమీద వదిలి ఇక్కడుంటున్నాను విజయ్‌కోసం... నువ్వొచ్చాక ఇంక నేనెందుకు?"

"అయితే నేను రానే రాను - మీరు లేకపోతే నే నేమయిపోతాను?"

నవ్వుతూ అంటున్న లతను ఆప్యాయంగా చూసి "అల్లరి పిల్లా! తమషా కయినా అలా మాట్లాడకు. ఇదిగో ఈ కాఫీ వాడి కిచ్చిరా!" అని కాఫీ కప్పు అందించింది.

ఆ కాఫీ విజయ్ కందించి, "విజయ్! ఇవాళ నీ కో మంచి శుభవార్త చెప్పటానికి వచ్చాను!" అంది.

"ఏమిటది? మీ నాన్నగారు మన పెళ్ళికి ముహూర్తం నిశ్చయించారా!" అన్నాడు ఆశగా.

లతకు విజయ్‌తో వివాహం రెండు నెలల క్రిందటే జరగవలసింది. పెళ్ళి చూపులు చాలా అధునాతనమైన పద్ధతిలో జరిగాయి. అటు పెద్దవాళ్ళూ, ఇటు పెద్దవాళ్ళూ ఎవరూ లేరు. విజయ్ మామూలుగా స్నేహితుడిలా తనొక్కడూ వచ్చాడు. విజయ్‌ని ఆహ్వానించి హాల్లో కూర్చోబెట్టి, విజయ్ వచ్చిన సంగతి ఇంట్లోచెప్పి ఏదో పని ఉన్నట్లుగా బయటి కెళ్ళిపోయాడు లత తండ్రి కృష్ణమూర్తి. లత మామూలు ఫుల్‌వాయిల్‌చీర కట్టుకుని, బొట్టూ, కాటుకతో సింపుల్‌గా ఉంది.

"లతా! ఇదిగో, ఈ కాఫీ ఆయన కిచ్చిరా!" అంది సుందరమ్మ.

"నువ్వే ఇయ్యమ్మా! నాకు భయంగా ఉంది!"

"ఇదెక్కడి విడ్డూరమే! ఎం. ఏ., పాసయి 'నాకు భయమం'టే ఎవరైనా నవ్వుతారు. అయినా అతడు వచ్చిందెందుకు? ఇచ్చిరా!"

అతడు వచ్చిందెందుకో లతకు తెలుసు - అందుకే నెర్వస్‌గా ఉంది. మామూ

లుగా ఉండాలని ప్రయత్నిస్తూ కాఫీకప్పు తీసుకుని వచ్చింది. లతను చూడ గానే నవ్వి చేతులు జోడించాడు విజయ్. లత కంగారుగా నవ్వి, తనూ నమస్కారం చెయ్యబోయి, చేతిలోఉన్న కాఫీ టీపాయ్‌మీదా, విజయ్ బట్టల మీదా వొలకపోసేసింది. అక్కడితో మరింత కంగారుపడి తన రుమాలుతో విజయ్ బట్టలమీద వొలికిన కాఫీ తుడిచెయ్యబోయింది. విజయ్ సంకోచంతో వెనక్కు తగ్గటంతో తను పరాయి మొగవాడికి అంత దగ్గరగా వచ్చానన్న సంగతి గుర్తొచ్చి, సిగ్గుపడిపోయి, దూరంగా జరిగి, "కాఫీ నేను వొలకపోసాను. మీ బట్టలు పాడయిపోతాయి..." అంది తడబడుతు... అప్పటికే నుదుటినిండా చెమటలు పట్టాయి. విజయ్ బట్టలమీద కాఫీ మరకలు తుడిచిన రుమాలుతోనే తన నుదురు తుడుచుకుంది. కాఫీ మరకలన్నీ నుదుటిమీద చారికలుగా ఏర్ప డ్డాయి. తన ఎదురుగా ఉన్న ఆ "పెళ్ళికూతురి" అవతారాన్ని చూసి విజయ్ నవ్వు ఆపుకోలేక పకపక నవ్వేసాడు. బిత్తరపోయి చూసింది లత "క్షమిం చండి! మీ బట్టలమీద కాఫీ ఒలకపోసింది నేను - నేను చేసిన తప్పు నేను సర్దు కోవాలనే ఆరాటంలో ఏదీ ఆలోచించలేదు..." సిగ్గుపడుతోనే ధైర్యంగా చెప్పింది.

''మళ్ళీ వస్తాను" అని వెళ్ళిపోయాడు విజయ్.

అక్కడే పేముకుర్చీలో కూర్చుండిపోయింది లత.

కొంచెంసేపటికి సుందరమ్మ కూతురిదగ్గరకొచ్చి కుతూహలంగా "ఆ అబ్బాయి ఏం మాట్లాడాడే?'' అని అడిగింది.

"'మళ్ళీ వస్తాను' అన్నాడు."

"అదేమిటే? అంతేనా?''

"అంతే!"

తెల్లబోయింది సుందరమ్మ. అక్కడ వొలికిన కాఫీ చూసి "ఇదేమిటే?" అంది. లత సమాధానం చెప్పలేదు.

పకపక నవ్వుతోన్న విజయ్ ముఖం లతకు ఒక్క క్షణమయినా మరపు రావటంలేదు. అయినా విజయ్ తనను అంగీకరిస్తాడనిమాత్రం ఆశపెట్టుకో లేదు. ఆ తరువాత కొద్దిరోజుల్లోనే విజయ్ తల్లి శ్యామల మరికొందరు మధ్య వర్తులతోవచ్చి లతను చూసింది. ఆ రోజు లత చాలా పొందికగా కూర్చుని శ్యామలతో చాలా వినయంగా మాట్లాడింది.

"మా అబ్బాయికి మీ అమ్మాయి నచ్చింది. వీలుచూసుకొని ముహూర్తం

నిశ్చయించండి!" అని శ్యామల అన్నప్పుడు లత ఆనందానికి అంతులేదు. కృష్ణమూర్తి, సుందరమ్మకూడా చాలా సంతోషించారు...

అయితే పెళ్ళిమాత్రం వెంటనే జరిపించటానికి వీల్లేకపోయింది. లత అక్క జయకు సంబంధం నిశ్చయమయినా ఆ వరుడు తన రీసెర్చ్ పూర్తయి డాక్టరేట్ డిగ్రీ తీసుకున్నాక కాని పెళ్ళిచేసుకోనని అన్నాడు. పెద్దమ్మాయికి కాకుండా రెండో అమ్మాయికి చెయ్యటం ఇష్టంలేక కొంచెంరోజు లాగమని విజయ్‌ని కోరాడు కృష్ణమూర్తి. విజయ్ ఒప్పుకున్నాడు. ఆ తరువాత లత విజయ్‌తో, "మీ బట్టలమీదపడ్డ కాఫీ అలా తుడిచినందుకు మీరు నన్ను లేకి మనిషి అనుకుంటారేమోనని భయపడ్డాను!" అంది.

విజయ్ నవ్వి, "లేకి మనుష్యులు అలా ఉండరు! ఆరోజు నుదుటిమీద కాఫీ మరకలతో — చేతిలో సగం ఒలికిపోయిన కాఫీ కప్పుతో... కంగారుగా బెదిరి పోయే చూపులతో... నువ్వెంత అందంగా ఉన్నావో తెలుసా?" అన్నాడు.

ఆ సంఘటన గుర్తువచ్చినప్పుడల్లా లతకు సిగ్గూ వేస్తుంది, నవ్వూ వస్తుంది.

తమ వివాహం త్వరలోనే జరిగిపోవాలని ఉంది విజయ్‌కి. అందుకు లత శుభవార్త అనగానే పెళ్ళి నిశ్చయించారనే అనుకున్నాడు.

"అదికాదు! అంతకంటే శుభవార్త...!" కవ్విస్తూన్నట్లు అంది లత.

"అంతకంటే శుభవార్తా? ఏమి టబ్బా అది?"

"విమలకుకూడా మా కాలేజీలోనే ఉద్యోగం దొరికింది."

విజయ్‌కు నిజంగా ఆశాభంగం కలిగింది.

"ఇడియట్! శుభవార్త... శుభవార్త... అని నన్నూరించి ఇదా నువ్వు చెప్పేది? అవతలకు పో!"

"పోను! పోనంటే పోను! నా ప్రాణాలు పోవాలేకాని, నేను మాత్రం నీకు దూరంగా పోను."

చటుక్కున లత చెయ్యి తన చేతిలోకి తీసుకుని "ఏమిటిది? తమాషాకేదో అంటేకూడా ఇంతగా కదిలిపోవాలా?" అన్నాడు విజయ్.

లత విజయ్ గుండెలమీద తలవాల్చి, "విజయ్! ఎప్పుడేం జరిగినా, ఏది ఏమయినా నన్ను మాత్రం నీకు దూరం కానీయకు! అలా జరిగితే అసలిక లత ఉండదు!" అంది.

విజయ్ మాట్లాడలేదు. లత చుట్టూ చెయ్యివేసాడు. దృఢంగా తనను చుట్టిన ఆ హస్తం మాటలకందని సమాధానాన్ని అందించింది లతకి.

* * *




లత తయారయి వచ్చేసరికి విమల బాబ్జీకి లాగూ చొక్కా తొడుగుతోంది. ముఖం చాలా కోపంగా ఉంది.

ఏదో జరిగిందని గ్రహించింది లత... ఆ సమయంలో విమలను ఏం జరిగిందని అడగటంకంటె తెలివితక్కువ మరొకటి లేదు.

"ఇవాళే నువ్వు డ్యూటీలో జాయినవ్వాలి. కాలేజీకి రావూ?" అని అడిగింది.

"వస్తున్నా!" కసురుతున్నట్లు అని, పనిమనిషికి బాబ్జీని అప్పగించి, "జాగ్రత్తగా తీసికెళ్లు" అని హెచ్చరించి, హేండ్‌బేగ్‌లో సర్టిఫికెట్లు సర్దుకుని బయలుదేరబోయింది విమల.

సుగుణ వెనకనుంచి హీనస్వరంతో "అన్నం తిని వెళ్ళు విమలా!" అంది. ఆవిడ ముఖం బాగా ఏడ్చినట్లు ఉబ్బి ఉంది.

విమల తల్లికి ఏ సమాధానం చెప్పకుండా లతతో, "పద!" అంది. సుగుణ ముఖంచూస్తూ లత ఊరుకోలేకపోయింది.

"భోజనం చేసెయ్యి విమలా! పరవాలేదు. టైముంది. అంతగా అయితే ఏ ఆటోలోనైనా వెళ్దాం!" అంది.

"నేను వెళ్తున్నాను. నువ్వు వస్తే రా! లేకపోతే లేదు."

లత నిస్సహాయంగా సుగుణను చూసి తల తిప్పుకునేలోపలే విమల వీధిలో ఉంది. కంగారుగా విమల వెనకపడింది లత.

విమల ముఖంలోకి పులుకు పులుకున రెండు మూడుసార్లు చూడటంతప్ప ఏమీ ప్రశ్నించలేదు లత.

ప్రిన్సిపాల్ రూంలోకి వెళ్ళి ఆవిడకి జాయినింగ్ రిపోర్ట్ ఇచ్చి ఇద్దరూ ఆఫీస్ రూంలోకి వచ్చారు. విశాలమైన కుర్చీ పట్టక ఇరుగ్గా కూచున్న రాణి అక్కడి క్లర్కుతో ఏదో ఒక జోక్ కట్ చేసి విరగబడి నవ్వుతోంది. యాభై యేళ్ళు పైబడ్డాయి రాణికి... ఆ వయసు దాచుకోవాలని ఆవిడ ప్రయత్నిస్తున్న కొద్దీ అది మరింత విజృంభించి రాణిలో ప్రత్యక్షమవుతోంది. పెదవులకు లిప్‌స్టిక్ రాస్తుంది. కనుబొమలూ కనుకొలకులూ దిద్దుకుంటుంది. ప్రత్యేకం విదేశాల నుంచి తెప్పించిన సెంట్లూ పౌడర్లూ వాడుతుంది. అడ్డంగా పెరిగిన శరీరంమీద అతి పలచని చీరలు కడుతుంది. ఏ చీరరంగుకి సరిపోయే బొట్టు ఆ చీరమీద పెట్టుకుంటుంది. ఆ రంగు రిబ్బన్‌కూడా కట్టుకుంటుంది. ఆఫీస్‌లో ఇంకొక క్లర్కు ఉన్నాడు. అతడు చాలా చిన్నవాడు. కొత్తగా డిగ్రీ తీసుకున్నవాడు. అతడితో చవకరకం జోక్స్ కట్‌చేస్తూ ఉంటుంది. అతడు నవ్వక తప్పదు!

ఆఫీస్‌లోకి రాగానే రాణికి రెండుచేతులూ జోడించి నమస్కారం చేస్తున్న లతను విస్తుపోయి చూసింది విమల. లత మాత్రమే కాదు. ఆ సమయంలో అక్కడికి వచ్చిన మరో ఇద్దరు లెక్చరర్లుకూడా రాణికి వినయపూర్వకంగా నమస్కారంచేసి ఏదో పనికట్టుకుని పలకరించటం గమనించింది. రాణి రాణి లాగే ఆ నమస్కారా లందుకోవటమూ చూసింది.

"ఆవిడెవరూ?" అని అడిగింది లతని.

"ఇక్కడ క్లర్కు."

విమల రాణిని చూసింది. నమస్కారం చెయ్యలేదు. "విష్ చెయ్యి" అని లత గొణుగుతోన్నా వినిపించుకోలేదు.

మరొక క్లర్కును రిజిస్టర్ అడిగి తీసుకుని బయటకు వచ్చెయ్యబోతూ రాణి ముఖంలోకి చూసింది. రాణి ముఖం కోపంగా కరకరలాడుతోంది. రాణికి అర్థ మయ్యేలా కనీ కనపడనట్లు నవ్వి ఆఫీస్‌లోంచి వచ్చేసింది విమల.

"ఏవిటి విమలా?" అంది గాభరాగా లత.

"ఏవిటి?" తాపీగా చిరునవ్వుతో అంది విమల.

"నువ్వు ఆవిడ నెందుకు విష్ చెయ్యలేదూ?"

"ఎందుకు చెయ్యాలి? ఆవిడ మనకు బాస్ కాదు. కొలీగ్‌కూడా కాదు. న్యాయంగా ఆవిడే నన్ను విష్‌చెయ్యాలి!"

"ఆవిడెవరో నీకు తెలుసా?"

"క్లర్కు అని నువ్వు చెప్పావుగా!"

"అదికాదు! ఆవిడ మేనేజ్‌మెంట్‌లో ఒకరికి వదినగారవుతుంది. అంతే ఆయన ఉంచుకున్నావిడకి ఈవిడ అక్కవరుస..."

"బ్రహ్మాండంగా ఉంది. అయితే...?"

"అయితే... అయితే..." ఏం మాట్లాడలేక అయోమయంగా చూసింది లత.

పకాలున నవ్వింది విమల.

"న్యాయంగా నిరసించి ఈసడించవలసిన విషయాన్ని మీరు చాలా గౌరవంగా చూస్తున్నారు. ఈ సంస్కారం గొప్పదే! నా మటుకు నేను మరొకరి వ్యక్తిగత విషయాల్లో కలిగించుకోను. కానీ, అనవసరంగా మరొకరిని ప్రాధేయపడటం మాత్రం నా వల్లకాదు. ఎవరైనా సరే!"

లత మాట్లాడలేదు. గుటకలు మింగింది. లంచ్ ఇంటర్వెల్‌లో అందరూ లంచ్ తీసుకుంటున్నప్పుడు విమల ఎడంగా కూర్చుంటే లత తనూ తినలేక పోయింది. విమల పక్కనవచ్చి కూచుంది.

"నువ్వు తిను లతా!" ప్రాధేయపడుతున్నట్లు అంది విమల.

లత సమాధానం చెప్పలేదు. కదలలేదు. పుస్తకం తీసి చదువుతున్నట్లు నటిస్తూ విమల పక్కనే కూచుంది.

"ఇవాళ నేను తినకుండా వచ్చాను. అమ్మకూడా ఏమీ తినదు. నాకు తెలుసు. నేను తినలేను లతా!"

"ఎందుకలా చేసావ్ మరి? ఆ పెద్దావిడ నలా ఏడిపించవచ్చా! అందులో ఆవిడ మీ నాన్నగారు పోయిన దుఃఖంతో ఎంత కృంగిపోతున్నారు!"

"అయితే మాత్రం! పసివాడు బాబ్జీ ఏంచేసాడు? వాడు పుట్టటంవల్లే నాన్న పోయారట! వాడి నక్షత్రం మంచిది కాదుట! ఎటూకాని వయసులో శనిలా పుట్టి నాన్నని మింగి కూచున్నాడట! ఏమిటా సెంటిమెట్లు? ఇవాళ వాడికి స్నానం చేయించమంటే విసుక్కుని వాడిని కొట్టింది. నేను సహించలేక పోయాను."

"పాపం, ఆవిడ బాధ నీకెలా అర్థమవుతుంది విమలా?"

"ఏమన్నావ్? నాకు మాత్రం బాధ లేదా? బాబ్జీ చాలా ఆలస్యంగా పుట్టాడు. నేనొకదాన్నే అంతకుముందు... ఎంత గారాబం నేనంటే నాన్నగారికి! నేను ఎంత ఆరోగ్యంగా ఉన్నా రోజూ బోర్నవిటా దగ్గిరుండి తాగించేవారు. ఏ సినిమాకు వెళ్ళినా నన్ను వెంటపెట్టుకుని వెళ్ళేవారు. ఎవరికైనా "మా అమ్మాయి" అని నన్ను పరిచయం చేసేటప్పుడు ఆ కళ్ళలో గర్వం

చూడాలి. నాకు ఏ పెళ్ళిసంబంధం వచ్చినా ముందు ఆయనకే నచ్చేదికాదు. నాకేదో గొప్ప సంబంధం తేవాలని ఆరాటపడేవారు. చివరకు కన్ను మూసే ముందుకూడా ఆయన కలవరించింది నా పేరే..."

విమల ఆగిపోయింది... లతకు కళ్ళు చెమ్మగిల్లాయి. విమల చెయ్యి ఆప్యా యంగా నొక్కి "అయామ్ సారీ'' విమలా! అంది.

"కానీ అంతమాత్రంచేత బాబ్జీని అందుకు నెపంగాచేసి, ఆ పసివాడి నలా నిర్లక్ష్యం చెయ్యటం సహించలేకుండా ఉన్నాను. ఇలాంటి పిచ్చి సెంటిమెంట్లంటే నాకు చికాకు..."

"ఆవిడకుమాత్రం బాబ్జీమీద ప్రేమ లేదంటావా? మనసు స్థిమితంలేక..."

''స్థిమితం ఎందుకు లేకపోవాలి?"

"ఆవిడ స్థానంలో ఉంటే అర్థమవుతుంది."

"ఏ స్థానంలోఉన్నా అర్థమవుతుంది. ఈ జీవితంలో ప్రతి క్షణమూ అమూల్య మైనది. బాధలను నెపంగా లేని బాధ్యతలను తప్పించుకునే వాళ్ళపట్ల నాకు సానుభూతి లేదు."

విమల పట్టుదల లతకు తెలుసు. తను ఎంతగా ప్రాధేయపడినా ఏమీ ప్రయోజనం ఉండదు.

విమల ఇంటికొచ్చేసరికి సుగుణ బాబ్జీని దగ్గిరగా కూచోబెట్టుకుని అన్నం తినిపిస్తోంది. దీనంగా ఉన్న సుగుణ ముఖంచూసి విమల కోపమంతా ఎగిరి పోయింది.

తల్లి మెడచుట్టూ చేతులువేసి "బాబ్జీకి అన్నం పెట్టగానే మన ఇద్దరికీకూడా వడ్డించెయ్యి. ఆకలి మండిపోతోంది,'' అంది.

''ఇంతవరకూ నువ్వు ఏమీ తినలేదా?" కష్టపెట్టుకుంటూ అడిగింది సుగుణ.

"నువ్వు తిన్నావా?" అల్లరిగా, ఆప్యాయంగా ఎదురు ప్రశ్నించింది విమల.

సుగుణ ఒక్క నిట్టూర్పు విడిచింది.

"అదే వద్దన్నాను – త్వరగా అన్నంపెట్టు. నువ్వూ పెట్టుకో! లేకపోతే నేను తినను..."

నవ్వుతూ నవ్విస్తూ తల్లి అన్నం తినేలా చేసికాని తను తినలేదు విమల.

ఆ రోజు ఆర్.టి సి. ఉద్యోగులందరూ ఒక స్టూడెంట్ కండక్టర్‌ను కొట్టి నందుకూ, బస్ తగలబెట్టినందుకూ, స్ట్రయిక్ చేసారు. బస్‌లు లేవు.

''ఇవాళ బస్‌లు రావు. అంచేత స్టూడెంట్స్ ఎవరూ రారు. మనం కాలేజీకి




వెళ్ళి సైన్‌చేసి సినిమాకి పోదాం!" అది లత. విమల ఒప్పుకుంది. ఇద్దరూ కొత్తగా విడుదలయిన సినిమాకి మాట్నీకి టికెట్స్ రిజర్వ్ చేయించుకున్నారు.

తీరా కాలేజికి వెళ్ళేసరికి స్టూడెంట్స్ అందరూ వచ్చారు. మామూలు రోజుల్లో కంటె క్లాస్‌రూంలు కిటకిటలాడుతున్నాయి. తెల్లబోయారు లెక్చరర్స్ అందరూ.

"ఇవాళ ఎవరూ రారనుకున్నాం!" అంది ఒకావిడ.

ఈ ఆడపిల్లలకు ఇల్లుకంటె కాలేజీయే బాగుంటుంది. అందుకని వద్దన్నా వస్తారు," అంది మరొకావిడ.

తీరా విమల క్లాస్‌కి బయలుదేరబోయేసరికి ఇద్దరమ్మాయిలు విమలదగ్గిర కొచ్చి "మేడమ్! ప్లీజ్! ఇవాళ క్లాస్‌కు రావొద్దు'' అన్నారు.

విమల ఆశ్చర్యంగా "బస్‌లు లేకపోయినా ఇంత శ్రద్ధగా వచ్చారు. క్లాస్ వద్దంటున్నారా?" అంది.

''అదికాదు మేడమ్! ఇవాళ మూడొంతులు క్లాసు లుండవని, సినిమాకు వెళ్దామని టికెట్స్ రిజర్వ్ చేయించుకున్నాం? అందుకని..."

నిర్ఘాంతపోయింది విమల. లతకు ఆపుకోరాని నవ్వొచ్చి పైటకొంగు ముఖాని కడ్డంపెట్టుకుంది.

"వీల్లేదు. నేను క్లాస్ తీసుకుంటాను," కచ్చితంగా చెప్పింది విమల. ఆ పిల్లలు బిక్కముఖాలతో వెళ్ళిపోయారు.

"పోనీ విమలా! క్లాస్ క్యాన్సిల్ చెయ్యకపోయావా? సుఖంగా మనమూ సినిమాకు పోయేవాళ్ళంగా!" అంది లత.

"నువ్వూ, నీ సినిమా... ఎవరూ రారనుకుని సినిమా ప్రోగ్రాంకి ఒప్పు కున్నాను. తీరా వీళ్ళంతా వచ్చాక, ఇప్పుడు క్లాస్ కాన్సిల్ చెయ్యను."

"ఎవరిమటుకు వాళ్ళే ఎవరూ రారనుకుని సినిమా సన్నాహంమీదే వచ్చారు."

"ఏదయితేనేం వచ్చారు. అదీగాక వాళ్ళు క్లాస్ ఎగ్గొట్టి సినిమాకు వెళ్ళి, మనమూ క్లాస్‌లు మానేసి అదే సినిమాకువెళ్తే వాళ్ళ దృష్టిలో మనం ఎంత చులకనఅయిపోతామో ఆలోచించు..."

లత బేగ్‌లోంచి టికెట్స్ అందుకుని చింపి పారేసింది విమల.

విమల పట్టుదలగా క్లాస్ కెళ్ళేసరికి క్లాస్‌లో పదిమందికూడా లేరు. వాళ్ళు సినిమాకోసం కాలేజీకి వచ్చారు. కాని క్లాస్‌కోసం కాదు. వేసుకున్న ప్రోగ్రాం కాన్సిల్ చేసుకోవటం ఇష్టంలేక వెళ్ళిపోయారు. ఆ పదిమందికే క్లాస్ తీసుకొంది విమల.

* * *

లలితసంగీత కార్యక్రమంలో తన పాటలు తనే వింటున్నాడు విజయ్ రికార్డింగ్ రూంలో కూచుని. విజయ్ కంఠంలో గాంభీర్యమూ, మాధుర్యమూ సమపాళ్ళలో ఉంటాయి గాయకుడిగా చాలా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నాడు. ఆలిండియా రేడియోలో మ్యూజిక్ ప్రొడ్యూసర్‌గా పనిచేస్తున్నాడు. ఫోన్ వచ్చిందని మెసేజ్ వచ్చింది. రికార్డింగ్ రూంలోనుండి ఆఫీస్ రూంలోకి వచ్చి ఫోన్ అందుకున్నాడు.

"హలో ? నేను విజయ్...!"

ఆ కంఠం వింటూనే విజయ్ ఎలాగో అయిపోయాడు. ఏవిటీ విలసిత ? ఎందుకిలా తనను వేటాడుతోంది ?

"విజయ్ ! ఇప్పుడే నీ పాట విన్నాను. రికార్డ్ చేసుకున్నాను కూడా ! నిన్ను మరిచిపోదామని గట్టిగా సంకల్పించుకుంటాను. అంతలోనే నీ మధుర సంగీత ధ్వని వినిపిస్తుంది. ఆ ధ్వని తరంగాలు నా అంతరంగాన్ని అల్లకల్లోలం చేసేస్తున్నాయి విజయ్..."

"......"

"హలో..."

"యస్..."

"ఒక్కసారి మా ఇంటికి రావూ ?"

"రాను !"

"ఈ సమాధానమే ఆశించాను. నాలుగు రోజులుగా మంచంమీదనుంచి కదలలేని స్థితిలో ఉన్నాను. ఒక్కసారి నిన్ను చూడాలనిపిస్తోంది – నువ్వు రాకపోతే నేను వచ్చేస్తాను."

"విలసితా! నువ్వు నా కసలు అర్థం కావటంలేదు..."

"అర్థం చేసుకోవటానికి ప్రయత్నించకు? ఆనందించటానికే చూడు..."

"అప్పుడది ఆనందం అవదు – ఆ సంగతి నీకే ఒకనాటికి అర్థమవుతుంది..."

"మంచంలో ఉన్నాను. ఒక్కసారి నా దగ్గిరకు వస్తే నీ పవిత్రతకు ఎలాంటి భంగమూ కలిగించను...''

"నువ్వు ఏ పరిస్థితుల్లో ఉన్నా ఆ విషయంలో నా కేమీ భయంలేదు – అందుకు కాదు..."

"మరి దేనికి... ?"

''ప్లీజ్ విలసితా! నిన్ను మరిచిపోనియ్యి!"

"అంటే? ఇంతవరకూ మరిచిపోలేదనే గదూ! థాంక్యూ విజయ్..."

ఫోన్‌లోనే దగ్గువచ్చింది విలసితకు. ఊపిరాడకుండా పది నిముషాలు దగ్గుతూ ఉక్కిరిబిక్కి రయిపోయింది.

"విజయ్! నేను వస్తాను. రేడియో స్టేషన్‌కే వస్తాను" విపరీతంగా ఆయాసపడుతూ అంది విలసిత.

"వద్దు, నువ్వు రాకు! నేనే వస్తాను..."

''థాంక్యూ! థాంక్యూ వెరీమచ్!"

విజయ్ మనసు మొద్దుబారినట్లయిపోయింది. దగ్గుతూ ఆయాసంతో బాధపడుతూ విలసిత రమ్మంటున్నప్పుడు ఆ కంఠం వింటూ రానని అనలేకపోయాడు. కానీ ఇప్పుడుమాత్రం విలసితనుండి – విలసితకు సంబంధించిన స్మృతు లన్నింటినుండీ దూరంగా పారిపోవాలని ఉంది.

విలసిత దగ్గిరకు వెళ్ళకూడదనే నిర్ణయించుకున్నాడు విజయ్. కానీ అతడు డ్యూటీ ముగించుకుని రేడియో స్టేషన్ బయటకు వచ్చేసరికి అక్కడ విలసిత కారు సిద్ధంగా ఉంది. డ్రైవర్ విజయ్‌కి నమస్కారంచేసి "అమ్మగారు మిమ్మల్ని తీసుకురమ్మన్నారు," అన్నాడు.

మాట్లాడకుండా వెళ్ళి కారులో కూచున్నాడు విజయ్. విలసితకి ఫ్లూ వచ్చింది. మనిషి నిజంగానే చాలా నీరసంగా చిక్కిపోయి ఉంది. విజయ్‌ని చూడగానే ఆ

జబ్బు ముఖంలోకి ఒక్కసారిగా జీవం పొంగివచ్చింది. అది గమనించాడు విజయ్. ఓపిక లేనివాడిలా అక్కడి కుర్చీలో కూలబడి కళ్ళకు చెయ్యి అడ్డం పెట్టుకున్నాడు.

"బాధపడుతున్నావా విజయ్? నా కోసం...?" అందంగా నవ్వుతూ అడిగింది విలసిత....ఏమి అందం? ఆ చిరునవ్వును చూస్తూ ఎవరు చూపులు తిప్పుకోగలరు?

"బాధపడాలనేకదూ, నువ్వు పిలిచింది?"

పకపక నవ్వింది విలసిత.

"నువ్వు చిత్రమయినవాడివి విజయ్! నాకు ప్రేమలో నమ్మకంలేదు, పెళ్ళిలో నమ్మకంలేదు – సుఖంలో మాత్రమే నమ్మకం! నాకు రూపం ఉంది! డబ్బు ఉంది – ఆరోగ్యమూ ఉంది – సుఖపడాలని ఉంది. కానీ, అప్పుడప్పుడు ఆ సుఖం ఎక్కడుందో మాత్రమే అర్థంకాకుండా పోతుంది!"

"నన్ను రమ్మనటం మానెయ్యి. సుఖపడతావు!"

పడుకున్న విలసిత చేతిమీద సగంలేచి కూచుని విజయ్ ముఖంలోకి చూస్తూ చిలిపిగా నవ్వింది.

"ఎన్నో విధాల సుఖపడాలని ప్రయత్నించి ప్రయత్నించి చివరకు అసలు రహస్యం తెలుసుకున్నాను. ఇలా బాధపడటంలోనే నేను నిజంగా సుఖపడుతున్నానని."

"హలో! మిస్టర్ విజయ్‌కుమార్!" పెద్దగా నవ్వుతూ చెయ్యి జాపుతూ వచ్చాడు రాజారావు. రాజారావు చెయ్యి మర్యాదగా అందుకున్నాడు విజయ్.

"నిన్న సాయంత్రం మీ మ్యూజిక్ ప్రోగ్రాంకి నేనూ వచ్చాను. చాలా బాగా పాడారు!" విజయ్ పక్కనే కుర్చీ లాక్కుని కూర్చుంటూ అన్నాడు రాజారావు.

"థాంక్స్!"

"మా విలసితకి మూడు రోజుల్నించీ జ్వరం. నిన్న మిమ్మల్ని కలవరించింది కూడా! నేనే మిమ్మల్ని పిలవాలని అనుకున్నాను – మీరే వచ్చారు..."

ఇబ్బందిగా కుర్చీలో కదిలాడు విజయ్.

"రోజులు మారాయి సార్! వెనుకటి కాలంలో ఆడపిల్లలు కులాసాగా తిరగటానికి రమ్మంటే భయపడేవారు. పెళ్ళికి మాత్రమే ఒప్పుకునేవారు. ఇప్పుడలా కాదు. మామూలుగా ఎంత ఫ్రీగా అయినా ఉంటారు. దేనికీ సంకోచించరు.




కానీ పెళ్ళికి మాత్రం వాళ్ళే ఒప్పుకోరు. ఆ విషయంలోమాత్రం సెంటిమెంట్లు అవతల పారేసి వ్యవహార పక్షంగా ఆలోచిస్తారు...''

విజయ్ విలసిత ముఖంలోకి చూసాడు. జ్వరంతో పాలిపోయిన ఆ ముఖం రోషంతో మండిపోతోంది. తడారిపోయిన పెదవులు అదురుతున్నాయి. రాజారావు చిరునవ్వుతో ఇద్దరినీ చూసాడు. మళ్ళీ మొదలుపెట్టాడు.

"మొగవాళ్ళ విషయమూ అంతే! ఇదివరలో డబ్బుకోసం ఆడవాళ్ళు మొగవాళ్ళవెంట పడేవారు. ఇప్పుడు మొగవాళ్ళుకూడా డబ్బుకోసం ఆడవాళ్ళవెంట పడుతున్నారు. మేల్ ప్రోస్టిట్యూట్స్! స్త్రీ పురుషులకు సమాన హక్కులు!"

పకపక నవ్వసాగాడు రాజారావు.

ఆ రకమయిన వాతావరణంలోకి వచ్చినందుకు విజయ్‌కి తనమీద తనకే జుగుప్స కలిగింది.

"వస్తాను'' అని లేచి బయలుదేరాడు. వెనుకనుండి విలసిత "విజయ్!" అని దీనంగా పిలిచింది. విజయ్ ఆగలేదు. వెనక్కు తిరగలేదు.

"మళ్ళీ నిన్నెప్పుడూ ఇక్కడికి రమ్మనను. కానీ నేను చచ్చిపోబోతున్నానని తెలిసినప్పుడు మాత్రం ఒక్కసారి – చివరిసారి నా దగ్గిరకి రా... !"

విజయ్ పాదాలు ఒక్క క్షణం ఆగిపోయాయి. మరుక్షణం మరింత వేగంగా కదిలిపోయాయి.

తనలో శక్తినంతా ఎవరో లాగేసినట్టు పక్కమీద సొమ్మసిల్లి వాలిపోయింది విలసిత...

"కాస్త హార్డ్రిక్స్ తాగుతావా డియర్ ?" ఎంతో ఆప్యాయంగా అడిగాడు రాజారావు.

విలసిత రాజారావు ముఖంలోకి చూసింది. ఆ ముఖంలో పురాణాల్లో రాక్షసులందరూ కనిపించారు. పొంగివచ్చే అసహ్యాన్ని దిగమ్రింగుకుంది.

"రాజూ ! నీకు పెళ్ళికిముందే అన్ని విషయాలూ చెప్పాను."

''అఫ్‌కోర్స్ ! నువ్వు నన్ను మోసం చేసావని ఎప్పుడన్నా అన్నానా ?''

"నన్ను అర్థంచేసుకుని విశాలహృదయంతో పెళ్ళిచేసుకున్నావని అనుకున్నాను.''

"నేను బ్రాడ్‌మైండెడ్‌గా లేనా ! హేమంత్‌తో నువ్వు స్నేహం చేసినందుకు ఏమైనా అన్నానా ? కమలాకర్‌తో క్లోజ్‌గా ఉంటోంటే అడ్డు చెప్పానా ?"

"అదంతా నీ బ్రాడ్‌మైండెడ్‌నెస్ అనుకునేటంత అమాయకురాలిని కానులే నేను ! వాళ్ళతో నీ కంపెనీకి అవసరాలున్నాయి. వాళ్ళని మంచిచేసుకోవటానికి నాతో ఆ స్నేహాలు నువ్వే కల్పించావు."

''విల్లీ ! నన్ను నిందించకు ! ఎప్పుడైనా నిన్ను బలవంతపెట్టానా ?"

"లేదు – ఇలాంటి విషయాల్లో నాకు పట్టింపులూ లేవు – నియమాలూ లేవు – అభిమానాలూ లేవు – ఆవేదనలూ మిగలవు – అదొక ఆటగా అందరితోనూ స్నేహాలు చేసాను."

"అదీ ! అలా ఉండాలి ! బ్రతుకంతా ఒక ఆటగా తీసుకోవాలి ! 'జీవితమే ఒక నాటకరంగం' ..."

''అవును ! నాటకం ! నీ దెంత నాటకమో నాకు అర్థమవుతోంది ! విజయ్ రాగానే ఇలా మండిపడటం దేనికి ?"

''నీ మీద ప్రేమతోనే డియర్ ! నాటకాలు ఎన్ని ఆడినా పరవాలేదు – కానీ నిజంగా బ్రతకటం మొదలుపెడితే ప్రమాదం ! అందుకే..."

"నీ కిష్టమయినవాళ్ళతో స్నేహం చెయ్యాలి ? నా కిష్టమయినవాళ్ళతో స్నేహం చెయ్యటానికి వీల్లేదు. అంతేనా ?"

"పాతివ్రత్యమంటే అదే డియర్ ! నా భార్య మహా పతివ్రత కావాలని చిన్నప్పటినుండీ నా కోరిక. నీలో ఆ పాతివ్రత్య లక్షణాలన్నీ చూసి నిన్ను వరించాను."

"షటప్ ! నన్నెవరూ బంధించలేరు. నా యిష్టం వచ్చినట్లు నే నుంటాను."

"నేను వీల్లేదంటే ?"

''విడాకు లిస్తాను. వ్యాపారంలో నా షేర్స్ నా కిచ్చెయ్యి!"

"మైడియర్ ! వ్యాపారమంతా నా పేరుమీదనే ఉంది. నీ షేర్స్ ఏమీ లేవు."

"ఇన్‌కంటాక్స్ వ్యవహారాలకోసం వ్యాపారమంతా నీ పేరుమీద ఉంటే బాగుంటుందన్నావు - ఒప్పుకున్నాను - అంతేకాని..."

"ఏదయితేనేం ? ప్రస్తుతం ఇక్కడ నీ షేర్స్ అంటూ ఏమీలేవు !"

''దుర్మార్గుడా ! అదేదో కోర్టులోనే తేల్చుకుంటాను. విలసిత సామాన్యురాలనుకోకు !''

"కొంచెం సేపుండు ! డ్రెస్ మార్చుకుని నిన్ను లాయర్ దగ్గిరకి తీసి కెళ్తాను. అన్ని విషయాలూ మాట్లాడుకుందాం !"

విజిల్ వేసుకుంటూ వెళ్ళిపోయాడు రాజారావు

దిండులో తలదూర్చి కుమిలి కుమిలి ఏడ్చింది విలసిత.

*　　　*　　　*

జయకు కాబోయే వరుడు రమేశ్‌కి విదేశాలకు వెళ్ళే అవకాశం వచ్చింది. అతడు పబ్లిష్‌చేసిన పేపర్స్‌చూసి అమెరికన్ ప్రభుత్వం అతడిని ఆహ్వానించింది. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకుని స్టేట్స్‌లోనే రెండేళ్ళుండి తన రిసెర్చ్ పూర్తిచేసుకుని రావాలని నిర్ణయించుకున్నాడు రమేశ్. మరొక రెండు సంవత్సరాలు జయ పెళ్ళి ఆపుచెయ్యటం కృష్ణమూర్తి కిష్టంలేకపోయింది. "పెళ్ళిచేసుకుని వెళ్ళండి !" అన్నాడు రమేశ్‌తో.

"సారీ ! నా చదువు పూర్తయేవరకూ పెళ్ళి చేసుకోను !" కచ్చితంగా చెప్పేసాడు రమేశ్.

"అంతవరకూ జయను ఉంచటానికి వీలవుతుందా ? ఒకపక్క లతకుకూడా సంబంధం నిశ్చయమయిపోయింది..."

''మీ యిష్టం !"

ఎటూ తేలకుండా అన్నాడు రమేశ్. కృష్ణమూర్తి ఈ సంగతులన్నీ జయతో చెప్పాడు. జయ ఆలోచించింది.

"రెండేళ్ళలో ఏది ఎలా జరుగుతుందో ఎవరు చెప్పగలరు నాన్నా! ఇక్కడ నేను అతనికోసం కాచుక్కూచుంటే అక్కడ అతడు ఇంకెవరినైనా చేసుకున్నా చేసుకోవచ్చు. అప్పుడు మనమేం చెయ్యగలం? అతనికి నిజంగా చేసుకోవాలని ఉంటే ఇప్పుడే చేసుకునేవాడు. నాకు మరొక సంబంధం చూడండి! ఈ సంగతి అతనితో చెప్పెయ్యండి!" అంది.

జయ సమాధానం విని నివ్వెరపోయింది లత. జయ ఇలా అందని విజయ్‌తో చెప్పింది. విజయ్ నవ్వి, "మంచిదేగా! లేకపోతే మన పెళ్ళి మరో రెండేళ్లు వాయిదా పడేది. మీ నాన్నగారు త్వరలోనే జయకి మరొక సంబంధం కుదురుస్తారు. మనకి లైన్ క్లియర్..."

"అది సరే! జయ రమేశ్‌ని చేసుకోవటానికి సంతోషంగానే ఒప్పుకుంది. ఇద్దరూ కలిసి తిరిగేవారుకూడా... అతడి ఫొటో దాని టేబిల్‌మీద ఉండేది. ఇప్పుడు మరి..."

"ఏముందీ? మరొకరితో కలిసి తిరుగుతుంది. మరొకరి ఫొటో ఉంటుంది..."

"అంతేనా...?"

"కాక..."

"నువ్వూ అంతేనా?"

"అందరూ అంతే!"

"నేను నీ సంగతి అడుగుతున్నాను..."

"నేనూ అందరిలాంటి వాడినే!"

లత కూచున్నది చటుక్కున లేచిపోయింది. విజయ్, "లతా!" అని పిలుస్తున్నా వినిపించుకోలేదు.

శోకదేవతలా తన దగ్గిరకు వచ్చిన లతను చూసి ఆశ్చర్యంగా "ఏం జరిగింది లతా?" అంది విమల.

లత సమాధానం చెప్పకుండా విమల భుజంమీద తలఆన్చి వెక్కి వెక్కి ఏడవసాగింది. లత మూడ్స్‌తో బాగా అనుభవమున్న విమల లతను బుజ్జగించి, కాఫీ ఇచ్చి, ఏం జరిగిందో కనుక్కుని తెల్లబోయింది.

"ఇంత సామాన్యమైన విషయానికే ఇంతగా ఏడుస్తున్నావా?"

లత రోషంగా "సామాన్యమైన విషయమా? విజయ్ నన్ను మరచిపోయి




ఇంకెవరినైనా అతి మామూలుగా చేసుకుంటానంటే అది నాకు సామాన్య విషయ మవుతుందా ? నేను కనుక ఏడ్చి ఊరుకుంటున్నాను. నువ్వయితే తల పగల కొట్టేదానివి," అంది.

విమల నవ్వి "తప్పకుండా పగలకొడతాను - కానీ, ఆ మాటలు విజయ్ నిజంగా అన్నవి కాదుగా! ఏదో ఆ సందర్భాన్నిబట్టి అన్నాడు. లేకపోతే నీ ముందు కూచుని జయని తిట్టమంటావా ?" అంది.

"తిట్టినా సహించేదాన్ని..."

"ఆ సంగతి అతనికి తెలియదుగా! నువ్వు అందరిలాంటిదానివే అనుకుని లోకసామాన్యంగా మాట్లాడాడు. నువ్వంతటి పైత్యశ్రీవని అతనికేం తెలుసు ?"

"ఏయ్..." కోపంగా చెయ్యెత్తింది లత. ఆ చేతిని పట్టుకుని "వద్దు! వద్దు! కొట్టకు. నాకు దెబ్బతగిలితే నాకు బాధలేదు. కానీ ఆ తరువాత నన్ను కొట్టినందుకు నిన్ను నువ్వు పెట్టుకునే క్షోభ చూడలేను," అంది.

ఇద్దరూ పకపక నవ్వుకున్నారు. ఆ రోజు విమల ప్రత్యేకంగా అలంకరించు కోవటం గమనించింది లత. "ఏమిటి విశేషం?" అంది.

"విశేషమే! మా ఇంటికి చుట్టాలొస్తున్నారు!"

"ఎలాంటి చుట్టాలు?"

"చూస్తావుగా!"

కాలింగ్ బెల్ మోగింది విమల ఉత్సాహంగా లేచి తలుపు తీసింది. లోపలకు వచ్చిన యువకుడిని లతకు పరిచయం చేసింది.

''మా బంధువులే! పేరు చంద్రశేఖరం...''

అతడు ఆకర్షణీయంగానే వున్నాడు. కానీ, ఎందుకో సంకోచపడుతున్నట్లుగా ఉంది అతని ధోరణి...అతడిని కూచోమంటున్నప్పుడు, కాఫీ అందిస్తున్నప్పుడు, కుశల ప్రశ్న లడుగుతున్నప్పుడు విమల కళ్ళలో విరిసే మెరుపులు లతకు కుతూహలం కలిగించాయి.

''మీరేం చేస్తున్నారు అంది లత ఏదో ఒకటి మాట్లాడాలని...అతని ముఖం ఒక్క-క్షణం ముడుచుకుపోయింది. విమలవైపు చూసాడు. విమల కళ్ళలో ఏం కనిపించిందో, ధైర్యంగా ''ప్రూఫ్‌రీడర్‌గా పని చేస్తున్నాను' అన్నాడు. అప్రయత్నంగా ''ప్రూఫ్‌రీడరా?'' అనేసింది లత తేలిగ్గా. చురుక్కున చూసింది విమల. ఆ చూపులకు కంగారుపడి, తన పొరపాటు తెలుసుకుని గాభరాగా ''ప్రూఫ్‌రీడర్ పని చాలా బాగుంటుంది. ఎంచక్కాగా అదీ, ఇదీ, అనీ లేకుండా అన్నీ చదవచ్చు. ఆ తప్పులన్నీ దిద్దుతోంటే ఎన్ని తప్పులుంటాయో బాగా తెలుస్తుంది. నేను కూడా ఈ ఉద్యోగం మానేసి ప్రూఫ్‌రీడర్‌గా...'' అని ఇంకా ఏమేమో మాట్లాడబోతోంటే విమల నవ్వుతూనే కోపంగా ''నోరుమూసుకో'' అని కసిరింది. లత వెంటనే బుద్ధిగా నోరు మూసుకుని చంద్రశేఖరాన్ని చూసి క్షమాపణ చెప్పుకోవటంలాంటి చవటనవ్వొకటి నవ్వింది.

''శేఖరం ఇంకా ఎన్నాళ్ళుంటావు నీ తపస్సు?'' ఆప్యాయంగా అడిగింది విమల.

' సిద్ధించేవరకూ... ఎంతకాలం పడుతుందో?''

''ఏం పట్టదు. పట్టుదలతో చేసేది ఏదైనా త్వరలోనే అనుకూలిస్తుంది.''

''ఇందుకే - ఇలాంటి మాటలు వినాలనే నీ దగ్గిరకు వచ్చేది!''

''వస్తున్నావులే మహా...''

''నాకు నిరుత్సాహం కలిగినప్పుడల్లా వస్తూనే ఉన్నాను. తఱచు రమ్మంటావా?''

''వద్దు! వద్దు! అంతా పూర్తయ్యేవరకూ అసలు కనపడకు!''

ఈ సంభాషణ లతకు అంతుపట్టలేదు. అటూ ఇటూ చూసి ఒకసారి ఆవులించి ''వస్తాను'' అని లేచింది.

''ఉండు! నీతో ఒక విషయం చెప్పాలి'' అంటూ లతతో గుమ్మందాకా వచ్చింది విమల. గుమ్మందగ్గిర లతను ఆపి ''ఇందాక ఏడ్చావు చూడూ...'' అంటూ ఏదో చెప్పబోతోంటే లత సిగ్గుపడి ''పో! అదేం లేదు!'' అంది.

"ఏం లేకపోవటమేం? బోలెడుంది. కానీ, అలాంటి సందర్భాల్లో మనం ఏడవటంకాదు - ఎదుటివాళ్ళను ఏడిపించాలి! కన్నీళ్ళొచ్చేలా కాదు - మనసు బయటపడేలా..."

లత పకపక నవ్వింది. ఆ నవ్వు చూస్తే విమలకు సంతృప్తి కలిగింది కాని 'అంతలో కృంగిపోతుంది - ఇంతలో నవ్వేస్తుంది - ఎలా ఎదుర్కొంటుంది జీవితాన్ని?' అనుకోకుండా ఉండలేకపోయింది.

లత విజయ్‌ని తప్పుకు తిరగసాగింది. అతడు ఇంటికొస్తే బయటి కొచ్చేది కాదు. లతను పిలవమని అడగటానికి సంకోచపడేవాడు విజయ్. రోజు కొక సారైనా విజయ్ ఇంటికెళ్ళి విజయ్ ఉన్నా, లేకపోయినా శ్యామలతో కబుర్లు చెప్పి ఏదైనా పని సాయంచేసి రావటం లతకు అలవాటు. "లత రావటం లేదేం?" అని విజయ్‌ని రెండు మూడుసార్లు అడిగింది శ్యామల. విజయ్‌కి నిజంగా భయం వేసింది. సంకోచాన్ని వదిలి ఆ రోజు సుందరమ్మని "లత ఎక్కడుందీ? లతతో మాట్లాడాలి!" అన్నాడు.

"దొడ్లో ఉన్నట్లుంది" అంది ఆవిడ.

విజయ్ సహజంగా మొహమాటస్థుడు. ఆ ఇంటికి ఎప్పుడొచ్చినా హాల్లోనే కూచుని లతతోనూ, జగన్‌తోనూ మాట్లాడి వెళ్ళిపోయేవాడు. లోపలికి ఎప్పుడూ వెళ్ళలేదు.

"లతను పిలవనా?" అంది సుందరమ్మ మళ్ళీ. లత విజయ్‌ని తప్పుకు తిరుగుతున్నట్లు సుందరమ్మకు తెలియదు.

"అక్కర్లేదు. నేనే వెళతాను."

దొడ్లో కూరపాదులకి గొప్పులు తవ్వుతోంది లత. లత ఏ పనిచేసినా దాని గుర్తులు ఆవిడ ఒంటినిండా ఉంటాయి. చీరమీదా, చేతులమీదా, ముఖంమీదా కూడా మట్టి మరకలు

వెనకనుండి నెమ్మదిగా "లతా!" అని పిలిచాడు విజయ్. ఉలికిపడి విజయ్‌ని చూసిన లత సంభ్రమంగా "విజయ్!" అంటూ ఆ మట్టిచేతులతోనే విజయ్‌ని కౌగలించుకుని "అయామ్ సారీ విజయ్! నీ తప్పేంలేదు. నువ్వు నన్ను క్షమాపణ కోరుకోనక్కర్లేదు. నేను నిన్ను క్షమించేసాను" అంది.

విజయ్ ఆ కౌగిలి విడిపించుకుని వంటికున్న మట్టి దులుపుకుంటూ "ఇప్పుడు నిన్ను క్షమాపణ కోరిందెవరు? 'లతా!' అని పిలిచాను. అంతే!" అన్నాడు నవ్వుతూ.

నవ్వుతోన్న విజయ్‌ని చూస్తూ "ఈ ముఖం చూడకుండా నేను బ్రతగ్గలనా ?" అనుకుంది తనలో తను లత.

"క్షమాపణ కోరలేదా ? అయితే గెటవుట్ ! నేను నీతో మాట్లాడను !" అంది నవ్వుతూ.

"ఇంత స్వచ్ఛంగా నవ్వగలిగేవాళ్ళు ఎందరు ?" అనుకున్నాడు విజయ్.

లతముందు తమాషాగా చిలిపిగా సగం వంగి "ప్లీజ్ ! మాట్లాడవూ ?" అన్నాడు.

"మాట్లాడను !"

"అయితే, ఈ దీనుడిమీద నీకు ప్రేమలేదా ?" దీనంగా గొంతుపెట్టి అల్లరిగా అడిగాడు.

లత చటుక్కున అతనిచుట్టూ చేతులేసి పెదవులమీద ముద్దుపెట్టుకుంది. ఆశించని ఈ చర్యకి విజయ్ కంగారుగా చుట్టూ చూస్తూ "లతా !" అన్నాడు.

"ఏం విజయ్ ! పెళ్ళికాకుండా ఇలా ప్రవర్తించాననా ? ఏది ఏమయినా నేను నీ దానిని. పెళ్ళి కానంతమాత్రాన నీకు పరాయిదానినని అనుకోలేక పోతున్నాను."

తన చేతులలోఉన్న లత ముఖంలో అమాయకత్వం చూస్తోంటే ఆనందంతో పాటు ఏదో జంకుకూడా కలిగింది విజయ్‌కి.

"అందుకేనా నాలుగు రోజుల్నించీ కనపడటంలేదు ?"

"ఏయ్ మిస్టర్ ! నాలుగుకాదు - అయిదురోజులు !"

"లెక్కపెట్టుకుంటున్నావా ?"

"ఏమనుకుంటున్నావ్ మరి ? రోజులుకాదు - సెకన్లు లెక్కపెట్టుకుంటున్నాను. తెల్లవార్లూ నిద్రరాక అర్థమైన చెత్త పుస్తకాలూ చదువుతున్నాను. ఎంత ప్రయత్నించినా స్థిమితపడలేక తిక్కరేగి అందరితోనూ పోట్లాడుతున్నాను. నాకు తెలియకుండా నీ దగ్గిరకు వచ్చేస్తానేమోనని ఎక్కడలేని పనీ కల్పించుకుంటున్నాను. నువ్వింకొక్క రెండురోజులు ఆలస్యంచేస్తే పిచ్చాసుపత్రిలో ఉండేదాన్ని..."

"అయ్యయ్యో ! ఈ సంగతి నాకు తెలిస్తే నా దేవిని ఇంత కష్టపెట్టకుండా ఎప్పుడో వచ్చేవాడినే ! ఇప్పు డడుగుతున్నాను క్షమించమని..."

లత పకపక నవ్వి విజయ్ రెండు చేతులూ తన చేతుల్లోకి తీసుకుంది.

"విజయ్ ? నేను తొందరపాటు మనిషిని. పిచ్చిదానినై ఎప్పుడైనా నీతో



దెబ్బలాడచ్చు. నీ మనసు కష్టపెట్టచ్చు. నువ్వు క్షమించటానికి వీల్లేనంత దారుణంగా ప్రవర్తించచ్చు. కానీ, నువ్వుమాత్రం నన్ను నీకు దూరం కానీయకు. అలా నేను ఒక్క క్షణంకూడా బ్రతకలేను.''

లతలా తనను పెనవేసుకుపోయిన లతను ఆప్యాయంగా అదుముకున్నాడు విజయ్.

* * *

చిన్న గుమస్తా ఒక్కడే వున్నాడు ఆఫీస్‌రూంలో. తల వంచుకుని ఏదో పనిచేసుకుంటున్నాడు.రాణివచ్చి కుర్చీలో ఇరుక్కుంటూ కూచుని చిన్నగుమస్తాని చూచి విరగబడి నవ్వింది. అతడు ఆశ్చర్యంగా తలెత్తి చూసాడు.

ఈ రూంలో ఇంకెవరూ లేరు. మనిద్దరమే! తమాషాగా లేదూ? హమ్ తుమ్. ఏక్ కమ్‌రేమె బంద్‌హౌ!" మళ్ళీ విరగబడి నవ్వింది.

యాభై దాటిన రాణి ముడుతలుపడ్డ పౌడర్ కోటింగ్ ముఖంలోకి మతిపోయిన వాడిలా కొన్ని క్షణాలు చూసి పకాలున నవ్వేసాడు చిన్న గుమస్తా.

సరిగ్గా ఆ సమయంలో వచ్చింది విమల. ఆ నవ్వులు చూస్తోంటే విమలకు వంటినిండా తేళ్ళూ జెర్రులూ పాకినట్లయింది. సాధారణంగా ఎవరినీలక్ష్యం చెయ్యని

రాణికి విమల ముఖంలో ఏం కనపడిందో తన నవ్వు ఆపేసింది. అంతలో విమలని ఆ మాత్రం లెక్కచేసినందుకు తనమీద తనే చిరాకుపడింది. "ఏం కావాలి?" అంది విదలిస్తున్నట్లు ఆ ధోరణి అర్థంచేసుకున్న విమల ముఖం ఎఱ్ఱబడింది. అజ్ఞాపిస్తున్నట్లున్న కంఠంతో "ఇంటర్ కామర్స్ సిలబస్ మారిం దన్నారు. ఆ సర్క్యులర్ స్టాఫ్‌కి పంపలేదేం?" అంది.

"ఏమో? ఏ సర్క్యులరూ ఇక్కడికి రాలేదు. వస్తే పంపిస్తాము. మీరు మీ పని చూసుకోండి! మా పని మాకు తెలుసు!" తీక్షణంగా అంది రాణి.

విమలకి మండిపోయింది. తిన్నగా ప్రిన్సిపల్ దగ్గిరకే వెళ్ళింది.

"మేడమ్! ఇంటర్ కామర్స్ సిలబస్ మారిందని తెలిసింది. ఇంతవరకూ మాకు సర్క్యులర్ రాలేదు. అనవసరంగా స్టూడెంట్స్ సఫర్ అవవలసి వస్తుంది..." అంది.

ప్రిన్సిపల్ ఆశ్చర్యంగా ఆ సర్క్యులర్ ఆఫీస్‌కి ఎప్పుడో పంపానే! మీ కెందుకు రాలేదు?" అంది.

''ఏమో మేడమ్! రాణిగారు అలాంటి సర్క్యులర్ ఏదీ రాలేదన్నారు.''

రాణి ప్రస్తావన రాగానే ప్రిన్సిపల్ తడబడింది.

"నేను చూస్తాను. మీరు వెళ్ళండి! అంది.

ఆ మధ్యాహ్నం రాణి స్టాఫ్‌రూంలోకి వచ్చింది. చిరునవ్వుతో బరువైన తన చెయ్యి విమల భుజంమీద వేసింది విమలను పాతాళానికి అనిచేసేలా.

"వాట్ మేడమ్? నామీద ప్రిన్సిపల్‌కి రిపోర్ట్ చేసారా?''

లోకంలోఉన్న కుత్సితమంతా రాణి చిరునవ్వులోనే ఉందనిపించింది విమలకి. రాణి తెల్లగాఉంటుంది. పెద్దకళ్ళు, సూది ముక్కు, చిన్ననోరు. ఎక్కడా ఏ వంకా లేదు. అయినా ఆ ముఖంలోకి చూడగానే ఎవరికైనా భరింపరాని విరక్తి కలుగు తుంది.

"నేను ఎవరిమీదా రిపోర్టు చెయ్యలేదు. సిలబస్ మారినట్లు సర్క్యులర్ రాలేదు. క్లాసెశ్ తియ్యటం కష్టంగా ఉంది? అన్నాను అంతే?"

"ఆ సర్క్యులర్ రాలేదు రాదు. మీ యిష్టంవచ్చినట్లు చేసుకోవచ్చు."

"అలా చెప్పండి. ఇప్పుడర్థమయింది!"

''చాలా కొంచెం అర్థమయింది. ముందు ముందు ఇంకా బాగా అర్థమవు తుంది." అడుగులు చప్పుడుచేసుకుంటూ వెళ్ళిపోయింది రాణి.

ఈ సంభాషణ అంతా విన్న లత గాభరాపడిపోయింది.

"విమలా! నువ్వు ఎవరిని కవ్విస్తున్నావో తెలుసా?''

"ఎందుకు తెలియదూ? ఫలవంతాన కోరికలను అణచుకుని ఆ కర్వ్యర్మిట్ తో బాధపడే మానసిక రోగితో... ఏ కోశానా నైతిక దృక్పథం లేని మనిషి కాని మనిషితో...మాట్లాడాను అంతేనా?"

కిలకిల నవ్వింది విమల. ఆ నవ్వులో తొణికిసలాడే నిర్లక్ష్యం, పెంకితనం- వీటన్నిటినీ మించిన ఆత్మవిశ్వాసం. వీటి ముందు లత నోరెత్తలేక పోయింది.

బాబ్జీకి మామూలు జ్వరంవచ్చి అది పచ్చకామెర్లలోకి దింపింది. దేనినైనా ధైర్యంగా ఎదుర్కొనే విమల ముఖంలో విషాదం గూడుకట్టుకుంది. అది చూసి భరించలేకపోయింది లత. అయినా తనేంచెయ్యగలదు?

బాబ్జీ మంచం పక్కనే కూచుని బాధగా నుదురు రాస్తోన్న తల్లినిచూసి చిరాకుపడిపోయింది విమల.

"వాడు నీ ప్రేమకోసం అలమటించినంతకాలమూ, అర్థం పర్థంలేని పిచ్చి సెంటిమెంట్లతో వాడిని ముద్దుచెయ్యలేదు. ఇప్పుడు వాడు వొళ్లు తెలియకుండా పడిఉన్నాడు. నువ్వు ముద్దు చేస్తున్నావో, లేదో కూడా వాడికి తెలియదు. నువ్వేమీ చెయ్యక్కర్లేదు," అంది కరుగ్గా. సుగుణ కుళ్ళి కుళ్ళి ఏడ్చింది. విమల ఈ ధోరణికి లత తెల్లబోయింది.

''విమలా! నువ్వేనా ఈ మాట్లాడుతున్నది? ఇలాంటి సమయంలో అమ్మను దెప్పుతావా?" అంది.

విమల కూడా నొచ్చుకుంది. "ఏమనుకోకమ్మా! వాడిని చూస్తే నా గుండె తరుక్కుపోతుంది. ఒకవేళ ఏమయినా జరగరానిది జరుగుతే..."

సుగుణ గొల్లుమంది. లత విమల నోరు గట్టిగామూసి "విమలా! నీకు మతి పోతోంది,'' అంది.

విమల మతిపోయిన దానిలాగే తయారయింది. కాలేజీకి వస్తున్నా, లతతో మాట్లాడుతున్నా ఏ పనిచేస్తున్నా బాబ్జీమీదే ధ్యాస... నిద్ర అసలు లేనే లేదు.

"ఎవరో బాబాగారు విభూతి మంత్రించి ఇస్తున్నారుట! అది రాసుకుంటే రోగాలు తగ్గుతాయిట! బాబ్జీని అక్కడికి తీసికెళ్తున్నాను" అంటోన్న విమలను విస్తుపోయి చూసింది లత- ఈ బాబాలన్నా, వాళ్ళ మహత్యాలన్నా కొంచెంకూడా నమ్మకంలేదు విమలకి. అలాంటి మూఢనమ్మకాలని చీదరించుకుని ఎద్దేవా చేసేది. అలాంటిది...

లత ముఖంలో భావాలు చదివినట్లుగా విమల "లతా, మంచీ, చెడ్డా, నాకేమీ

తెలియటంలేదు. ఎలాగైనా బాబ్జీని బ్రతికించుకోవాలి! లేకపోతే నేను నిలవలేను" అంది ఏడుపు గొంతుతో.

విమల ఏడుపుగొంతు లత ఏనాడూ వినలేదు. ఆనాడు విని భరించలేక పోయింది. బాబాల విభూతులూ, డాక్టర్ల మందులూ, . ఏవీ పనిచెయ్యలేదు. బాబ్జీ జ్వరం ఇంకా ఎక్కువయింది "బాబూ! భర్తను పోగొట్టుకున్న దుఃఖంలో మతిపోయి ఏమేమో అన్నాను. అందుకు ఇంత దారుణంగా శిక్షించకురా! నన్ను విడిచిపోవద్దు!'' అని బాబ్జీ మంచం కోడుకి తల కొట్టుకోసాగింది సుగుణ తల్లిని అతి ప్రయత్నంమీద బాబ్జీదగ్గరనుంచి దూరంగా లాగింది విమల. "వాడు నీ కొడుకు కాదమ్మా! నా కొడుకు! నేను పెంచాను వాణ్ని," అంది.

బాబ్జీకి కలవరింతలు ప్రారంభమయ్యాయి.

"అక్కా! చూడక్కా! నన్నెవరో ఎత్తుకుపోతున్నారు. వాళ్ళను కొట్టెయ్యి—" అన్నాడు భయంగా. విమల గుండెలు చెదిరిపోయాయి.

"బాబూ! నిన్ను ఎత్తుకుపోతున్న వాళ్లెవరో, ఎక్కడున్నారో నాకు తెలియదురా! తెలిస్తే ప్రాణాలకు తెగించి అయినా వాళ్ళతో పోట్లాడి నిన్ను కాపాడుకునేదానిని," అని కుమిలిపోయింది విమల.

రెండురోజులు బాధపడి బాధపడి "అక్కా" అని కలవరిస్తోనే కన్ను మూసాడు బాబ్జీ.

విజయ గుండెలమీద వాలి వెక్కి వెక్కి ఏడవసాగింది లత. లత మూడ్స్‌కి బాగా అలవాటుపడిన విజయ్ ఏమీ కంగారుపడకుండా కారణం కూడా అడగకుండా లతను బుజ్జగించి ఓదార్చాడు. కొద్దిసేపట్లోనే తేరుకున్న లత "విజయ్! నువ్వు నాకో సాయం చెయ్యాలి, తప్పదు," అంది.

"ఏ సాయమైనా చేస్తాను. ముందు కళ్ళు తుడుచుకో!"

"ఎలా తుడుచుకోను? తుడుచుకోగానే జీవం లేనట్లుగా ఉన్న విమల ముఖం గుర్తుకొస్తుంది. అలా గుర్తుకు రాగానే మళ్ళీ ఏడుపొచ్చేస్తుంది..."

"ఏమయింది విమలకి?"

"బాబ్జీ చచ్చిపోయాడు విజయ్! విమల ఈ దెబ్బకి తట్టుకోలేకుండా ఉంది!"

ఈ వార్త విని విజయ్ నిజంగా చాలా బాధ పడ్డాడు. "పాపం చిన్నపిల్లవాడు..." అన్నాడు.




“ఇప్పుడు నా బాధ పోయిన బాబ్జీకోసంకాదు. విమలకోసం... విమల ఏమయిపోతుందోనని... విజయ్! నువ్వే ఆదుకోవాలి!”

“నేనేం చెయ్యగలను?”

“విమల దగ్గిర కెళ్ళు-ఓదార్చు-నీ మాటలు వింటుంటే ఎంత దుఃఖమైనా మరిచిపోవచ్చు. నీ కంఠంలో ఆ మేజిక్ ఉంది.”

“నీకేమైనా మతిపోయిందా? ఆవిడతో నాకు పెద్ద పరిచయంలేదు. ఇప్పుడు వాళ్ళింటికి ఎలా వెళ్ళను? అదీకాక నా మాటలు నీ దుఃఖాన్ని మరిపిస్తే మరిపించచ్చు. అది నా అదృష్టం. అందరికీ అలా అనిపిస్తుందా?”

“తప్పకుండా అనిపిస్తుంది. నీ కంఠం ఎంత కమ్మగా ఉంటుందో నీకేం తెలుసు? ఎలాటివాళ్ళకైనా ఎంతటి దుఃఖాన్నైనా మరిపించేశక్తి ఆ కంఠానికి ఉంది...”

“లతా! నాకసలే మొహమాట మెక్కువ. పోనీ, నువ్వూ రా!......”

“వద్దు విజయ్! నా సంగతి నీకు తెలుసు – విమల ముఖం చూడగానే నేనే ముందు విమలకంటె ఎక్కువ ఏడుస్తాను. విమలను ఓదార్చలేను. మరింత బెదరగొడతాను. నువ్వే వెళ్ళు! ప్లీజ్! వెళ్ళవూ? నా కోసం...”

“సరే!” అయిష్టంగానే ఒప్పుకున్నాడు విజయ్.

లత పరిచయం చెయ్యగా ఒకటి రెండుసార్లు విజయ్‌ని కలుసుకుంది విమల, లతతోనే. అంతకుమించి పరిచయంలేదు. తన ఇంటికి వచ్చిన విజయ్‌ని ఆశ్చర్యంతో ఆహ్వానించింది విమల. విమల ముఖంలో దారుణమైన దుఃఖం కనిపిస్తోంది. కానీ అంతటి దుఃఖంలోనూ ఆవిడ నిగ్రహం – సంస్కారం

ఉట్టిపడే ఆ ప్రవర్తన మనసులో మెచ్చుకున్నాడు. విమల దుఃఖానికి తట్టుకోలేక బేలగా తన గుండెలమీద వాలి వెక్కి వెక్కి ఏడ్చిన లత గుర్తుకొచ్చి తనలో తను నవ్వుకున్నాడు.

"ఎన్నాళ్ళనుండో మీ ఇంటికి రావాలని... మా లత మిమ్మల్ని ఎప్పుడూ పొగుడుతూ ఉంటుంది, ఎంతో నిగ్రహం కలవారని. అది నేను ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నాను. జీవితమంటేనే సుఖదుఃఖాల సంఘర్షణ. ఈ రెంటికీ అతీతంగా మనోబలంతో నిలబడగలగటమే మనకు పరీక్ష. ఈ పరీక్షలో నెగ్గటం కష్టమనుకోండి. కానీ, అలా నెగ్గటమే మానవత్వానికి గీటురాయి.''

బాబ్జీ ప్రస్తావన తేకుండా తనను ఓదారుస్తోన్న అతని ధోరణికి లోలోపల మెచ్చుకుంది విమల. ఆ ప్రస్తావనతెచ్చే ఓపిక విమలకికూడా లేదు.

''మీ పాట చాలాసార్లు విన్నాను. మీ కంఠం చాలా బాగుంటుంది. ఇలా ఏదైనా ఒక కళలో ప్రవేశముంటే ఎలాంటి బాధలైనా మరిచిపోవచ్చు," అంది.

"అసలు జీవించటమే ఒక కళ, ఆ కళలో మీకు మంచి ప్రవేశమున్నట్లు మిమ్మల్ని చూస్తేనే అర్థమవుతుంది. అంచేత మరో కళలో ప్రవేశమున్నా, లేకపోయినా మీకు పరవాలేదు."

విమల నవ్వింది. విజయ్ మరికొంచెంసేపు కూచుని అదీ, ఇదీ మాట్లాడి వెళ్ళిపోయాడు. విమల మనసు కొంచెం తేలికపడింది. ఆ మరునాడు విమల లతను కలుసుకున్నప్పుడు "ఇన్నాళ్ళూ నువ్వు విజయ్‌ని పొగుడుతోంటే అదంతా నీ పైత్యమనుకున్నాను. కానీ, విజయ్ నిజంగా ఎన్నదగినమనిషి. ఒక్క పావుగంట అతనితో కూచునేసరికి మనసెంతో తేలికపడినట్లయింది" అంది. లత గర్వంతో పొంగిపోయింది. విజయ్‌కూడా "నువ్వు 'విమల, విమల' అంటోంటే ఏమో అనుకున్నాను. ఆవిడ వ్యక్తిత్వం నాకు నచ్చింది" అన్నాడు. "నేను చెప్పలేదూ?" అంది లత సంబరంగా.

అక్కడితో లత ఆగలేదు. విజయ్‌ని మళ్ళీ విమల దగ్గరకు వెళ్ళమని పోరింది. విజయ్ విసుక్కుంటూ ''ఒకటికి పదిసార్లు వెళ్తే బాగుండదు లతా?" అన్నాడు.

''అలా కాదు విజయ్! నువ్వు వెళ్ళాలి. విమల ఎలా అయినా ఈ దుఃఖం మరిచిపోవాలి" ప్రాధేయపడుతూ అడిగింది లత. లత మాట కాదనలేక రెండు మూడుసార్లు వెళ్ళాడు విజయ్. తరువాత అతనికి విమలతో చనువు పెరిగి లత

అడగకుండానే లతకు చెప్పకుండానే మరో రెండుసార్లు వెళ్ళాడు. ఆ సంగతి ఆ తరువాత విమలచెప్తే తెలిసింది లతకు.

"విజయ్ మళ్ళీ రెండుసార్లు వచ్చాడు లతా! అతనితో పాడించుకున్నాను. అబ్బ! ఏం పాట అది! ఇలాంటిదానినే గంధర్వగానమంటారు కాబోలు! ఎంత సేపైనా ఆ పాట వింటూ ఉండిపోవాలనిపించింది. ఒక్క బాబ్జీనే అన్నమాట ఏమిటి? ఈ లోకాన్నే మరిచిపోయాను."

విమల మాటలు వింటూ గతుక్కుమంది లత. బొమ్మలా నిలబడిపోయిన లతను చూస్తూ "ఆదేమిటి?" అంది. లత తెప్పరిల్లి "మళ్ళీ రెండుసార్లు నీ దగ్గిరకు వచ్చినట్లు నాకు చెప్పలేదు!" అంది.

విమల నవ్వుతూ "విజయ్ ఎప్పుడెప్పుడు ఏంచేసినా అదంతా నీకు చెప్పాలన్నమాట! గడుసుదానివే! నీలాంటి బంగారుబొమ్మ ఆ మాత్రం ఆడించ గలదులే!" అంది.

విజయ్‌ని కలుసుకుని కోపంగా అడిగింది లత.

"విమల దగ్గిరకి మళ్ళీ రెండుసార్లు వెళ్ళావా?"

లత కోపానికి ఆశ్చర్యపోతూ "అవును-నీకు సంతోషం కలుగుతుందనే వెళ్ళాను. నిజంగా విమలగారు చాలా విశిష్టమైనవ్యక్తి. అలాంటివాళ్ళు అరుదుగా ఉంటారు. మంచి నాలెడ్జ్ ఉంది. ఆవిడతో మాట్లాడుతూ ఉంటే ఎన్నెన్నో కొత్త విషయాలు తెలుస్తున్నాయి. మళ్ళీ మళ్ళీ మాట్లాడాలనిపిస్తుంది" అన్నాడు విజయ్.

ఈ మాటలు వింటూనే ఆపాదమస్తకమూ మండిపోయింది లత. కళ్ళు ఎఱ్ఱగా మండి ధారగా కురవసాగాయి. ఏడుపు గొంతుకతో కోపంగా, రోషంగా, "అయితే ఇంకేం! ఆవిడతోనే మాట్లాడు, అక్కడికే వెళ్ళు! నాతో మాట్లాడక్కర్లేదు!" అంది

విస్తుపోయాడు విజయ్! లత ముఖం చూస్తోంటే మరొక్కక్షణంలో మూర్ఛపోతుందేమో అన్నట్లుగా ఉంది. తన పొరపాటు అర్థమయింది విజయ్‌కి. గబగబ సర్దుకుంటూ "ఆవిడ వ్యక్తిత్వం మంచిదే! కానీ రూపం ఏమీ బాగుండదు. ఏ ఆకర్షణా లేదు" అన్నాడు.

లత చివ్వున తలెత్తి "ఏమన్నావ్? విమలకు ఆకర్షణ లేదా? తన ముఖంలో ఉన్న కళ ఎందరిలో ఉంటుందీ? అసలా వ్యక్తిత్వమే ఒక ప్రత్యేకాకర్షణ" అంది.

విజయ్ తడబడుతూ "అవునుకానీ, ఆవిడలో ఏదో మొరటుతనం..." అని విజయ్ ఏదో అనబోతుండగానే కోపంగా అడ్డుతగిలింది లత.

"విజయ్ ! నన్ను ప్లీజ్ చెయ్యాలని అనవసరంగా అబద్ధాలాడావంటే ఊరు కోను. విమలలో ఆకర్షణ లేదూ ? మొరటుతనం ఉందీ ? కళ్ళు లేకపోతేసరి ! ఇంకోసారి విమల నిలాంటి మాటలన్నావంటే..."

రెండు చేతులతో తలపట్టుకుని కుర్చీలో కూలబడ్డాడు విజయ్. ఆ కుర్చీ కాళ్ళదగ్గిర కూర్చుని అతని వళ్ళో తలపెట్టుకుంది లత.

"నా మీద కోపం వచ్చిందా విజయ్ ?"

"నువ్వే చెప్పు. తెచ్చుకోమంటావా ?"

"వద్దు ! నాకు కోపంవస్తే నువ్వు నవ్వుకోగలవు. నీకు కోపంవస్తే నా ఊపిరి ఆగిపోతుంది. ఈ సారి నువ్వు విమలదగ్గిర కెళ్ళినప్పుడు..."

లత మాటలు పూర్తికాకుండానే కుర్చీలోంచి ఎగిరి నిల్చున్నాడు విజయ్.

"ఇంక నేను ఆవిడ దగ్గిరకి చచ్చినా వెళ్ళను."

"అదికాదు ! వెళ్లు ! వెళ్ళి..."

"ఏయ్ ! పిల్లా ! నీకు తమాషాగా ఉందా ? నీ చెంపలు వాయించేస్తాను జాగ్రత్త !"

లత చెక్కిళ్లు రెండూ చిలిపిగా చేతులతో తట్టాడు విజయ్. కిలకిల నవ్వింది లత.

* * *

తిన్నగా రేడియోస్టేషన్‌కే వచ్చిన విలసితనుచూసి నిర్ఘాంతపోయాడు విజయ్. ముందుగా ఫోన్‌చేసిఉంటే రావద్దని ఖండితంగా చెప్పిఉండేవాడు. విజయ్‌లో భావపరివర్తన గమనిస్తూ నీరసంగా నవ్వింది విలసిత. ఆ నవ్వే విజయ్‌లో కాఠిన్యాన్ని చెదరగొడుతుంది.

"ఎందుకొచ్చావ్ ?"

"నీకోసమే !"

"నాకోసమే. ఎందుకూ అని ! రావలసిన అవసరం ఏమీ లేదుకదా, అని..."

"నీకేమోకాని నాకు రావలసిన అవసరం ఎప్పుడూ ఉంది. అందుకే వచ్చాను !"

"విలసితా ! ఖండితంగా నా ప్రమేయం వదులుకోమని చెప్తున్న తరువాత కూడా నా వెంట పడేటంత నీచానికి దిగజారావా నువ్వు ? బలహీనురాలివైతే




కావచ్చును, కాని నిన్ను నువ్వే మరీ ఇంత దారుణంగా అవమానించుకోవటానికి సిద్ధపడ్డావా ?"

"విజయ్ !" బాధగా, ఆవేశంగా పిలిచింది విలసిత.

"నిన్ను అవమానించినందుకు నా భర్తకు విడాకులిచ్చాను. అతడు నన్ను ఎంతగా హింసించినా సహించాను. కానీ, నిన్ను ఒక్క మాటంటే క్షమించలేక పోయాను. అతడినుండి విడిపోయి ఒంటరిగా ఉంటున్నాను. ఇప్పుడైనా నా దగ్గిరకి రాలేవా ?"

విజయ్‌కి ఆవేదన కలుగుతోంది–అసహ్యమూ కలుగుతోంది. "విలసితా ! నిన్ను నీ భర్తకు విడాకులియ్యమని నేను చెప్పలేదు. అతడినుండి విడిపోయి నువ్వు ఒంటరిగా ఉండటం నాకు సంతోషం కలిగించే విషయంకాదు. అలా నువ్వుంటే నీ దగ్గిరకి వస్తానని నీ కెప్పుడూ మాట ఇయ్యలేదు."

"విజయ్ ! నీ స్నేహంకోసం ఏంచెయ్యటానికైనా సిద్ధంగా ఉన్నాను."

''అలాగా ! అయితే స్నేహితుడిగా నేనొక సలహా ఇస్తాను. పాటిస్తావా ?"

"తప్పకుండా ! నీ మాట ఏది కాదనగలను ?''

"మళ్ళీ మీ ఆయనతో రాజీపడి ఆయనదగ్గిరే ఉండు ! లోలోపలి కుంతి కోణా లెన్నిఉన్నా ఆడదానికది రక్షణ !"

తోకతొక్కిన తాచులా లేచింది విలసిత.

''ఛీ ! ఛీ ! లాయర్లదాకా వెళ్ళి తెగతెంపులు చేసుకుని ఇప్పుడు మళ్ళీ ఆయనతో రాజీపడమంటావా ? అంత సిగ్గుమాలినదాన్నా ?"

"నీ నోటితో నువ్వే నన్ను కాదని, నేను వద్దన్నా, ఇలా నా వెంటపడటానికి నీ అభిమానం గాయపడటంలేదా విలసితా ?"

విలసిత రోషంగా చూసి గిర్రున తిరిగి వెళ్ళిపోయింది. రోషంగాచూసే ఆ చూపులలో పైకి ఉబుకుతోన్న కన్నీళ్ళు విజయ్ గమనించకపోలేదు. ఒక్క నిట్టూర్పు విడిచి ఊరుకున్నాడు.

వేణు వయసులో చిన్నవాడు. పాతికకూడా నిండలేదు. కొత్తగా బి ఏ. పాసయ్యాడు. ఎనౌన్సర్‌గా జాయినయ్యాడు. బీదవాడు. కానీ గొప్పగా – ఆడంబరంగా బతకాలని ఆశలెక్కువ. అతని మాటల్లో ఎప్పుడూ అతడు అనుభవించని దర్జాలే దొర్లుతూ ఉంటాయి. విజయ్ పాటంటే వేణుకి కూడా చాలా ఇష్టం. "సార్ !" అని పిలుస్తూ విజయ్ కూడా కూడా తిరుగుతుంటాడు.

''సార్ ! మీరు నా కొక ఫేవర్ చెయ్యాలి ! మా శ్రీమతీ, నేనూ ఇస్తున్న పార్టీలో పాట పాడాలి !" అన్నాడు వేణు.

విజయ్ ఆశ్చర్యంగా "నువ్వు పెళ్ళిచేసుకున్నావా ? మా కెవరికీ తెలియకుండా..." అన్నాడు

వేణు నవ్వి ''అదే సార్ ! ఆవిడా నేనూ కలిసి ఉండాలనుకున్నాం ! ఉంటున్నాం ! అదే పెళ్ళి" అని కన్నుకొట్టి ''ఆవిడ బంగారు పిచిక లెండి !'' అన్నాడు.

విజయ్‌కి ఒక్క క్షణం ఎలాగో అనిపించింది. వేణు చేస్తున్నది మంచిపని కాదని చెప్పాలనిపించింది. అంతలో విరమించుకున్నాడు. ఎవరి మంచిచెడ్డలు వాళ్ళకు చక్కగానే తెలుస్తాయి తెలిసి తెలిసీ ఒక దారి ఎంచుకున్నవాళ్ళను మళ్ళించాలనుకోవటం తెలివితక్కువపని.

''సార్ ! మీరు రానంటే ఒప్పుకోను ! బీదవాడినని సందేహించకండి ! ఆవిడ బంగారు పిచికని చెప్పానుగా ! మీకు ఘనసన్మానం చేస్తానండి."

విజయ్ నవ్వి "ఈ సన్మానాలూ అవీ నా కేమీ వద్దులే ! వస్తాను" అన్నాడు.

వేణు పక్కన నిలబడి అత్యంత ఆధునాతనంగా అలంకరించుకుని బంగారు బొమ్మలా మెరిసిపోతూ చిరునవ్వుతో "కమాన్ విజయ్ !" అని తనను ఆహ్వానిస్తోన్న విలసితను చూడగానే మతిపోయింది విజయ్‌కి. బొమ్మలా నిలబడ్డ విజయ్‌ని చెయ్యిపట్టుకుని అతిథులమధ్యకు లాక్కొచ్చి ''మీట్ మిస్టర్ విజయ్ కుమార్ ! ఈయన పాట విననివాళ్ళు ఉండరు. విని పరవశించనివాళ్ళూ ఉండరు. అలా పరవశించేవాళ్ళలో నేనూ ఒకదాన్ని. నా కీయన ప్రాణ

స్నేహితులు. తన పాటతో ఇవాళ మిమ్మల్నందరినీ ఆనందింపచేయటానికి ఆహ్వానించాను" అని అందరికీ పరిచయంచేసింది విజయ్ భుజంమీద చెయ్యి వేసి. ఆ చెయ్యి మృదువుగా తొలగించి ఎడంగా నించున్నాడు విజయ్. అక్కడున్న కొందరు అసూయపడ్డారు. మరికొందరు హేళనగా నవ్వారు. ఇంకా కొందరు వింతగా చూసారు. వేణు నవ్వుతూ చూస్తూ సిగరెట్ కాల్చుకుంటున్నాడు.

అప్రయత్నంగా విజయ్ చూపులు ఆడవాళ్ళ మధ్యఉన్న లతమీద పడ్డాయి. పాలిపోయిన ముఖంతో పక్కనున్న మరొకావిడ భుజం గట్టిగా పట్టుకుని నిల్చుంది లత. విజయ్ చూపులతో తన చూపులు కలవగానే గిరుక్కున చూపులు తిప్పుకుంది.

విలసిత ఆనందమంతా తనదే అయినట్లు అందరిమధ్య తిరుగుతోంది. ఆవిడ ఎటు తిరిగితే అటు మెరుపులు మెరుస్తున్నాయి. మొగవాళ్ళు ఆవిడతో ఎలా అయినా కల్పించుకుని మాట్లాడాలని తాపత్రయపడుతున్నారు. వాళ్ళకు పెద్ద శ్రమ అక్కర్లేకుండానే విలసిత పరమ విలాసంగా నవ్వుతూ అందరితోనూ మాట్లాడుతోంది. అందరినీ రాసుకు తిరుగుతోంది. అనవసరంగా మీద చెయ్యి వేసి మరీ మాట్లాడుతోంది. ఆడవాళ్ళలోకూడా చాలామంది విలసితమీదనుంచి చూపులు తిప్పుకోలేకపోతున్నారు లత చలనంలేని బొమ్మలా కూచుంది. కానీ, ఆవిడ చూపులు మాత్రం విలసితనే అనుసరిస్తున్నాయి. లతను చూస్తోన్న విజయ్‌కి ఆ కళ్ళలోంచి ప్రాణాలు పోవుకదా అని భయంవేసింది. అలా ఉన్నాయి, ఆ చూపులు – ఆ ముఖం.

"ఇప్పుడు శ్రీ విజయ్‌కుమార్ పాడతారు. ఆ తరువాత నేను వారిని సన్మానిస్తాను. రా విజయ్ !" చనువుగా విజయ్ చెయ్యిపట్టుకుంది విలసిత. కరతాళ ధ్వనులు చెలరేగాయి. కదలనిది లత ఒక్కర్తే ! అంతవరకూ విలసితనే చూస్తోన్న లత చూపులు కిందకు వాలాయి. వణుకుతోన్న చేతులు కుర్చీని గట్టిగా పట్టుకున్నాయి. భుజంమీద చెయ్యిపడటంతో ఉలికిపడి తలెత్తింది. విజయ్ చెయ్యి తన భుజంచుట్టూ ఉంది. అప్రయత్నంగా ఆ చెయ్యిమీద తన చెయ్యివేసి అదిమింది. పోయిన ప్రాణాలు మళ్ళీ తనలో చేరుకుంటున్నట్లు అనిపించింది లతకి. లత ముఖంలోకి చూస్తూ చిరునవ్వు నవ్వాడు విజయ్. లత భుజంచుట్టూ వేసిన చెయ్యి అలాగే ఉంచి అందరినీ చూస్తూ ''మిస్ లత. నా కాబోయే శ్రీమతి. ఇప్పుడు విలసితగారు చెయ్యబోయే సన్మానం మా కిద్దరికీ

కలిపి చేస్తారు'' అన్నాడు. అందరూ మళ్ళీ అట్టహాసంగా కరతాళధ్వనులు చేసారు. విలసిత ముఖంలో మెరుపులు మాయమయ్యాయి. అంతవరకూ విలసిత దృష్టికి ఆనని లత ఇప్పుడు సమస్త లోకాధీశ్వరిలా కనిపించినది. ఎంత సామాన్యంగా ఉంది ? ఏమంత అందమని ? అందం లేదా ? అమాయకంగా చూసే ఆ చూపులలో ఏ అందాలకూ అందని ఆకర్షణ లేదా ? ఇప్పుడు తను ఎన్ని అందాలు తెచ్చిపెట్టుకున్నా ఆ లతను మించిన అదృష్టవంతురాలు కాగలదా ? ఈర్ష్యను అణచుకోలేకపోయింది విలసిత.

"మిస్టర్ విజయ్ ! మీ పాటకు మా సన్మానం ! ఈవిడకు దేనికి ?"

"ఈవిడ లేకపోతే నేనూ ఉండను ! నా పాటా ఉండదు ! ముందే ఈవిడ. తర్వాతే నేను !"

నవ్వుతూ అన్న విజయ్ మాటలకు అందరూ హర్షధ్వానాలు చేసారు. సిగ్గుతో, భయంతో, గర్వంగా విజయ్‌ని చూసింది లత. అప్పటికీ ఇంకా వణికిపోతూనే ఉంది. లత చెయ్యి తన చేతిలోకి తీసుకుని అది గట్టిగా పట్టుకునే పాడాడు విజయ్. ఆ రోజు విజయ్ పాడినది ప్రణయగీతం. మధ్యలో లతను చూస్తూ చిలిపిగా నవ్వుతూ పాడాడు. సభ్యులందరూ ఎంతో ఆనందించి చప్పట్లు కొట్టారు. విలసిత ముఖంలో జీవం ఎగిరిపోయింది. ఎప్పుడూ విజయ్ పాటకు పరవశించే విలసిత ఆనాడు ఆ పాట వింటూ నిప్పుల్లో పడేసినట్లే కుమిలి పోయింది. పరాజయం ఎదురవుతోన్నకొద్దీ ఏదో అసహనం పెరిగిపోసాగింది విలసితలో. పాట పూర్తయిన తరువాత విలసిత పూలదండ తీసుకొచ్చి "ఒక్కటే తెప్పించాను. అయామ్ సారీ !" అంటూ విజయ్ మెడలో వేయ బోయింది. విజయ్ తప్పుకుని "పరవాలేదు. ఒక్కదానితోనే ఇద్దరినీ సన్మానించే ఉపాయం నేను చెపుతాను. మీ రా దండ లత మెడలో వేయండి. లత నా మెళ్ళో వేస్తుంది'' అన్నాడు. అందరూ మళ్ళీ నవ్వుతూ చప్పట్లు కొట్టారు.

లత పెళ్ళికూతురులాగే సిగ్గుపడిపోయింది. నిలువెల్లా వణుకుతోంది. కానీ, సంతోషానికి ప్రతిరూపంలా ఉంది.

తరువాత విలసిత ఖరీదైన పార్కర్ పెన్ విజయ్‌కి బహుమతిగా ఇచ్చింది. దానిని అక్కడే అందరి సమక్షంలో వేణుకి బహుమానంగా ఇచ్చాడు విజయ్. విలసిత బొమముడి చూసీ చూడనట్లుగా ఆ బహుమతి అందుకున్నాడు వేణు.

లత చెయ్యిపట్టుకుని ఆ గుంపులోంచి బయటపడ్డాక, పార్కులో కూచున్నాక అప్పుడు లత చెయ్యి వదిలి నుదుటికి పట్టిన చెమట తుడుచుకున్నాడు విజయ్.

అపారమైన సంతోషంతో మెరిసిపోతున్న కళ్ళను విజయ్ ముఖంమీదే నిలిపి అతని పాదాలపైన చేతులు వేసింది లత.

విజయ్ తన పాదాలు వెనక్కి లాక్కోలేదు. రెండుచేతులూ తలక్రింద పెట్టుకుని గడ్డిలో వెనక్కి వాలి "అదేమిటి?" అన్నాడు నవ్వుతూ.

"నువ్వు చాలా మంచివాడివి విజయ్!"

"అలాగా! ఆ సంగతి నా కింతవరకూ తెలియదుసుమా!"

"నాకు మాత్రం ఎప్పుడో తెలుసు! ఎప్పుడూ తెలుసు!"

"అన్నీ తెలుసు. కానీ 'మంచి' అనేదానికి ఒక నిర్వచనం లేదని మాత్రం తెలియదు!"

"అదేమిటీ?"

"అదంతేలే! ఇది చెప్పు! ఆర్ యూ హేపీ?"

"అడుగుతున్నావా? నా ముఖం చూస్తే తెలియటంలా?"

"ఎందుకు తెలియటంలా? ఇప్పుడూ తెలుస్తోంది! ఇందాక ఒక గంట ముందూ తెలిసింది..."

"సారీ విజయ్! అప్పుడు ఆ క్షణంలో విలసిత నిన్ను ప్రాణమిత్రుడని చెప్తోంటే, నీ భుజంమీద చెయ్యివేసి తిరుగుతోంటే, నా గుండె ఆగిపోతుం దనిపించింది."

"మహా తల్లివి! నేనూ మనసులో అదే భయపడ్డాను" అనుకున్నాడు మన సులో విజయ్

"కానీ నువ్వలా నా దగ్గిరికి రాగానే - ఆవిడముందే నన్ను నీ దాన్నిగా ప్రకటించగానే నా అనుమానాలన్నీ పటాపంచలయిపోయాయి. అ...బ్బ! ఎంత రిలీఫ్!"

తన పాదాలమీద చెక్కిలి ఆనించిన లత చెయ్యిపట్టి తన గుండెలమీదకు లాక్కుని "పిచ్చిపిల్లా!" అన్నాడు ఆర్ద్రంగా.

"విజయ్! ఆ విలసిత ఎంత అందంగా ఉందీ? ఆవిడముందు నేను దివిటీ పక్కన దీపంలా లేనూ?"

"అబ్బబ్బ! ఆ ప్రస్తావన వదిలేద్దూ! కొంచెంసేపు సరదాగా ఉండాలని వస్తే పిచ్చి విషయాలన్నీ మాట్లాడకు!"

"మాట్లాడను - కానీ, ఇదొక్కటి చెప్పు. ఆవిడకూ నీకూ ఎలాంటి పరిచయం?"

ఎలాంటి పరిచయం? ఆ పరిచయాన్ని లత కెలా చెప్పాలి?

*　　　　*　　　　*

జాకెట్టు సరిగా తొడుక్కుని, చీర కుచ్చెళ్ళు సవరించుకుని, అద్దంముందు కూచుని బొట్టు సరిగా దిద్దుకొంటుంది విలసిత. అద్దంలో ప్రతిబింబించే ఆ అందమైన ముఖాన్ని చూస్తూ ''ఇలా ఎన్నాళ్ళు విలసితా?'' అన్నాడు విజయ్.

విలసిత విజయ్‌వైపు తిరిగి చిరునవ్వు నవ్వుతూ ''ఏం కష్టంగా ఉందా?'' అంది.

''కష్టమనికాదు! పెళ్ళి కాకుండా ఇలా ఎన్నాళ్లా? ఇప్పటికే మీ ఇంటి చుట్టుపక్కల అందరూ మనని గురించి గుసగుసలు చెప్పుకుంటోనే ఉన్నారు. త్వరగా పెళ్ళిచేసుకోవటం మంచిది కదూ!''

విలసిత సమాధానం చెప్పలేదు. అద్దంలో తన ప్రతిభింబాన్ని జాగ్రత్తగా చూసుకుంటూ కనుబొమలు దిద్దుకోసాగింది.

''ఏమంటావ్ విలసితా?''

''అబ్బ! ఇట్లాంటి వెధవ గొడవలు మానేసి ఏదైనా సరదా కబుర్లు చెపుదూ.''

అద్దంముందున్న స్టూల్‌మీద విసుగ్గా గిర్రున తిరిగి విజయ్ ఎదురుగా కూర్చుని తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో అంది విలసిత.

''వెధవ గొడవలా?'' తెల్లబోయి చూసాడు విజయ్... ''ఏవి వెధవ గొడవలు?''

''అదే! పెళ్ళి...పెళ్ళి...పెళ్ళి... ఇంటిదగ్గిర మా బామ్మకంటె అన్యాయంగా తయారయ్యావు. ఎక్కడో బి. సి. లో పుట్టవలసిన మనిషివి...''

''అంటే? ఇప్పట్లో పెళ్ళిచేసుకునే ఉద్దేశం లేదా నీకు!''

''లేదు. అంతేకాదు. ఎప్పట్లో చేసుకుంటానో కూడా తెలియదు పెళ్ళంటే ఇలాంటి స్నేహాలలాంటి దనుకున్నావా? ఎన్ని ఆలోచించుకోవాలి? తొందరపడి ఎవరినంటే వాళ్ళను ఎలా పెళ్ళిచేసుకోను?''

''విలసితా!'' ఆశ్చర్యంతో విజయ్‌కి నోటమాట రావటంలేదు. ''నన్ను పెళ్ళి చేసుకోనని చెప్తున్నావా నువ్వు?''

విలసిత ముఖం చిట్లించుకుంది.

''ఏమీ చెప్పటంలేదు. పెళ్ళికి బాగా ఆలోచించుకోవాలని మాత్రమే చెప్తున్నాను. నాకు బాగా డబ్బుంది. అది చూసి ఎవరంటే వాళ్ళీ పెళ్ళికి ముందు




కొస్తారు. అంతమాత్రాన నేను ఎవరినంటే వాళ్ళను చేటుకుంటానా ? నా స్టేటస్‌కి, మా కుటుంబ గౌరవానికీ సరిపడినవాడు దొరకద్దూ ?"

విజయ్ మాట్లాడలేదు ఆ చివరి మాటలకు విజయ్ మనసులో వాడి బల్లెం గుచ్చినట్లే అయింది.

విజయ్ పాటని మెచ్చుకుంటూ ఎప్పుడూ అతనికి అసంఖ్యాకంగా ఉత్తరాలు వస్తూనే ఉంటాయి. ఒకసారి అలాంటి ఉత్తరాల్లో ప్రశంసలతోపాటు ఆహ్వానం కూడా ఉంది.

మిస్టర్ విజయ్ కుమార్ !

మొన్న పాటకచేరీలో మీ పాట విని పరవశించిపోయిన వేలాది ప్రేక్షకుల్లో నేనూ ఒకదానిని. దయచేసి - ఒక్కసారి మా ఇంటికి రారూ ? మీ దర్శన

భాగ్యంకోసం వేయి కళ్ళతో ఎదురుచూస్తున్నాను. నా అడ్రస్ ఈ క్రింద ఇస్తున్నాను.

విలసిత...''

అప్పుడప్పుడు ఇలా కొందరు అతనిని ఆహ్వానించటంకూడా విజయ్‌కి అలవాటే! 'విలసిత' పేరు అతడిని ఆకర్షించింది. వెళ్ళాలనిపించింది. వెళ్ళాడు. పేరులాగే మెరుపుతీగెలాగ ఉంది, ఆ అమ్మాయి. చిరునవ్వుతో చేతులు జోడించింది. "నాపేరే విలసిత. లోపలికి రండి" అంది.

లోపలికి వచ్చి కూచుని చిత్రంగా చుట్టూ చూసాడు. అది మూడు గదులున్న చిన్న ఇల్లు. ఇల్లు చిన్నదేకాని మంచి షో ఉంది. ఆ ఇంట్లో అడుగడుగునా ఐశ్వర్యపు ఛాయలు కనిపిస్తున్నాయి.

"ఇంట్లో ఎవరూ లేరా?" అన్నాడు.

కిలకిలా నవ్వింది విలసిత. "భయంగా ఉందా? మిమ్మల్ని కొరుక్కుని తినను లెండి!" అంది.

ఆ చొరవకు ఆశ్చర్యపోయాడు. కానీ, అంత అందం అలా అల్లరిచేస్తోంటే ఆహ్లాదంగానే ఉంది.

"మావాళ్ళంతా వూళ్లో ఉన్నారు. నేనిక్కడ బి. యస్‌సి. చదువుతున్నాను. వంటా, పైపనీ, అన్నీ చూసుకుంటూ ఒక మనిషి నాతో ఎప్పుడూ ఉంటుంది."

అలా ప్రారంభమైన పరిచయం చాలా కొద్ది కాలంలోనే పెరిగిపోయింది. విలసిత ప్రోత్సాహమే అలా పెరగటానికి కారణం. విలసిత గురించి రకరకాల మాటలు విజయ్ చెవిన పడ్డాయి. కొందరు విజయ్ ముఖంమీదే రకరకాల అర్థాలు ధ్వనించేలా మాట్లాడారు—కానీ విజయ్ అవేవీ పట్టించుకోలేదు. విలసిత చిరునవ్వుచూస్తూ, ఆమె సమక్షంలో గడుపుతూ ఆమెను గురించి మరొకలా భావించగలిగేశక్తి అతనికి లేకపోయింది. ఒకటి రెండు సార్లు విలసితను విజయ్ తన ఇంటికి ఆహ్వానించాడు. విలసిత శ్యామలకు నమస్కారంచేసింది. ఆ నమస్కారంలో వినయంలేదు, గౌరవం అసలేలేదు. విలాసంఉంది. తిరస్కారంఉంది. వల్లమాలిన అహం ఉంది. విలసితను తన కోడలిగా ఊహించుకుని హడలిపోయింది శ్యామల-విలసిత వెళ్ళిపోయాక "విజయ్! నిజంగా నువ్వా అమ్మాయిని చేసుకోవాలనుకుంటున్నావా?" అంది.

విజయ్ కి తల్లిమనసు అర్థమయింది. క్షమార్పణ చెప్పుకుంటున్నట్లుగా "అవునమ్మా! ఈ రోజుల్లో పిల్లలంతా ఇంచుమించు ఇలాగే ఉంటున్నారు.

నీకు కోడలొచ్చాక నువ్వు మంచిమాటలతో చెప్పి నీకు తగినట్లుగా మార్చుకో వచ్చును!" అన్నాడు.

శ్యామల కష్టపెట్టుకుంది అయినా పైకి నిగ్రహించుకుంటూ "ఆ శ్రమ నాకుండదులే విజయ్! ఆ అమ్మాయి కోడలిగా ఈ ఇంట్లో అడుగుపెట్టాక ఇంకా నేనిక్కడ ఉంటాననుకున్నావా ?" అంది.

తల్లిమనసులో అయిష్టం స్పష్టంగా తెలుస్తోన్నా విలసితను వదులుకోలేక పోయాడు విజయ్. ఈ రోజు విలసిత తానే పెళ్ళిగురించి ఇలా మాట్లాడుతోంటే మతిపోతోంది విజయ్‌కి.

విలసిత విజయ్ దగ్గరగావచ్చి అతని భుజంమీద చెయ్యివేసి నవ్వుతూ 'ఏమిటాలోచిస్తున్నావ్ ? రేపు వస్తావుగా !' అంది...విజయ్ లేచి నిలుచున్నాడు. ఒక్కసారి విలసిత ముఖంలోకిచూసి ఏ సమాధానమూ చెప్పకుండా వచ్చేసాడు. ఆ తరువాత వరసగా వారంరోజులు విలసిత దగ్గరకి వెళ్ళలేదు విజయ్. విలసిత తనంతట తనే విజయ్ ఇంటికొచ్చింది. శ్యామలను ఏమాత్రమూ లక్ష్యపెట్టకుండా నేరుగా విజయ్ గదిలోకొచ్చేసింది. మంచంమీద పడుకొనిఉన్నాడు విజయ్. విలసితను చూడగానే విజయ్‌ముఖం ఒక్కసారిగా వెలిగింది. ఆ వెలుగు గమనించిన విలసిత గర్వంగా నవ్వుకుని విజయి పక్కలో కూచుని అతని ముఖాన్ని రెండుచేతులలోకి తీసుకుని ముద్దుపెట్టుకుంటూ "యూ నా టీ! మా యింటికి ఎందుకురాలేదు?" అంది. విజయ్ కరిగిపోయాడు. విలసిత వొళ్ళో తలపెట్టుకుని "అబ్బా!" అన్నాడు. ఆ రెండు క్షణాలలోనూ తన వియోగానికి అతడు ఎంత బాధపడుతున్నాడో అర్థం చేసుకున్న విలసిత పకపక నవ్వుతూ మరోసారి ముద్దుపెట్టుకుని "రేపు రా" అని వెళ్ళిపోయింది. ఆ మరునాడు విజయ్ విలసిత యింటికి వెళ్ళాడు. విలసిత భుజాలమీద చేతులువేసి "విలసితా! నాతో ఆడుకోవాలని చూడకు! నన్ను ఎప్పుడు పెళ్ళిచేసుకుంటావోచెప్పు !" అన్నాడుకచ్చితంగా-ఆ చేతులను తేలిగ్గా తోసిపారేసి ఎడంగా కూచుంది విలసిత. "నాకు పెళ్ళిలోనూ, ప్రేమలోనూ కూడా నమ్మకం లేదు విజయ్ !"

"అయితే ఇన్నాళ్లూ నువ్వు మాట్లాడిన మాటలు...నీ చేష్టలు..."

"అవేవీ అబద్ధంకాదు. అప్పటికవి నిజమే! కానీ ప్రేమ ఒకరిమీదే నిలుస్తుందని నేను నమ్మను-మారిపోవచ్చు. మారుతుంది. ఎప్పుడెవరిమీద మనస్సు నిలిస్తే వాళ్లను ప్రేమిస్తాను...."

"అయితే ఇంతకుముందుకూడా..."

"అఫ్‌కోర్స్ : యూ సిల్లీ! ఏమనుకుంటున్నావు నువ్వు ?"

"అసలు పెళ్ళిచేసుకోవా ?"

"ఎందుకు చేసుకోను. పెళ్ళి పూర్తిగా వ్యవహారం, దానిని మా అన్నయ్యా మా నాన్న వ్యవహారపక్షంగానే నిర్ణయిస్తారు. నాకూ అదే ఇష్టం..."

భరించలేకపోయాడు విజయ్-అతని దురదృష్టమెక్కడంటే అప్పటికీ విలసిత మీదనుంచి అతడు మనసు మళ్లించుకోలేక పోతున్నాడు. మొదట భరింపరాని బాధ కలిగింది. ఆ తరువాత ఆ బాధంతా కోపంగా మారింది. విలసిత రెండు చేతులూ గట్టిగా పట్టుకుని ''నువ్వు నన్ను పెళ్ళిచేసుకొని తీరాలి! ఎలా చేసుకోవో నేనూ చూస్తాను!" అని కోపంగా వచ్చేశాడు. ఆ తరువాత మళ్లీ విలసిత దగ్గరికి వెళ్ళలేదు. కానీ విలసితను ఒక్కక్షణంకూడా మరిచిపోలేదు. ఏ క్షణానికా క్షణమే విలసిత తనదగ్గరకు వస్తుందని ఎదురు చూస్తున్నాడు. పదిహేను రోజుల తరువాత విజయ్‌దగ్గరికి వచ్చింది విలసితకాదు-విలసిత అన్న.

"మీకు నేను తెలియకపోవచ్చు నేను విలసిత అన్నని-విలసిత మీగురించి చెప్పింది..."

ఈ మాటలు వినగానే విజయ్ మనసు ఆనందంతో నిండిపోయింది. తన పెళ్లి తన అన్న నిశ్చయం చేస్తాడని చెప్పింది విలసిత ఇతడు అందుకే వచ్చిఉంటాడు. విలసితమీద కోపం తెచ్చుకున్నందుకు బాధపడుతూ" క్షమించండి! నాకు విలసితమీద కోపం ఏమీలేదు. పెళ్లి చేసుకోనని అన్నందుకు పట్టుదలకొద్దీ రావటం మానేశాను. కానీ అనుక్షణం విలసితను తలుచుకుని బాధపడుతూనే ఉన్నాను" అన్నాడు. విలసిత అన్న విజయ్‌వంక అపోకమాదిరిగా చూసి కొద్దిపాటి నిరసనగా నవ్వాడు.

"మా విలసితమీద మీకామాత్రం అభిమానం ఉన్నందుకు సంతోషంగానే ఉంది. మన బేరం త్వరగా తెమిలిపోతుందని ఆశపడుతున్నాను."

'బేరమా? బేరందేనికి? నాకు కట్నం కానుకలేమీ అక్కర్లేదు."

"అదికాదు మిస్టర్ : మా విలసిత మీకు రాసిన ప్రేమలేఖలు నాకిచ్చేయటానికి ఎంతకావాలి మీకు ?''

విజయ్ నిర్ఘాంతపోయాడు. నోట మాటరాలేదు.

"లాభంలేదు మిస్టర్: ఆ ఉత్తరాలు మీ దగ్గర పెట్టుకుని మా చెల్లెల్ని మీరు బ్లాక్‌మెయిల్ చెయ్యలేరు. మాకున్న ఇన్‌ఫ్లుయెన్స్ మీకు తెలియదు. మర్యాదగా ఒక సెటిల్‌మెంట్‌కి రండి!''




విజయ్ తేరుకున్నాడు-అతని మనసంతా మంచు పేరుకున్నట్లు గడ్డకట్టుకుపోయింది.

"ఇలా మాట్లాడమని విలసితే పంపిందా మిమ్మల్ని?"

"విలసిత చెప్పకపోతే మీరెవరో, ఈ గోలేమిటో, నా కెలా తెలుస్తుంది? వస్తున్నాను దీనితో..."

విజయ్ లోపలికెళ్ళి విలసిత తనకు రాసిన ఉత్తరాలన్నీ తీసుకొచ్చి విలసిత అన్న చేతిలో పెట్టేడు. అతడు సంతోషంగా వాటి నందుకుని, "మీకు ఎంత కావాలి?" అన్నాడు జేబులో చెయ్యి పెడుతూ.

"గెటవుట్!" గట్టిగా అరిచాడు విజయ్ మరుక్షణం వీధిలోపడి తన కారులో కూచున్నాడు అతడు.

ఇంత జరిగినా విలసిత గుర్తుకొచ్చినప్పుడల్లా మనసులో ముల్లుగుచ్చుకున్నట్లే అయ్యేది విజయ్‌కి. విలసిత మరో యువకుడితో నే స్తంకట్టింది. అతడితో కలిసి తిరుగుతూనే విజయ్‌ని చూసి గర్వంగా నవ్వింది. విజయ్ తలదించుకుని వచ్చేసాడు. ఆ రాత్రి ఎంత ప్రయత్నించినా అతని కన్ను మూతపడలేదు. విజయ్ అవస్థ శ్యామల అర్థంచేసుకుంది. "నా మాట విను: పెళ్ళి చేసుకో: అన్నీ సర్దుకుంటాయి-" అంది శ్యామల నచ్చజెపుతున్నట్లు...విజయ్‌కి కూడా అదే మంచి మార్గమని తోచింది. అతి మామూలుగా లతను చూడటానికి వచ్చాడు. లత అమాయకత్వంలో ఏదో ఆకర్షణ తోచి ఒప్పుకున్నాడు-కానీ లత మనసులో ప్రేమ వుప్పెనలా అతడిని చుట్టుముట్టి ఉక్కిరిబిక్కిరి చేసింది. అతనికి తెలియకుండానే లత అతడి సర్వస్వమూ అయిపోయింది-మరొకసారి విలసిత

ఎక్కడో కనిపించి పలకరించినపుడు విదలించుకుని వచ్చేసాడు—ఆ రోజు అతని మనసు ఏ విధంగానూ బాధపడలేదు. ఏదో దుష్టగ్రహంనుండి విముక్తి కలిగి నట్లు అనిపించింది. విలసిత పెళ్ళి చేసుకుందని విన్నప్పుడు హాయిగా అదొక వింతగా నవ్వుకున్నాడు-కించిత్తుకూడా బాధ కలగలేదు. ఇప్పుడు లత అడుగు తోంది.

"విలసితతో నీ కెలాంటి పరిచయం?'' అని-లతను తను పెళ్ళిచేసుకో బోతున్నాడు. దాపరికంలేకుండా ఉన్నది వున్నట్లుగా చెప్పటమే నయమేమో! లత ముఖంలోకి చూసాడు-ప్రాణాలు బిగపట్టుకుని అడుగుతోంది లత-

"చెప్పు విజయ్! ఆ విలసితతో నీకు మామూలు పరిచయమేకదూ! ఎలాంటి అనుబంధమూ లేదుకదూ!"

అలా అడుగుతోన్న లత ముఖంలోకి ఒక్కసారి పరిశీలనగా చూసి నిట్టూర్చి, వణుకుతోన్న లతచుట్టూ చెయ్యివేసి అన్నాడు విజయ్!

"అవును లతా! మామూలు పరిచయమే! ఆవిడ ధోరణే అంత! చూసావుగా ఎవరితోనైనా అంతే!"

"హమ్మయ్యా!" అప్రయత్నంగా అనేసింది లత

"నాకు తెలుసు!" అనుకున్నాడు విజయ్.

* * *

లత వెళ్ళేసరికి విమల ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లు కూర్చుంది. అక్కడ చంద్రశేఖరం కూడా ఉన్నాడు.

"ఏమిటి సంగతి?" అంది లత.

విమల తల చేత్తోపట్టుకుని వేలితో ఒక మూలకు చూపించింది. అటుచూస్తూనే తెల్లబోయింది లత—ఒక అయిదారేళ్ళ పాప బెదురుచూపులతో కిందకూచుని ఉంది. ఆ పాప జుట్టంతా చిందరవందరగా ఉంది. తొడుక్కున్న గౌను చాలా చవకరకంది. ఆ ముఖంలో ఎక్కడలేని దైన్యమూ ఉట్టిపడుతూ ఉంది. లతను చూడగానే నవ్వి నమస్కారంచేసింది. ఆ నవ్వులో, ఆ నమస్కారంలో ఉన్నది. మర్యాద కాదు—ఏదో యాచన. ఆ పాప నవ్వినా, చూసినా, అతి దీనంగా, ఎవరినో, ఏదో అడుగుతున్నట్లుగా ఉంది. ఇలాంటి దృశ్యాలు చూడ లేదు లత.

"ఎవరీ పాప!" అంది.

"నాకేం తెలుసు?"

"నీకు తెలియకుండా ఇక్కడెలా ఉంది ?''

"ఎవరో అమ్మ కని అనాధశరణాలయంలో పారేసింది, మరెవరో అయ్య తెచ్చి నా దగ్గర పడేసాడు !"

లత చటుక్కున చంద్రశేఖరంవైపు చూసింది. చంద్రశేఖరం నవ్వుకున్నాడు, విమలనే చూస్తూ...చూపులు తిప్పుకుంది విమల.

"ఆకలి!" అంది పాప...

విమల పకపక నవ్వింది. ఆ పాప అంత దీనంగా 'ఆకలి' అంటూంటే అందులో నవ్వవలసిందేమిటో అర్థంకాలేదు లతకి.

"ఎందుకు నవ్వుతున్నావ్ ?"

"దీనికి అన్నంపెట్టి అరగంటకూడా కాలేదు. మానవ స్వభావం చూడు! ఏ అలవాటుకైనా ఎంతగా బానిసలయిపోతారో? దానికి ఎప్పుడూ ఆకలి అకలి అని దేవిరించడం బాగా అలవాటయిపోయింది. కడుపునిండినా అలా అడగటం మానలేకపోతుంది ..."

నిజమే కావచ్చు—నిజమైనా విమలలా నవ్వలేకపోయింది లత. అంత చిన్న వయసులో ఆకలికి అలా అలమటించిపోవలసిన దురవస్థచూసి మనసు కరిగిపోయింది.

"పాపం !" అంది.

''ఒక పాపంకాదు—చాలా పాపాలు !"

"అంటే ?"

"అనాధ శరణాలయం నిండా ఇలాంటి పాపాలే! ఎంతమందికని జాలి చూపిస్తావే ?''

పాపను చూసింది లత—చాలా ముద్దుగా ఉంది. ఆ ముఖంలో చంద్రశేఖరం పోలికలు కనిపిస్తాయేమోనని చూసింది. ఏ కోణానా లేవు

"ఏమిటలా చూస్తున్నావు? తెలిసిన పోలికలు కనిపిస్తాయేమోననా! కనిపిస్తున్నాయా ?" అల్లరిగా అడిగింది విమల. ఉలికిపడింది లత. "ఛ ! ఛ ! అదేం కాదు ! ఊరికే చూస్తున్నాను...'' అని మనసులో 'ఈ విమల మనుష్యుల్ని ఎంత బాగా చదువుతుంది ?' అనుకుంది,

"ఆకలి !" అంది మళ్ళీ పాప...

"దరిద్రుడికి ఆకలెక్కువని...ఇప్పుడేంలేదు పో!" కసిరింది విమల—ఆ పాప

కళ్ళలో నీళ్ళు గౌనుతో తుడుచుకుని బిక్కు బిక్కుమంటూ విమలవైపుచూసి నోటికి చెయ్యి అడ్డుపెట్టుకుంది. చంద్రశేఖరంకూడా అదోకలా అయిపోయాడు.

"పోనీ ఏదైనా పెట్టు విమలా!" అంది లత.

"వాట్ నాన్సెన్స్! నేను లక్షాధికారి ననుకుంటున్నావా? మా నాన్నగారు పోయారు నేను సంపాయించాలి! మా అమ్మను పోషించాలి. నా పెళ్ళికి కట్నం పోగుచేసుకోవాలి!"

పకాలున నవ్వేసింది విమల. "ఇన్ని ఖర్చులమధ్య ఈ పిల్లను మహారాణిలా పెంచగలనా? ఏదో తద్దినం నా నెత్తిన వచ్చిపడింది. తప్పదు దేవుడా, అనుకుంటూ ఇంత తిండి పడేస్తాను-అంతే......"

లత పాపను చూసింది. ఐదేళ్ళు నిండీ నిండని పసిపిల్ల! లోకంలో మమతకూ లాలనకూ నోచుకోక జంతువులాగ ఇంత తిండి తిని పెరగవలసిందేనా? ఆ అందమైన కళ్ళలో—ఆ అమాయకమైన నవ్వులో—కరడుగట్టిన దైన్యాన్ని కరిగించే ఉపాయం ఏమీ లేదా?

"రా లతా! అలా ఏదైనా సినిమా కెళ్దాం! శేఖరంకూడా వస్తాడు!" అంటూ లేచింది విమల

ఆ రోజు విమల తల్లి సుగుణకూడా ఇంట్లో లేదు.

"నేనూ వస్తాను!" అంటూ లేచింది పాప...

"ఎక్కడికొస్తావ్! కూచో! ఆ అవతారం నువ్వూ..." కసిరింది విమల.

లత తెల్లబోయింది. మాట్లాడుతున్నది విమలేనా?

"నాకు భయం!"

"ఎందుకూ భయం! నీలాంటి దరిద్రగొట్టు ముఖాల్ని ఎవరూ ఎత్తుకుపోరు-నీ కేమీకాదు!"

లత సహించలేకపోయింది.

"ఏమిటిది విమలా? నువ్వు మాట్లాడుతున్నది నోరెరుగని పసిపిల్లతో..."

"నాకు తెలుసు! శ్రీరంగనీతులు చెప్పటానికి అందరూ తయారవుతారు. బాధ్యత భరిస్తే తెలిసొస్తుంది, దూరంనుంచి ఎంత తియ్యగానైనా మాట్లాడవచ్చు. అసలే నేను ఇబ్బందుల్లో ఉంటే మా నాన్న అప్పులుకూడా చేశాడు తెలుసా—?"

నీ కంత కష్టంగా ఉంటే—ఈ పాప బాధ్యత నీకు భరించక తప్పనిదయితే నేను పెంచుతాను ఈ పాపని..."




"నిజంగానా? నీకు మాత్రం అవస్థకాదూ! ఎంతోకాలం ఉండదులే! రెండు మూడేళ్లు—ఆ తరవాత తండ్రివచ్చి తీసికెళ్ళిపోతానన్నాడు..."

"ఫరవాలేదు—నా కేం అవస్థలేదు— నే నేమంత ఇబ్బందుల్లో లేను — ఒక చిన్న పిల్లను పోషించగలను......"

"సరేలే! మనం సినిమాకి వెళ్ళొచ్చాక పాపని తీసికెళ్దువుగాని......"

"సినిమాకు నేను రాను. నువ్వూ, శేఖరం వెళ్లండి. పాపకు ఒక్కదానికి భయం వేస్తూందని అంటోంది. దాన్ని తీసుకుని నేను మా యింటికి వెళ్తాను."

లత రమ్మనగానే వచ్చింది పాప. ఎవరు ఆప్యాయంగా పిలుస్తారా? అని వాపిలిగా కాచుకుకూచున్నట్లుగా ఉంది. పాపను తీసుకుని లత వెళ్ళుతూంటే వెనుకనుంచి విమల తనలో తను నవ్వుకోవటం లత గమనించలేదు.

లత పాపను పెంచుతాననటంతో సుందరమ్మ చాలా చికాకుపడింది. "ఇదెక్కడి మేళమే! ఎవతె కనిపడేసిందో మనింట్లో దేనికి?" అని విసుక్కుంది.

జయ కోపంగా ఇంటికెవరైనా వచ్చి ఈ పాప ఎవరంటే ఏం సమాధానం చెప్పుకోవాలి? అప్రతిష్ట..." అంది. జగన్ మాత్రం సంబరంగా పాపకి తన బొమ్మలన్నీ చూపించటం మొదలుపెట్టాడు అప్పుడే.

ఎవరేమన్నా లత వినిపించుకోలేదు. పాపను తనదగ్గరుంచుకుని పెంచడానికే నిశ్చయించుకుంది. లత మొండి పట్టుదల తెలిసిన ఎవరూ ఏమీ చేయలేక పోయారు. ఆ రాత్రి లత పాపకి అన్నంపెడుతూ "కడుపునిండా తిను!'' అంది.

పాప ఆశ్చర్యంగా "కడుపునిండా తినద్చా?" అంది. లత అంతకంటే ఆశ్చర్యంగా "ఎందుకు తినకూడదు?" అంది.

"మా అమ్మ పాపం చేసింది. నేనూ పాపం చేశాను. అందుకే కడుపునిండా తినకుండా దేవుణ్ని ప్రార్థన చెయ్యాలి? ప్రతిరోజూ వింటున్న మాటలు రామ చిలుకలా అప్పగించింది పాప-లతకు కడుపు తరుక్కుపోయింది. ఇంత పసిపిల్ల చేత ఈ రకంగా మాట్లాడించిన వాళ్ళు ఎంత పాపాత్ములు?

"లోకంలో పాపమూ, పుణ్యమూ అనేవి లేవు పాపా? సుఖమూ, దుఃఖమూ రెండే ఉన్నాయి. సుఖపడటం చేతకానివారు దుఃఖపడతారు-అంతే!"

పాప కా మాటలు అర్థంకాలేదు. వింతగా ఉన్నాయి.

"ఏమిటీ?" అంది ఆశ్చర్యంగా.

లత మళ్ళీ చెప్పింది, మళ్ళీ, మళ్ళీ, మళ్ళీ, చెప్పింది-పాప వెనుకటి పాఠం మరిచిపోయి ఈ మాటలు పట్టుకునేవరకు చెప్పింది.

వారంరోజుల్లోనే పాపముఖంలో దైన్యం చాలావరకు మాయమయింది. అసలే అందంగా ఉండే పాప ముఖం కొత్త ఉత్సాహంతో మరింత అందంగా తయారయింది. సహజంగా ఆర్ద్రప్రవృత్తికల లతకు నిజంగానే పాపమీద ప్రేమ కలగటం మొదలయింది. లతకోసం వచ్చిన విజయ్ పాపనుచూసి ఆశ్చర్యంగా "ఈ పాప ఎవరూ?" అన్నాడు "నా కూతురు!" అంది లత నవ్వుతూ, పాపను ముద్దు పెట్టుకుంటూ...విజయ్ వింతగా చూసి, చటుక్కున పాపను దగ్గిరగా తీసుకుని "నీ కూతురయితే నాకూ కూతురే!" అన్నాడు.

"ఛ! ఛ! ఏం బాగులేదు ఇలా...నేను నా కూతురనగానే నువ్వు నన్ను అనుమానించాలి! అపార్థం చేసుకోవాలి..." చికాకు నటిస్తూ చిరునవ్వుతో అంది లత...

"ఈ అనుమానాలూ అపార్థాలూ నావల్లకాదు తల్లీ! ఓపికుంటే ఆ ముచ్చటలన్నీ నువ్వు తీర్చుకో!"

ఏదో అలసిపోయినవాడిలా అన్నాడు విజయ్-లత నవ్వి విజయ్ చేతులు తన చెక్కిలికి ఆనించుకుంది.

"నేను నిన్ను అపార్థంచేసుకోను విజయ్! కానీ...కానీ...నీ మనసులో మరొకరికి చోటు ఉందనుకుంటే నేను ఏదేదో అయిపోతున్నాను-నేను నా వశం తప్పిపోతున్నాను-ఉచితా నుచితాలే తెలియటంలేదు. అన్నట్లు విలసిత దగ్గిర నుండి నీకు ఆహ్వానం వచ్చిందా?"

విలసిత వేణుని వదిలేసింది. మళ్లీ మరొకరిని పెళ్లిలాటిది చేసుకుంటోంది. అంత ఘనంగానూ మళ్ళీ పార్టీ ఏర్పాటుచేసి అందరినీ పిలుస్తోంది...విజయ్ వచ్చిందన్నట్లు తలూపాడు.

"విలసిత నీకెలా తెలుసు?'' అని అడిగాడు. విలసిత ప్రస్తావన తేవటం ఇష్టంలేక, లతతో విలసితను గురించి మాట్లాడలేక ఆ ప్రశ్న ఎప్పుడూ అడగ లేదు...

"విలసిత చిన్నప్పటినుండీ నా క్లాస్‌మేట్! తెలివిగలది-కానీ ఎప్పుడూ బాగా చదివేదికాదు. వాళ్ళదేదో మరొక ఊరు. ఇక్కడొక బామ్మగారితో ఉండేది. ఎంతసేపూ తన అందం-తన ఐశ్వర్యం-తన దర్జా...ఇవన్నీ నలుగురికీ చూపించి నలుగురిలో గొప్పగా వెలిగిపోవాలనే తాపత్రయమే! ఇంటర్‌లో ఫెయిలయింది. ఎప్పుడూ బాయ్ ఫ్రెండ్స్‌తో తిరుగుతుండేది—నేను రానన్నా బలవంతాన పార్టీలకి తనింటికి లాక్కెళ్ళేది తన గొప్ప చూపించటానికి. ఇంటర్ ఫెయిలయ్యాక తనతో పరిచయం తగ్గిపోయింది. కాని అప్పుడప్పుడు ఇలా పిలుస్తూ ఉంటుంది..."

"అది సరే! ఆ పాప ఎవరు?"

ప్రస్తావన మారుస్తూ అన్నాడు విజయ్.

"విమలకు తెలిసినవాళ్లెవరో కొంచెంకాలం పెంచమని ఇచ్చారుట-విమల అసలే ఇబ్బందులలో ఉంది. ఈ పాప తనకు మరొక బరువని బాధపడింది. అందుకని నేను తీసుకొచ్చాను."

విజయ్ ముఖం చిట్లించి ''ఎందుకొచ్చిన అనవసరపు గొడవలు? వదిలించుకో!" అన్నాడు.

"భలేవాడివే!! రెండేళ్ళ తరువాత ఈ పాపను వాళ్ళ వాళ్ళు తీసుకుపోతే ఎలాగా అని బెంగ పెట్టుకున్నాను. ఇప్పటినుంచీ-"

"నువ్వు ప్రేమించగలవు లతా! అందుకే నాకు నువ్వంటే భయం!"

"భయమా? నేను నిన్ను ఏంచేస్తానని?"

"పిచ్చీ! నిన్ను నువ్వు ఏమైనా చేసుకుంటావని..."

"నువ్వు లేవూ, కాపాడటానికి!"

"అఫ్‌కోర్స్! నేనుండగా నిన్నేమీ అయిపోనివ్వను-''

"అది తెలుసుగనుకనే—విలసిత ఇస్తోన్న పార్టీకి వస్తున్నావా?''

"రావాలనిలేదు. నువ్వూ వెళ్ళకు-అలాటి వ్యక్తులకు దూరంగా ఉండటమే మంచిది."

"నాకు వెళ్ళాలని ఉంది. ఈ సమాజం ఎంత చిత్రమైనదో చూడాలని ఉంది. వెనకాతల అందరూ విలసితను ఆడిపోసుకుంటారు-కానీ, ఇలాంటి పార్టీలకు మాత్రం పిలిచినవాళ్ళందరు వెళ్తారూ. అతి మామూలుగా వ్యవహరిస్తారు. ఈ తమాషా అంతా చూడటానికి చాలా సరదాగా ఉంటుంది..."

"అంతా డబ్బులో ఉంది. ఆవిడకు డబ్బుంది-ఎవరినీ లెక్క చెయ్యకుండా ఇష్టంవచ్చినట్లు ఉండగలుగుతోంది...వద్దు! అక్కడికి నువ్వు వెళ్ళకు..."

"నాకు వెళ్ళాలని ఉంది. అసలు కారణం చెప్పెయ్యనా?"

విజయ్ తెల్లబోయాడు-

"అసలు కారణం ఏమిటి?

"మొదటినుంచీ విలసిత తన బడాయి చూపిస్తోంటే నేను చిన్నపుచ్చుకో వలసి వచ్చేది-అందంలో ఆవిడముందు నేను నిలవలేను-ఐశ్వర్యం సరేసరి! ఆవిడ మాటతీరు, చమత్కారమూ-అవన్నీ నాకు చచ్చినా రావు...కానీ— ఆ రోజు-నీతో కలిసి, నీ పక్కన నుంచున్నప్పుడు...విలసితకంటె నేనెంతో గొప్పదాన్నయిపోయిన ట్లనిపించింది. విలసితకన్నీ ఉన్నా, నా అదృష్టం ఆవిడకు రాదనిపించింది...అలాగే మళ్ళీ నీతోకలిసి ఆవిడ ముందుకు వెళ్ళాలని ఉంది..."

విస్తుపోయి లతను చూసి పక పకా నవ్వాడు విజయ్...లత చాలా సిగ్గు పడింది..."పో! ఇలా అయితే నా మనసులో ఆలోచనలు బయటపెట్టను!" అంది.

"అది కాదు—నువ్వు చెప్పేవన్నీ నీ మనసులో ఆలోచనలు! ఆవిడకు నువ్వు ఎవరితో ఉంటేనేం? నాలాటి సామాన్యుడి పక్కన ఉండటంకన్నా ఇప్పుడావిడ సెలెక్ట్ చేసుకున్న మహానుభావుడి పక్కన ఉండటమే ఆవిడకు గొప్ప కావచ్చుగా!"

"ఏమో! అదంతా నాకు తెలియదు నీ పక్కన ఉన్నప్పుడు ఈ మహా విశ్వా నికంతా అధినేత అయిన ఆ దేవ దేవుడికంటె కూడా నేనే గొప్పదాన్నని పిస్తుంది. అలా విలసిత ముందు నిలవాలనిపిస్తుంది..."

విలసితను కలుసుకోవటం ఏమాత్రం ఇష్టంలేదు విజయ్‌కి. అయినా లత మాట కాదనలేకపోయాడు.

పాపనుకూడా అందంగా అలంకరించి తనతో పార్టీకి తీసుకొచ్చింది లత... విలసిత మెరిసిపోతోంది-జరీవర్కు చేసిన నీలంరంగు ఫారిన్ నైలెక్స్‌చీర పచ్చని




పసిమి ఛాయమీద మరింత మెరుస్తోంది. ఆ చీరలో ఆ శరీరఛాయ మరింత అందంగా కనిపిస్తోంది. ప్రత్యేకించి మేకప్ చేసేవాళ్ళను పిలిపించుకొని అతి జాగ్రత్తగా చేసుకున్న అలంకరణ...ఖరీదైన నగలు...అక్కడున్న ప్రతి ఒక్కరి చూపులూ విలసితమీదే ఉండటం గమనించింది లత...అప్రయత్నంగా లత చూపులు అక్కడున్న మరొక యువకుడి మీద పడ్డాయి. జబ్బుపడి లేచినట్లుగా ఉన్నాడు. ఎక్కడో చూసినట్లుగా తోచి ఆలోచించగా వేణు అని గుర్తుకొచ్చింది-ఎంత మారిపోయాడు! ఈ విలసిత ఇదే వేణు పక్కన నించుని ఇలాటి పార్టీయే ఇచ్చి ఇంకా ఆరునెలలు కాలేదు. విలసిత ఈ పార్టీకి వేణుని కూడా పిలిచిందా? వేణు వచ్చాడు! ఎలా రాగలిగాడు? ఎందుకొచ్చాడు? మండుతోన్న కళ్లతో విలసితనే చూస్తున్నాడు వేణు—అటు చూడటానికి భయంవేసి తల తిప్పుకుంది లత.

తల ఒకవైపుకు వంచి విలాసంగా నవ్వుతూ ఎవరితోనో మాట్లాడుతోన్న విలసిత విజయ్‌ని చూడగానే మాట్లాడుతున్నది మధ్యలోనే ఆపి ఆ శ్రోతని

విశ్రాంతిలో వదిలి "విజయ్!" అంటూ వచ్చేసింది...విలసిత పక్కన నిలబడ్డ విలసితకు భర్తలాటి వ్యక్తి వచ్చినట్లు విలసిత వెనకాలే వచ్చాడు...

"నువ్వు వచ్చినందుకు చాలా సంతోషంగా ఉంది విజయ్! నాకు తెలుసు, నువ్వు వస్తావని..."

తన పక్కనే ఫుల్ సూట్‌లో నిలబడ్డ తన సరి కొత్తభర్తను సంపూర్తిగా మరిచిపోయి సంబరంగా అంది విలసిత...

"నేను రావాలనుకోలేదు-లత బలవంతంచేస్తే వచ్చాను. నిన్ను మళ్ళీ మళ్ళీ పెళ్ళికూతురిగా చూడాలని ఉబలాటపడింది లత..."

అప్పుడు విలసిత చూపులు లతవైపు తిరిగాయి. వెనుకటిలా లత వణికి పోవటంలేదు. విలసిత ముఖంలోకి చూసి నవ్వింది...

"ఓ!" అంది విలసిత-అంతలో ఆవిడ చూపులు పాపమీద పడ్డాయి-

"అదేమిటి? అప్పుడే పాపకూడానా? పాపను సాక్షిగా పెట్టుకుని పెళ్ళి చేసుకుంటారా?"

విరగబడి నవ్వింది-అక్కడున్న వాళ్ళలో చాలామంది ఈ మాటలు విని, వాళ్ళూ నవ్వారు. లత ముఖం అవమానంతో కందిపోయింది-విజయ్ మాత్రం పకాలున నవ్వాడు...

"పెళ్ళి చేసుకుని నెల తిరక్కుండా ఒకరినొకరు వదులుకునే వారున్నారు. పెళ్ళి కాకపోయినా మాట అనుకున్నంత మాత్రాన మనసు మార్చుకోలేనివారూ ఉన్నారు. ఈ పెళ్ళికి విలువేమిటి? నేనూ లతా ఎప్పుడు పెళ్ళి చేసుకున్నా పరవాలేదు-అసలు పెళ్ళి చేసుకోకపోయినా పరవాలేదు."

మొదట విలసిత మాటలకు నవ్విన వాళ్ళందరు విజయ్ మాటలకు కూడా నవ్వారు. లత తల పైకెత్త గలిగింది-అంతటితో విలసిత ఊరుకోలేదు.

"అదెలా కుదురుతుంది విజయ్. పెళ్ళి అన్నాక పెళ్ళే! పెళ్ళి కాకుండా పిల్లల్ని కంటే తల్లి పాపం పిల్లలు అనుభవించాలి!"

పాప వెంటనే రామచిలకలా వల్లించింది.

"లోకంలో పాపం, పుణ్యం అనేవి లేవు-సుఖమూ, దుఃఖమూ రెండే ఉన్నాయి. సుఖపడటం చేతకానివాళ్ళు దుఃఖపడతారు."

నిర్ఘాంతపోయింది విలసిత. పాపవంక చూస్తూ అలా నిలబడిపోయింది కొన్ని క్షణాలు-అంతలో గిర్రున తిరిగి వెళ్ళిపోయింది...

ఇంటికొచ్చిన తరువాత ''పార్టీ బాగుందా?'' అన్నాడు విజయ్, పరిహాసంగా నవ్వుతూ...

లత ఏదో ఆలోచిస్తున్నట్లుగా ''నువ్వు విలసితను గమనించావా విజయ్? ఆవిడ నవ్వుతూ, తుళ్లుతూ ఉంది నిజమే! కానీ నీ దగ్గిరకి రాగానే ఆ నవ్వంతా ఎగిరిపోయి ఏదో దుర్భర విషాదం కనిపించింది ఆ ముఖంలో...అంతేకాదు- అంతకుముందు ఆ నవ్వుల్లో కనిపించని జీవమేదో ఈ విషాదంలోనే కనిపించింది-నా కేమనిపించిందో తెలుసా? అంతవరకూ ఆవిడ తన భావాలకేదో ముసుగు వేసుకుని తిరుగుతున్నట్లూ...నీ ముందు ఆ ముసుగు జారిపోయి నట్లూ..." అని లత ఇంకా ఏదో చెప్పబోతుండగానే అందుకున్నాడు విజయ్...

''ప్లీజ్ లతా! ఇంక ఆ విషయాలు ఎత్తకు-విలసిత ప్రస్తావన అసలు తేకు-గుడ్ బై!"

అకస్మాత్తుగా అలా వెళ్లిపోతున్న విజయ్‌ని చూస్తూ ఏదీ అర్థంకాక అయోమయంలో పడిపోయింది లత.

* * *

పాపకు బట్టలు బొత్తిగా లేవు—గౌనులు కొనడానికి బజారు కెళ్ళింది లత... సుందరమ్మకి పాపను చూసినకొద్దీ చిరాగ్గా ఉంది. ఆవిడకి ముగ్గురు పిల్లలు-చిన్న పిల్లలమీద పెద్ద వ్యామోహమేమీ లేదు ఆవిడకి. అదీగాక ఆవిడ పూర్వ కాలం మనిషి-అనాథ శరణాలయంనుండి వచ్చిన పాపమీద ఆవిడకేదో నిరసన భావం-వంటగదిలో ఉన్న పంచదార డబ్బా తీసుకురమ్మంది పాపని. పాప డబ్బా తీసుకొస్తూ చాల్య బాపల్యంకొద్దీ కాస్త పంచదార నోట్లో వేసుకుంది. అది చూసి సుందరమ్మ మండిపోయింది-

"ఛీ! ఛీ! ముదనష్టపుదానా! మొత్తం డబ్బా ఎంగిలిచేస్తావా? ఏ అమ్మ కని పారేసిందో? పాడుబుద్ధులుకాక మంచిబుద్ధు లెలావస్తాయ్!'' అని కసిరింది—

లత సరిగ్గా ఆ సమయానికి వచ్చింది. తల్లి మాటలు విని నిర్ఘాంతపోయింది- అయోమయంగా నిలబడిపోయి తన తల్లిని చూస్తోన్న పాపను రెండు చేతులూ జాపి దగ్గిరకు తీసుకుంది.

"ఏమిటమ్మా ఇది? మతిపోయిందా? పసిపిల్లతో అంత దారుణంగా మాట్లాడ తావా?" అంది.

లతను చూడగానే సుందరమ్మ గతుక్కుమంది. కొంచెం సిగ్గుపడింది- అయినా తనది తప్పని ఒప్పుకోలేకపోయింది.

"చిన్న పిల్లలు తప్పుచేస్తే తిట్టరూ? అది దారుణమా?"

"ఇలాటి తిట్లు తిట్టకూడదు-చేతనైతే అలా పంచదార ఎంగిలి చెయ్యకూడదని నెమ్మదిగా చెప్పు-అంత సహనం లేకపోతే చాచి ఒక లెంపకాయ కొట్టు!"

"నేనెందుకు కొడతానే! అంత రాక్షసినా?"

"ఇప్పుడు నువ్విలా మాట్లాడటం, కొట్టడంకంటె రాక్షసత్వం! ఎటొచ్చీ ఆ సంగతి నీకు తెలియటంలేదు."

లతతో వాదించలేక సుందరమ్మ ముఖం ముడుచుకుని తనలో తను ఏదో సణుక్కుంది. అదేమీ లక్ష్యపెట్టలేదు లత. తను తెచ్చిన గౌనులు పాపకి చూపించింది. ఆ గౌనులు చాలా అందమైనవి—అవి చూసి పాప ఎంతో మురిసిపోతుందనుకుంది—పాప గౌనులన్నీ చూసి ఆశ్చర్యంగా "ఇవి నాకా?" అంది

ఆ ఆశ్చర్యానికి ఆశ్చర్యపోతూ "అవును! నీ కోసమే కొన్నాను-" అంది లత...

పాప ఆ గౌనులు చేత్తో పక్కకునెట్టి "నేనూ ఇలాంటివి కట్టుకోకూడదు!" అంది.

"ఏం?"

"ఇంత మంచి మంచి బట్టలు కట్టుకుంటే నేను మా అమ్మలా పాడయిపోతాను. మామూలు బట్టలు కట్టుకుని మామూలుగా ఉంటే మంచి దాన్నవుతాను!"

నిర్ఘాంతపోయింది లత-ఈ పసికూన ఎక్కడ పెరిగిందో-అక్కడివాళ్లు ఎలాంటి రాక్షసులో? మెరుపులా తన తల్లిమాటలు గుర్తుకొచ్చాయి లతకు. వాళ్ళను అనవలసిన అవసరం లేదేమో! ఈ రకమయిన క్రౌర్యం తరతమ భేదాలతో మానవు లందరిలోనూ దాగిఉందేమో! ఎదుటివాళ్లను చిన్నపుచ్చి తమ ఆధిక్యం నిరూపించుకోగలిగే అవకాశాన్ని ఎవరూ వదులుకోలేరేమో!

పాప "ఆకలి" అని దీనంగా అంటున్నప్పటికంటె ఎక్కువ జాలి కలిగింది ఆ సమయంలో.

"గౌనులతో మనుష్యులు పాడవరు పాపా! పాడుమాటలు వింటే పాడవుతారు. కట్టుకో!"

లత మాటలు పాప కెప్పుడూ అర్థంకావు. కానీ లత ముఖంలో పాపకు కనిపించే భావమేదో పాపను లతకు దగ్గిరచేసింది.




ఇంటర్ పరీక్ష లవుతున్నాయి. విమల, లత, ఇన్విజిలేటర్స్‌గా ఉన్నారు. విమల స్వభావం మొదటినుండీ కచ్చితమైనదే! హాలులో ఎవ్వరినీ కాపీలు కొట్టుకోనియ్యటంలేదు. విద్యార్థినులలో చాలామంది లోలోపల విమలను తిట్టుకుంటున్నారు. లతకు కాపీలు కొట్టనియ్యటం ఇష్టం లేకపోయినా అంతగా పట్టించుకోదు. కానీ విమలకు భయపడి లతకూడా స్ట్రిక్ట్‌గానే ఉంది.

గుండ్రంగా - అడ్డంగా పెరిగిన మహాకాయంమీద అతి పలచని షిఫాన్‌చీర జర్రున జారిపోతుండగా - తాంబూలం నములుతోన్న ఎఱ్ఱని నోటిలో ఎఱ్ఱని పళ్ళు బయటపెడుతూ నవ్వి "ఎక్స్క్యూజ్ మి!" అంటూ వచ్చింది రాణి

విమల ప్రశ్నార్థకంగా చూసింది. లత పలకరింపుగా చిరునవ్వునవ్వి హడావిడిగా చేతులు జోడించింది. ఆ నమస్కారాన్ని సవిలాసంగా స్వీకరించి విమల చూపులను లక్ష్యపెట్టకుండా తిన్నగా పరీక్ష రాస్తోన్న ఒక అమ్మాయి దగ్గిరకు నడిచి తన చేతిలో కాగితాలు ఆ అమ్మాయి కందించింది రాణి. హాలులో ఉన్న విద్యార్థిను లందరికళ్లూ ఆ అమ్మాయిని ఈర్ష్యగా చూసాయి. "ఏమిటది?" అంటూ వచ్చింది విమల. రాణి నిటారుగా నిల్చుని పొగరుగా నవ్వింది

"గట్టిగా మాట్లాడకండి! ఎగ్జామినేషన్ హాల్లో ఇలా గట్టిగా మాట్లాడితే బాగుండదు!" అంది.

నిర్ఘాంతపోయింది విమల! బహిరంగంగా కానిపనిచేస్తూ ఎదురు తనకే నీతులు చెప్తోంది!

"ఏది బాగుంటుందో, ఏది బాగుండదో నాకు తెలుసు. ముందు మీ రా పేపర్స్ మర్యాదగా తీసికెళ్ళిపొండి!''

"ఊరుకోండి! మాధవి ఎంతో తెలివైన పిల్ల. పరీక్షలముందు జ్వరపడింది. అందుకని ఏదో సాయం చేస్తున్నాను. ఇంతకూ ఈ అమ్మాయి ఎవరో తెలుసా? మా అన్న కూతురు!"

పరీక్ష రాస్తోన్న మాధవి అనే విద్యార్థిని తల పైకెత్తి విమలవంక గర్వంగా చూసి రాణి అందించిన పేపర్లు దర్జాగా బల్లమీదే పెట్టుకుని కాపీ చెయ్యసాగింది.

ఆ కాగితాలు లాగేసుకుంది విమల.

"నేను ఇన్విజిలేట్ చేస్తుండగా ఇలాంటివి సాగనివ్వను!" మొండిగా అంది.

రాణికి పట్టరాని కోపమొచ్చింది. అయినా అణచుకుంది. రాణీకి కోపం రావటమూ అణచుకోవటమూ సాధారణంగా జరగదు.

"ప్లీజ్! మేడమ్! ఈ ఒక్కసారికీ మీరు నా మాట వినాలి!" అంది ప్రాధేయపడుతున్నట్లు.

"ఈ పేపర్లు సైక్లోస్టయిల్ చేయించి హాల్లో అందరికీ పంచిపెట్టండి. అప్పుడు నా అభ్యంతరంలేదు."

"అందరికీ అందించేవరకూ నాకేం పట్టింది!"

"చదువుకోని అమ్మాయి దర్జాగా దొంగతనంగా మార్కులు తెచ్చుకుని, నిజంగా చదువుకున్న అమ్మాయిలు నష్టపోకుండా చూడటంమాత్రం నాకు పట్టింది!''

"మిస్, విమలా! మీరు ఎవరితో మాట్లాడుతున్నారో తెలుసునా?"

"ఎందుకు తెలియదూ? నేనీ కాలేజీలో చేరి ఆరునెలలయింది."

పరీక్ష రాస్తోన్న విద్యార్థినుల్లో చాలామంది ముసిముసిగా నవ్వారు. కొందరు పైకే నవ్వేసారు. రాణి మనసు భగ్గునమండి - ఆ మంట ముఖంలో కనిపించింది. విసురుగా వెళ్ళిపోయింది. లత కంగారుగా "ఆ కొరివి దెయ్యం ఏంచేస్తుందో విమలా!'' అంది.

విమల నిర్లక్ష్యంగా నవ్వి "ఏం కావాలంటే అది చేసుకోమను!" అంది.

మరొక్కనెల దాటకుండానే విమలకు ట్రాన్స్ఫర్ ఆర్డర్స్ వచ్చాయి. విమలను టెంపరరీగా వేసుకున్నారు. విమల టీచింగ్ సంతృప్తికరంగా లేదు. ఆ కారణంగా ట్రాన్స్ఫర్.

విమల ఆ ఆర్డర్ తీసుకుని ప్రిన్సిపల్ దగ్గిరకి వెళ్ళింది. విమలను చూడగానే ఆవిడ ముఖం పాలిపోయింది. ఏదో గొణుగుతున్నట్లుగా "అయామ్ సారీ! కానీ నా చేతుల్లో ఏంలేదు!" అంది.

"నా ఉద్యోగంకోసం అడగటానికి రాలేదు మేడమ్! ఒక విషయం తెలుసుకుందామని వచ్చాను. నా టీచింగ్ సరిగా లేదని ఎలా తెలుసుకున్నారు? స్టూడెంట్స్ కంప్లెయిన్ చేసారా?"

ప్రిన్సిపల్‌కు విమలమీద ఎలాంటి కోపమూలేదు. మంచి లెక్చరర్ అనే గౌరవభావమూ ఉంది. నర్వస్‌గా నవ్వుతూ "నేను నిస్సహాయురాలిని! మేనేజ్‌మెంట్ ఆర్డర్స్..." అంది.

"నా టీచింగ్ గురించి ఇక్కడి స్టూడెంట్స్‌కంటే, మీకంటే మేనేజ్‌మెంట్ వాళ్లకి బాగా తెలిసిందన్నమాట!"

ప్రిన్సిపల్ సమాధానం చెప్పలేదు. గంభీరంగా ఊరుకుంది. ఆ మాత్రం మాట్లాడటమే అసాధారణం.

విమల ఎంత ఇబ్బందులలో ఉందో, ఉద్యోగం విమల కెంత అవసరమో లతకు బాగా తెలుసు. విమల ఉద్యోగం పోయినందుకు బాధపడుతూ "నేను చెప్తే విన్నావా? తిని కూచుని తెచ్చుకున్నావు" అంది.

అసలే చికాగ్గాఉన్న విమల "నీ కెందుకు బాధ! నిన్ను ఉద్యోగం చూడమనటం లేదుగా!" అని కసిరింది.

విమల అలా కసిరినందుకు లత బాధపడలేదు. ఆ చికాకు వెనుకఉన్న ఆర్థికమైన ఇబ్బందులు అర్థంచేసుకుని బాధపడింది

విజయ్‌ని కలుసుకున్నప్పుడు "విజయ్! పాపం, విమలకి ఉద్యోగం పోయింది. నువ్వు వెంటనే మరొక ఉద్యోగం చూసిపెట్టాలి!" అంది వెంటనే నొక్కి పలుకుతూ.

విజయ్ నవ్వుతూ "అలాగే! ఉద్యోగాలు నా రెండు జేబులనిండా ఉన్నాయి. వెతుక్కుని నీకు కావలసినది తీసుకో?" అన్నాడు.

"వేళాకోళంకాదు. నిజంగా చెప్తున్నా!"

"అయితే నేనూ నిజంగానే చెప్తున్నాను. ఉద్యోగాలు నిలబడ్డపాటున రావు. ప్రయత్నిస్తాను."

అప్పటినుండి లత రోజూ విమల ఉద్యోగం విషయంలో విజయ్ ప్రాణాలు తీస్తోనేఉంది. "అలాగే! ప్రయత్నిస్తున్నాను" అనేవాడు విజయ్.

విమల సంతోషంగా "గుడ్‌న్యూస్! నాకు ఉద్యోగం దొరికింది!" అనగానే విమలకంటే ఎక్కువగా సంబరపడిపోతూ "నిజంగానా! అబ్బ! ఎంత రిలీఫ్!"

అంది లత. విమల పకపక నవ్వుతూ నాకంటే ఎక్కువగా నువ్వే రిలీఫ్ పొందినట్లుగా కనిపిస్తున్నావు. నా వంతూ నీ వంతూ నువ్వే వరీ అయ్యావు" అంది.

"అవును. నిజమే! నాకీ మధ్య సమంగా నిద్రకూడా పట్టటంలేదు. ఇంతకూ ఏం ఉద్యోగం? ఎక్కడ?"

"ఆలిండియా రేడియోలో! అనౌన్సర్‌గా? అన్నట్లు మీ విజయ్‌కూడా అక్కడే పనిచేస్తున్నారుకదూ! నాకు మంచి కంపెనీ! ఆయన చాలా సరదాగా మాట్లాడతారు."

లత ముఖంలో నవ్వు ఎగిరిపోయింది. విమల ఏం మాట్లాడుతోందో వినపడటంలేదు విమల మధ్యలో లత ముఖంచూసి "ఏమిటిది? ఎందుకిలా అయిపోయావ్?" అంది.

లత పేలవంగా నవ్వుతూ "ఎలా అయిపోయానూ?" అంటూ మామూలుగా నవ్వటానికి ప్రయత్నించింది.

"ఏదో షాక్ తిన్నదానిలా అయిపోయావు-కొంపదీసి మీ విజయ్‌కుమార్ గారితో మళ్ళీ ఘర్షణపడలేదుకదా! నిన్నిలా తలక్రిందులు చేయగలిగిన విషయం అదొక్కటే!

"అ హ హ! అదేంలేదు—"

వెళ్ళి రెస్టు తీసుకో! నీ ముఖం చూస్తుంటే నాకే ఎలాగో ఉంది. ఏమీ లేదంటే నేను నమ్మమన్నా నమ్మను-సరేలే! నాకు చెప్పకుండా ఎన్నాళ్లు దాచగలవు?"

లత సిగ్గుపడిపోయింది. వంచిన తల ఎత్తలేకపోయింది.

విజయ్‌ని కలుసుకున్నప్పుడు "కంగ్రాట్యులేషన్స్!" అంది లత.

"థేంక్స్! అందరూ కంగ్రాచ్యులేట్ చేసారు. నువ్వు చెయ్యలేదనే ఎదురు చూస్తున్నాను—"

"అందరూ కంగ్రాట్యులేట్ చేసారా?"

"చెయ్యరా మరి! నీ విజయ్ అంటే ఏమనుకున్నావ్? మొన్న కచేరీలో నేను అద్భుతంగా పాడలేదూ?"

"అదా?"

"అంత నీరసంగా అంటున్నావ్? నీ కంగ్రాట్యులేషన్స్ దేనికి దేవీ!"

"నీ ప్రయత్నం ఫలించి విమలకు కూడా మీ రేడియోస్టేషన్‌లోనే ఉద్యోగం దొరికినందుకు......"

"నా ప్రయత్నం—" ఆగిపోయాడు విజయ్-లత పోరు పడలేక విమల




ఉద్యోగం విషయంలో ప్రయత్నిస్తాననే మాడే తప్ప తీరికలేక ఆ విషయం వెంటనే మరిచిపోయేవాడు. లత చెప్పేవరకూ విమలకు రేడియోలో ఉద్యోగం దొరికిన సంగతి కూడా తెలియదు.

''హేపీ న్యూస్! ఇంక నువ్వు స్థిమితపడినట్లేగా! దేవిగారి ఆజ్ఞ దాటగలడా ఈ దాసుడు!"

తన ప్రయత్నం ఏమీ లేదని ఒప్పుకోలేక నోటికొచ్చింది మాట్లాడేసాడు విజయ్

లత ఏమీ మాట్లాడలేదు. లత ముఖంలోకి పరిశీలనగా చూస్తూ ''అలా వున్నావేం?" అన్నాడు కొంచెం ఆందోళనగా.

"ఎలా వున్నాను?"

''జబ్బుపడి లేచినట్లు—కాదు జబ్బుతో తీసుకుంటున్నట్లు..."

"ఒక విషయం నీతో ఎలా చెప్పాలా అని ఆలోచిస్తున్నాను..."

"నాకు భయంగా ఉంది త్వరగా చెప్పెయ్యి."

''నాకు పాప రహస్యం తెలిసిపోయింది—"

విజయ్ వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి.

''లతా...'' అన్నాడు.

"అవును విజయ్! పాప విమల కూతురు......"

"వాట్......"

పిచ్చెక్కినవాడిలా తనను చూస్తోన్న విజయ్ చూపులు తప్పించుకుంటూ ఎటో చూస్తూ చెప్పుకుపోసాగింది లత!

"అవును, విమల కూతురు. విమల చంద్రశేఖరం అనే యువకుణ్ని ప్రేమించింది. ఆ ప్రేమ ఫలమే ఈ పాప—చంద్రశేఖరం ఒక ప్రూఫ్‌రీడర్! అలాటి వాణ్ని పెళ్ళి చేసుకోవటం విమల కిష్టంలేదు. అందుకని పాపను అనాధబాలికను చేసేసి......"

ఆగిపోయింది లత...విజయ్ ఎలాంటి ప్రశ్నలూ వెయ్యలేదు. స్థాణువులా కూచుండిపోయిన విజయ్‌ని చూస్తూ "విజయ్..." అంది లత

"ఛ! ఛ! ఇంత దారుణమా?" అదోకమాదిరి స్వరంతో అన్నాడు విజయ్. లత మాట్లాడలేదు.

"విమలను తలుచుకుంటేనే అసహ్యం వేస్తుంది. ఆవిడ ముఖంకూడా చూడలేను..."

"వద్దు విజయ్! అలా మాట్లాడకు! నేను భరించలేను—బలహీనతలు అందరికీ ఉంటాయి. నువ్వు క్షమించాలి!"

లత కళ్ళలో తిరుగుతోన్న నీళ్ళు చూసి ఒక్క నిట్టూర్పు వదిలాడు విజయ్!

* * *

నీరసంగా మంచంమీద పడుకునిఉంది లత. సుందరమ్మ వచ్చి "విజయ్ నీ కోసం వచ్చాడు" అని చెప్పగానే లేచి రాబోయింది అంతలో విజయ్ తనే లోపలకి వచ్చాడు. మంచంమీదే దిండు నానుకుని కూర్చుని విజయ్‌నిచూసి నవ్వింది లత ఆ ప్రక్కనే కుర్చీ లాక్కుని కూచున్నాడు విజయ్ లత ముఖంలోకి పరిశీలనగా చూస్తూ "ఈ మధ్య మా ఇంటికి రావటంలేదేం?" అన్నాడు.

అతని చూపులు తప్పించుకుంటూ "ఏదో ఒక పని! తీరుబడి ఉండటం లేదు!" అంది.

"అలాగా! ఆ బడలిక అంతా నీ ముఖంలో తెలుస్తోందిలే! ముఖం ఎంత పీక్కుపోయిందో, ఒకసారి అద్దంలో చూసుకో! అసలు నిద్రపోతున్నావా? ఆ కళ్ళు చూస్తే అసలు కునుకుపట్టనట్లుగా ఉన్నాయి"

"పట్టకేం? సుఖంగా నిద్రపోతున్నాను. అంతకంటే సుఖంగా కలలు కంటున్నాను. మొన్న ఎంత తమాషా కల వచ్చిందో తెలుసా? నువ్వూ, విమలా రేడియో స్టేషన్‌లో కూచుని ఏదేదో సరదాగా కబుర్లు చెప్పుకుని నవ్వుకుంటు

న్నట్లు... మెలకువ వచ్చాకకూడా చాలాసేపు ఆ కలని తలచుకుని తలచుకుని నవ్వుకున్నాను."

మళ్ళీ నవ్వింది లత. ఆ నవ్వుచూస్తూ కొన్ని క్షణాలు కూచున్న విజయ్ లత దగ్గరకు వచ్చాడు. విజయ్‌తన జేబులోంచి ఒక ఉత్తరంతీసి లత చేతిలో పెట్టాడు.

"ఏమిటిది?"

"నా ఉద్యోగానికి రాజీనామా ఇస్తూ నేను రాసిన ఉత్తరానికి కాపీ..."

ఉలికిపడింది లత.

"అంత మంచి ఉద్యోగం! రాజీనామా ఇయ్యమని నేను అన్నానా...?"

"నువ్వంటే నేను ఇస్తానా? అంత మంచిది కాకపోయినా మరొక ఉద్యోగం దొరికిందిలే! గవర్నమెంట్ ఫరమ్‌లోనే మేనేజర్‌గా పని చెయ్యబోతున్నాను. అక్కడ నాకు తెలిసిన ఫ్రెండు ఒకడున్నాడు. అతనిద్వారా ఆ ఉద్యోగం దొరుకుతుంది..."

"వద్దు విజయ్! నువ్వు రాజీనామా ఇవ్వద్దు!"

"ఇచ్చేసాను. రిలీవింగ్ ఆర్డర్స్‌కోసం ఎదురుచూస్తున్నాను .." అని లత ముఖంలోకిచూసి నవ్వి "ఇంక ముందు నీకు 'సుఖమైన కలలు' రావులే! అంచేత సుఖంగా నిద్రపోగలవు!" అన్నాడు.

లత ముఖం ఎర్రబడిపోయింది తన ముఖం విజయ్‌కి చూపించలేనిదానిలా దిండులో దాచుకుంది. విజయ్ ఆ ముఖాన్ని తనచేతుల్లోకి తీసుకుని "అంతగా దాక్కోవలసిన పనిలేదు. ఇందులో సిగ్గుపడవలసిందేమీలేదు. కలలు అందరికీ వస్తాయి ఎవరి కలలు వాళ్ళవి..." అన్నాడు.

లత ముఖంలో బడలిక చేత్తో తీసినట్లు మాయమయింది కళ్ళు మెరుస్తున్నాయి.

"విజయ్! నీ మేలుకోరి నీ కొక సలహా చెప్పనా?"

"చెప్పు!"

"నువ్వు నన్ను పెళ్ళిచేసుకోకు!"

"ఎందుకూ?"

"నేను చాలా పెద్దదానిని!"

"అవును!"

"అంతే? నువ్వు నిజంగా నన్ను పెళ్ళిచేసుకోవా?"

పకపక నవ్వాడు విజయ్.

"నువ్వు చాలా పెద్దదానివి—కానీ ఆ పెద్దతనమంటేనే నాకిష్టం!"

హాయిగా నవ్వింది లత.

విజయ్ రాజీనామా ఇచ్చినట్లు తెలిసి నివ్వెరపోయింది విమల.

"లతా! నువ్వయినా చెప్పకపోయావా? అంత మంచి ఉద్యోగానికి ఎందుకు రాజీనామా ఇస్తున్నట్లు?" అంది.

లత తడబడింది.

"ఏమో! నాకేం తెలీదు!"

"భలేదానివే! ఇంకా రిలీవింగ్ ఆర్డర్స్ రాలేదుగా! రాజీనామా వెనక్కు తీసుకోమని చెప్పు!"

"చెప్పాను. నేను ఎంత చెప్పినా వినలేదు!"

"ఎందుకు వినడూ? ఉండు. నేను చెప్పిచూస్తాను."

లత నవ్వి "ఆ పని చెయ్యి. నీకు పుణ్యం ఉంటుంది" అంది

అనుకున్న పని చేసి తీరుతుంది విమల విజయ్‌తో మాట్లాడాక దాని ఫలిత మేమిటో తెలుసుకోవాలని, లతకు చాలా ఆరాటంగా ఉంది విమలనే అడిగేసింది.

"ఏమన్నాడు విజయ్?"

విమల ఒక్కసారి లత ముఖంలోకిచూసి చటుక్కున తల తిప్పుకుంది.

ఆ కళ్ళలో అంత బాధ లత ఎన్నడూ చూడలేదు. మనసుకేదో భరింపరాని వ్యధ కలిగినప్పుడుకాని ఆ కళ్ళలో అంత బాధ కనిపించదు. ఆ తల తిప్పు కోవటంలో అంత తిరస్కారం. అదికూడా ఇదివర కెన్నడూ చూడలేదు.

"ఏమన్నాడు విజయ్?" మళ్ళీ అడిగింది లత.

విమల అదోకరకంగా నవ్వి "ఏమంటాడు? తను రాజీనామా ఇచ్చితీరా లన్నాడు" అంది.

"నువ్వు బాధపడుతున్నావా?

"అవును! చాలా బాధపడుతున్నాను. విజయ్ రాజీనామా ఇచ్చినందుకు కాదు నన్ను క్షమించు లతా? ఇప్పుడు నీతో నేనేం మాట్లాడలేను!"

దెబ్బతిన్నట్లయి వెంటనే ఇంటికొచ్చేసింది లత. విజయ్ రాజీనామా ఇయ్య నంటే విమల ఎందుకంతగా బాధపడాలి? విజయ్‌తో కలిసి పనిచేసే అవకాశం పోయినందుకా? విజయ్ తన మాట కాదన్నందుకా? రెండింటిలో ఏది కారణ మయినా, విమల బాధపడటం అన్యాయమేకదూ! అయినా ఎందుకో చిత్రంగా






విమల అలా బాధపడుతూంటే చూడలేకపోతోంది అలా విమల బాధపడటానికి తన బాధ్యత ఏదో ఉందనిపిస్తోంది. ఎలాగైనా విమలను ఓదార్చాలని ఉంది. కానీ, విమల తననే వెళ్ళిపొమ్మంది.

విమలను చూసుకోవటానికి పెళ్ళివారొస్తున్నారు. లతకుకూడా కబురు చేసింది సుగుణ. సంతోషంతో వెళ్ళింది లత—విమలకోసం పువ్వులుకూడా తీసి కెళ్ళింది.

విమల ఆ పూలు పెట్టుకోలేదు "పగటివేళ పూలు పెట్టుకోవటం నాకు ఇష్టం ఉండదు. సువాసన ఇచ్చేపూలు సాయంత్రం పెట్టుకుంటాను" అంది.

ఆ పెళ్ళికొడుకు సుగుణకు అన్నివిధాలా నచ్చాడు యమ్. టెక్. పాస య్యాడు మంచి ఉద్యోగమూ ఉంది. రూపవంతుడనే చెప్పుకోవాలి. ఈ రోజుల్లో ఇలాంటి సంబంధం కట్నంలేకుండా దొరకడం అదృష్టమనే అనుకోవాలి! ఆ మాటే అంది లత.

"నువ్వు చాలా అదృష్టవంతురాలివి విమలా!"

"ఎందుకు?"

"సంబంధం మంచిది!"

"చేసుకోమంటావా?"

"త్వరగా చేసుకో!"

"త్వరగా దేనికి?"

"తొందరగా పెళ్ళయిపోతేనే మంచిదికదూ!"

"ఎవరికి?"

"ఏమిటి విమలా! నీకు పెళ్ళయితే ఎవరికి మంచిది? పోనీలే! నాకే మంచిది. అవును! నీకు పెళ్ళయి నువ్వు సుఖంగా ఉండాలని నేనే కోరుకుంటున్నాను. అది తప్పా?"

"ఒకవేళ ఈ పెళ్ళి కాకపోవటమే నాకు సుఖమయితే?"

లత ముఖం పాలిపోయింది. విమల లత భుజాలమీద చేతులువేసి "పిచ్చి లతా!" అని నవ్వింది.

పాప లతకి బాగా చేరిక అయింది. "విజయ్ మాత్రం పాపను చీదరించుకునేవాడు. అది సహించలేకపోయింది లత. 'విజయ్ ఎవరో చేసిన తప్పుకి పసిపిల్లని చీదరించుకోకు! అది అన్యాయం!" అంది. లత మాట కాదనలేక పాపను దగ్గరకు తీసుకునేవాడు విజయ్...

ఆ రోజు లత వచ్చేసరికి విమల ఇల్లు మార్చే సన్నాహంలో ఉంది. ఇల్లు మార్చే కారణం చెప్పింది విమల

"అదేమిటి? ఇల్లెందుకు మారుస్తున్నావ్?"

"ఇలా రా! చెపుతాను!"

లత చెయ్యిపట్టుకుని సుగుణకు దూరంగా లోపలి గదిలోకి తీసికెళ్ళి, బాధపడుతూ చెప్పింది విమల.

"ఎలా వ్యాపించిందో ఏమో, పాప నా కూతురని వార్త వ్యాపించింది. ఈ రహస్యం కప్పిపెట్టడానికే నీ దగ్గర ఉంచానట! నన్ను చూడగానే ఈ ఇంట్లో అన్ని పోర్షన్ల అమ్మలక్కలూ గుసగుస లాడుకుంటున్నారు. మరి కొందరు పోయేదాన్ని అపుచేసి ముఖంమీదే రకరకాల ప్రశ్నలు అడుగుతున్నారు— ఇక్కడ ఉండలేకపోతున్నాను. కాస్త అద్దె ఎక్కువయినా వేరే మరొకచోట తీసుకోవాలనుకుంటున్నాను—నీకు కాస్త దూరమైపోతాను— అయినా ఏంచెయ్యను?"

లతముఖం జీవమంతా నశించినట్లు పాలిపోయింది—ఏమీ మాట్లాడలేకపోయింది.

విజయ్‌ని కలుసుకొన్నప్పుడు "నేను విమలనుగురించి చెప్పింది ఎవరికైనా చెప్పావా?" అంది.

"ఏమో! గుర్తులేదు—అన్నట్లు ఆ మధ్య విమలా వాళ్ళింటి పక్కన ఉన్న వెంకటబావు విమలను "నిప్పులాంటిది, అలాంటిది, ఇలాంటిది..." అని పొగుడుతోంటే వొళ్ళు మండి అసలు నిజం చెప్పేసాను..."

"ఎంతపని చేశావ్ విజయ్!"

"ఏం? నేను లేనిపోని అబద్ధాలు చెప్పానా? ఉన్న విషయం..."
''అయితేమాత్రం నీ కెందుకు ?"
"పనికట్టుకుని చెప్పలేదుగా! సందర్భం వచ్చింది..."
"నీ ఉద్యోగానికి రాజీనామా ఇయ్యొద్దని విమల నీతో చెప్పిందా ?"
''అవును. ఫోన్‌లో చెప్పింది !"
"పర్సనల్‌గా మాట్లాడలేదా ?"
"వస్తానంది. నేనే రావద్దన్నాను !"
"అదేం ?"

"నాకు అబద్ధాలన్నా, మోసమన్నా చాలా చికాకు. అంత నీచంగా సుఖం కోసం మాతృత్వపు మమకారాన్ని కూడా వదిలేసుకున్న ఆవిడను చూస్తే నాకు చాలా అసహ్యం—ఆ దుర్మార్గురాలు...ఆ కఠినురాలు...ఆ నీచురాలు..."

"వద్దు విజయ్! ఇంకేమీ అనకు, ప్లీజ్ ! నేను భరించలేను !"

వెక్కి వెక్కి ఏడ్చేసింది లత. విజయ్ ఎందుకేడుస్తున్నావని అడగలేదు. ఓదార్చే ప్రయత్నమూ చెయ్యలేదు ఉదాసీనంగా చూస్తూ కూచున్నాడు.

* * *

లతతోనూ, పాపతోనూ సరదాగా హోటల్ కెళ్ళాడు విజయ్.

పాప విజయ్‌కి దగ్గిర అవుతోన్నకొద్దీ చాలా ఆనందంగా ఉంది లతకి.

"విజయ్ ! పాపను రెండేళ్ళ తరువాత వాళ్ళ వాళ్ళకి ఇవ్వాలనిలేదు. మనమే పెంచుకుందాం!" అంది.

"ఇంకా నయం ! ఎవరి పాపనో మనం పెంచుకోవలసిన కర్మమేం ? మనకు పుట్టరని ఇప్పటినుండే బెంగగా ఉందా ?"

"పో ! అసికాదు. ఆ పాపను విమలకిచ్చెయ్యి ఆ పాట్లేవో ఆవిడనే పడనియ్యి !"

"ఇయ్యను. ఇదివరకే విమల ఇమ్మని అడిగింది."

''ఎందుకియ్యలేదు?"

"ఇస్తే మళ్ళీ అనాధశరణాలయంలో పడేస్తుందిట! ఆ అనాధశరణాలయంలో పిల్లల్ని ఎలా చూస్తారో తెలుసుకుంటే... అక్కడ ఆ రాక్షసుల మధ్య నా పాపని ఊహించుకుంటే..."

"నీ పాప...?" పకపక నవ్వాడు విజయ్

"అవును, నా పాప! అనాథశరణాలయంలో ఈ పసికందుని పడెయ్యగలిగిన ఆ రాక్షసి కన్నతల్లి కాగలదా? నేను తల్లిని కాకపోయానా?"

"అవును విమల రాక్షసి, పిశాచం, దెయ్యం... అలాంటి దుర్మార్గురాలు..."

"విజయ్! విజయ్! స్టాపిట్, ఇంకేమీ అనకు! విమలను ఒక్కమాట అన్నా నేను భరించలేను."

"నువ్వు అనచ్చుకాని, నేను అనకూడదా?"

"నేనేం అన్నాను?"

"ఆ కన్నతల్లి రాక్షసి అనలేదా?"

"అదా......" తడబడింది లత.

"ఏదో మాటల సందర్భంలో వచ్చేసింది. అంతేకాని నాకు ఎవర్నీ ఏమీ అనాలని లేదు."

"పాపా! నువ్వు లత దగ్గిరుండకు. వెళ్ళిపో!" అల్లరిగా అన్నాడు విజయ్.

"విజయ్! నేను నీ దగ్గరికి వచ్చేస్తాను," అంది పాప.

లత 'విజయ్' అని పిలుస్తోంటే పాపకూ అదే అలవాటయింది.

"రోగం కుదిరింది. వెళ్ళిపో పాపా!" అంటూ నవ్వింది లత.

అంతలో హోటల్లో ఏదో గొడవ జరిగేసరికి అందరి దృష్టి అటు మళ్ళింది.

కుతూహలంకొద్దీ సర్వర్‌ను సంగతేమిటని అడిగింది లత.

"ఎవరో ఒకావిడ గ అద్దెకు తీసుకుని ఉందమ్మా. తెగ తాగుతుంది. మరో కాయనకూడా ఉన్నాడు. మొగుణ్ణని చెప్పుకుంటున్నాడు. వాలకంచూస్తే ఎలాగో ఉంది. రూంకి అద్దె ఇయ్యకపోగా తెగతాగి గొడవచేస్తున్నారు. పొమ్మంటే పోవటంలేదు."

లత, విజయ్. ఇద్దరూ అప్రయత్నంగా ఆ గొడవ జరుగుతున్న వైపు చూశారు. లత నిర్ఘాంతపోయింది. విజయ్ ముఖం తెల్లగా పాలిపోయింది. అక్కడ నిలబడిన వ్యక్తి విలసిత!

ఈ రోజున విలసిత స్టైల్‌గా అలంకరించుకోలేదు. పరమ విలాసంగా కులుకుతూ మాట్లాడటంలేదు. మెరిసిపోతూ జారిపోయే ఖరీదైన చీరలు కట్టుకోలేదు. జుట్టంతా అస్తవ్యస్తంగా రేగి ఉంది. అలా రేగిపోవటంకూడా ఏదో ఎటూకాని స్టైల్‌లో అలంకరించుకున్నట్లుగా ఉంది. తనేం మాట్లాడుతుందో, ఏంచేస్తుందో తెలియనంత మైకంలో ఉంది. కళ్ళు ఎఱ్ఱగా ఉన్నాయి. శరీరం తూలుతోంది.




కట్టుకున్నది బెనారస్‌చీరే! అయినా బాగా పాతబడి మాసిపోయి ఉంది. పైట జారి పోతూ ఉంది.

"గెటవుట్!" అరిచాడు మేనేజర్.

"నేను పోను! ఇంకొక్క రెండురోజుల్లో డబ్బు వస్తుందని చెప్పడంలేదూ?" గట్టిగా అరుస్తోంది విలసిత...తాను మాట్లాడే ప్రతిమాటా, ఎంతో విలాసంగా మాట్లాడే విలసిత.

"ఇలాకాదు. ఈవిణ్ని బయటకు ఈడ్చెయ్యండి.

ఇంక భరించలేకపోయాడు విజయ్. చటుక్కున అక్కడికి వచ్చాడు.

"ఈవిడ బిల్ ఎంతో చెప్పండి! నేను పేచేస్తాను...'' మేనేజర్ తెల్లబోయి చూసాడు.

"ఈవిడ మీకు తెలుసా సార్?" అన్నాడు. అతని కంఠంలో హేళన. తిరస్కారం. ఇంకా అక్కడ గుమికూడిన చాలామంది విజయ్‌ని వింతగా చూస్తున్నారు

"ప్లీజ్! బిల్ ఇవ్వండి!" అసహనంగా అన్నాడు విజయ్.

మేనేజర్‌కు కావలసింది కూడా డబ్బే! ఇంకేమీ అడక్కుండా బిల్ ఇచ్చాడు. అది తీసుకుని విజయ్ డబ్బు తీసి మేనేజర్ కిచ్చాడు.

అంతవరకూ పిచ్చిదానిలా విజయ్‌నీ, లతనీ, పాపనీ చూస్తూ నిలబడ్డ విలసిత మెరుపులా ఆ డబ్బు లాక్కుని విజయ్ ముఖానికేసి కొట్టింది.

"ఎవరు నువ్వు? దానం చెయ్యడానికి వచ్చావా? ముష్టిదాన్ననుకున్నావా? తీసుకుపో! నీ డబ్బు నాకక్కర్లేదు!"

మేనేజర్ అడ్డుతగిలాడు.

"మేడమ్! మీకు అక్కర్లేకపోయినా బిల్‌కి డబ్బులు నాకు కావాలి!"

విలసిత స్థిరంగా ఆ మేనేజర్ ముఖంలోకి చూసింది.

"చెల్లిస్తాను! ఏయ్ మొగుడుగాడూ! ఇవాళనుంచీ నువ్వు చెప్పినట్లే వింటాను-ముందు వెళ్ళి ఒక విస్కీ బాటిల్ తీసుకురా!" అంది తన పక్కన నిలబడ్డ పక్షీంద్రుడితో.

అతని ముఖం వికసించింది. మేనేజర్‌తో "ఇంక గొడవపడకండి సార్! మన డబ్బు మనకు ముడుతుంది!" అని నవ్వుతూ వెళ్ళిపోయాడు. మేనేజర్ మాట్లాడలేదు. విజయ్‌కి అర్థమయింది. అక్కడున్న అందరికీ అర్థమయింది.

గిర్రున తిరిగి తన రూంకి వెళ్ళబోయింది విలసిత.

విలసితా!" అన్నాడు బాధగా" విజయ్.

విలసిత ఆగి వెనక్కు తిరిగి విజయ్ ముఖంలోకి చూసి పకాలున నవ్వింది.

"ఏం నువ్వే వస్తావా నాతో? వెల్‌కం!"

లత భరించలేకపోయింది. పాప చెయ్యి పట్టుకుని గబగబా బయటకు నడిచింది. అది గమనించిన విజయ్ బిల్ చెల్లించి వెంటనే లతను కలుసుకున్నాడు.

ఆటోలో కూర్చోగానే విజయ్ ఒళ్ళో ముఖం దాచుకుంది లత. అతని ఒడి తడిసిపోయింది. తన కళ్ళలోంచి నీళ్ళు రాకుండా అవి ఇతరులకు కనపడకుండా రోడ్డువంకే చూస్తూ కూచున్నాడు విజయ్.

ఉన్నట్టుండి తల ఎత్తింది లత.

విజయ్! ఏనాటికీ విలసిత గతి నాకు పట్టదుకదూ!

అదిరిపడ్డాడు విజయ్.

"ఛ! ఛ! విలసితతో నీకు పోలికేమిటి? ఆవిడ అన్నివిధాలా చంచలమయిన వ్యక్తి..."

"నాకు తెలుసు. గర్వం, అహంకారం- అవన్నీ సరే, కానీ ఇవాళ నేను చూసినది...నాకేమనిపించిందో తెలుసునా? ఆవిడ నిజంగానే ఎవర్నో ప్రేమించిందనీ... ప్రేమించి భంగపడిందనీ...ఆ భంగపాటులోనే అలా కసిగా ప్రవర్తించి తనను తాను హింసించుకుంటోందనీ..."

''ప్లీజ్ లతా! విలసిత విషయం మాట్లాడవద్దని చెప్పలేదూ?''

"విజయ్! ఒకవేళ నేనుకూడా ఎప్పుడైనా ఏదైనా భంగపాటును ఎదుర్కోవలసివస్తే ఇంత విషం తాగుతాను కాని విస్కీ తాగను. విలసిత స్థితికంటె చావు మేలుకదూ!"

"లతా! లతా..." కోపంగా ఆందోళనగా అని లత చుట్టూ చెయ్యివేసి తనకు మరింత దగ్గిరగా అదుముకున్నాడు విజయ్. అతని భుజంమీద తల ఆన్చి అసంటగా కళ్ళు మూసుకుంది లత...

లత పాప చెయ్యి పుచ్చుకుని పరిగెత్తి పారిపోతున్నట్లు బయటికి నడవటం అది చూడగానే సమస్తమూ మరిచి విజయ్ కూడా లతను అనుసరించి ఆటోలో కూచోవడమూ బొమ్మలా నిలబడి చూస్తోనే ఉంది విలసిత...

రాజారావు దగ్గిరనుండి విడాకులు తీసుకోవటానికి చాలా అవస్థపడవలసి వచ్చింది విలసిత...ఇన్‌కంటేక్స్ గొడవలు సరిగ్గా ఉండటానికి రాజారావు పేరుమీదనే వ్యాపారమంతా ఉండటానికి ఒప్పుకుంది-విలసిత డబ్బంతా కూడా ఆ వ్యాపారంలోనే ఉంది. ఇంచుమించు యాభైవేల రూపాయల నష్టానికి సిద్ధపడి ఎలాగో లాయర్లద్వారా డబ్బు వ్యవహారాలు పరిష్కరించుకుని విడిపోయింది. అప్పటినుండీ ఆవిడ నెలకొకరు చొప్పున భర్తలను మారుస్తూనే ఉంది. ఆవిడకు నామమాత్రపు భర్తలుగా ఉండటానికి సిద్ధపడి వచ్చిన వాళ్ళందరూ ఆవిడ డబ్బుచూసే వచ్చేవాళ్ళు-తమకు సాధ్యమయినంతగా ఆవిడ డబ్బు దోచుకునేవాళ్ళు-ఆవిడతో ఉన్నవాళ్ళూ వైతాళికుల్లా ఆవిడకు భజనచేసి, విడిపోయిన మరుక్షణంనుంచీ పరమ అసహ్యంగా మాట్లాడేవారు. అదంతా విలసితకు తెలిసినా దేనినీ లక్ష్యపెట్టేది కాదు. ఏపనీ రహస్యంగా చేసేది కాదు-చూస్తూ ఉండగానే విలత డబ్బు హారతికర్పూరంలా హరించుకుపోయింది. ఆమెను గురించిన కథలు విని, కళ్లారా చూసి, డబ్బుకూడా పోగొట్టుకున్న విలసితకు మొగుడుగా ఉండటానికి ఎవరూ ముందుకు రాలేదు. చివరకు ఒక పక్షీంద్రుడిలాంటివాడు తయారయ్యాడు...ఆతడు విలసితను హోటల్‌కు చేర్చాడు... తమ రూంలోకి అతడే ఒక 'పెద్దమనిషి'ని మాట్లాడి తీసుకురాగానే విషయం గ్రహించిన విలసిత మండిపడింది. ఆ పెద్దమనిషిని నానా మాటలు ముఖంమీదే అని సాగనంపింది. ఆ పక్షీంద్రుడికి ఒళ్ళు మండిపోయింది. విలసితను చావబాదాడు. అతణ్ని తిడుతూ చచ్చినట్లు ఆ దెబ్బలు భరించింది విలసిత.

''ఇప్పటికైనా నా మాట వింటావా?'' క్రూరంగా అడిగాడు.

"వినను. ఎవరనుకుంటున్నావ్ నన్ను?"

"పతివ్రతా శిరోమణివి. నువ్వెవరో తెలియకుండానే నీ దగ్గిర చేరాననుకుంటున్నావా?"

"గెటవుట్! హోటల్ మేనేజర్‌ని పిలుస్తాను!"

"పిలు. రూం రెంట్, హోటల్ బిల్, ఇయ్యవలసి వస్తుంది!''

"నువ్వియ్య లేదా?''

"నేనా? నేనెందుకిస్తాను? నేనేం నీ మొగుణ్నా?"

"ఛీ! దుర్మార్గుడా!"

"ఓహో! సన్మార్గురాలు బయలుదేరింది. ఇన్నాళ్లూ తమ రాడిన నాటకాలన్నీ ఏమిటో?"

"నోర్మూయ్! నా యిష్టం!"

"అలాగే! నీ యిష్టం వచ్చినట్లే చేసుకో! నేను పోతాను."

అహంకారం, గర్వం ముందుపుట్టి తరువాత విలసిత పుట్టింది.

"పో! వెంటనే పో! నీ ముఖంలో పంచమహాపాతకాలూ వేలాడుతున్నాయి. ఆ ముఖం చూస్తేనే అసహ్యం-పో! పో!..."

ఇటీవల విపరీతంగా తాగటం అలవాటుచేసుకుంది విలసిత—ఆ తాగుడు మత్తులో "పో! పో పోపో!" అంది అరుస్తూ...

ఆ పక్షీంద్రుడు రూంనుంచి వెళ్ళిపోయాడు. కానీ హోటల్‌నుండి వెళ్ళలేదు. మేనేజర్‌తో ఏదో మాట్లాడాడు. వెంటనే మేనేజర్ విలసితను వెళ్ళగొడతానని బెదిరించాడు. వెళ్ళగొట్టడానికే ప్రయత్నించాడు సరిగ్గా ఆ సమయానికే విజయ్ అక్కడున్నాడు.

తనను చూడగానే విజయ్ ముఖంలో కనిపించిన వ్యధ...'విలసితా—' అన్నప్పుడు ఆక్రోశించినట్లున్న ఆ కంఠం తిరిగి తిరిగి గుర్తుకురాసాగాయి విలసితకి...

"పెద్దమనిషి! డబ్బు తీసుకుని ముందుకొచ్చాడు! జరిగింది కళ్లారా చూసాడుగా! కడుపునిండా ఆనందించనీ!"...

పక పక నవ్వుకుంది విలసిత.

(ముగింపు వచ్చే సంచికలో)



# అగ్నిమాల

దాసరి సుబ్రహ్మణ్యం

(గత సంచిక తరువాయి)

ఇంకా జాముర్రాత్రి వుందనగా, అగ్ని పాలుడు తన గృహంనుంచి బయలు దేరాడు. అతడు కూర్చునేందుకు, నిద్ర పోయేందుకూ కూడా వీలుగా, అతడెక్కిన బండిలో మెత్తని పరుపులూ, దిండ్లూ అమర్చబడినై. రెండు గుర్రాలను పూన్చిన ఆ బండికి ముందు వెనకల, అయిదుగురేసి రౌతులు ఆయుధధారులై బయలుదేరారు దారివెంబడి అవసరాల కోసం ఉపయోగించుకునే దుస్తులూ, వంటసామగ్రి మొదలైనవన్నీ, రెండు బండ్లమీద పేర్చబడినై. ఆ బండ్లవెంట కావలిగా నలుగురు కాలిభటులు బయలు దేరారు. మాహూ తన యజమాని గుర్రం ఎక్కి, ఆయన బండీవెంటనే రాసాగాడు.

నవభోజ మహారాజుకు తను వెళుతున్న పని తెలియకుండా వుండటం మేలని భావించే, అగ్నిపాలుడు అంత చీకటిలో, అంత రహస్యంగా బయలు దేరాడు. ఒకసారి నగరం వదిలి, కొంత దూరం పోగలిగితే, ఆ తరువాత రాజుకు తెలిసినా వచ్చే పెద్ద బాధ ఏమీ లేదను కున్నాడు, అగ్నిపాలుడు.

సరిగా మధ్యాహ్నం భోజనాలవేళకు అగ్నిపాలుడు తన పరివారంతో ఒక చిన్న చిట్టడవి దాటి, ఆ పక్కనే వున్న కొండ అంచునగల ఒక కుగ్రామం చేరాడు. అంత చిన్న గ్రామంలో సత్రం అంటూ ఏమీ లేకపోవటంచేత, వంట కార్యక్రమం అంతా పూర్తిచేయవలసిన బాధ్యత మాహూమీదే పడింది.

వంట పూర్తయి భోజనాలు చేసిం తరవాత, అగ్నిపాలుడు విశ్రాంతికోసం ఒక చెట్టునీడను పరుపు వేయించుకుని పడుకున్నాడు. అతడికి కొంచెం కునుకు పట్టే సమయానికి, దాన్ని భంగపరుస్తూ గుర్రపుడెక్కల మోత వినిపించింది. అగ్నిపాలుడు తృళ్ళిపడి లేచి కూర్చు న్నాడు.

ఎదురుగా ఒక సైనికుడు నురగలు కక్కుతున్న గుర్రాన్ని ఆపి, యీ దాపుల ఎక్కడైనా సత్రం లాటిది వున్నదా అని మాహూను అడుగుతు న్నాడు. అలాంటిదేమీలేదని మాహూ యిచ్చిన జవాబుతో, సైనికుడు దిగాలు పడుతూ అగ్నిపాలుడికేసి చూశాడు.

అగ్నిపాలుడు, మాహూను దగ్గిరకు పిలిచి, బహూశా ఆ రౌతు ఆకలిగొని వున్నాడేమో, భోజనం ఏర్పాటు చేయ మని చెప్పాడు. మాహూ తిరిగివచ్చి రౌతుకు ఆ సంగతి చెప్పేసరికి, అతడి ముఖంలో సంతోషం తాండవించింది. మాహూవల్ల అతడి యజమాని ఎవరో తెలుసుకున్న ఆ సైనికుడు గుర్రం దిగి, అగ్నిపాలుడి దగ్గిరకువచ్చి ప్రణామం చేశాడు.

అగ్నిపాలుడు అతణ్ణీ, అతడు ఎక్కి వచ్చిన గుర్రాన్నీ ఓసారి పరిశీలించి చూసి, "ఏమోయ్ చాలా దూరంనుంచి వస్తున్నట్టున్నదే?" అని ప్రశ్నించాడు.

"ప్రభూ, ఇరవైకోసులు ఏకదాటిని ప్రయాణంచేశాను. అత్యవసరం అయిన కార్యం!" అన్నాడు ఆ సైనికుడు.

"చంద్రగిరి నగరానికేనా, నీ ప్రయా ణం?" అన్నాడు అగ్నిపాలుడు.

"అవును, హనుమప్ప సేనానినుంచి, మహారాజులకు లేఖ తీసుకుపోతు న్నాను," అన్నాడు ఆ సైనికుడు హుందాగా.

ఆ వార్త అగ్నిపాలుడిలో చిన్న కల వరం కలిగించింది. హనుమప్పసేనాని, చంద్రగిరి రాజ్యపు ఉత్తరపు ఎల్లలను కాపాడే చంద్రగిరి సైన్యానికి నాయ కుడు. కాలభోజుడు నిజంగా చాళుక్యుల అండ దండలతో, కృష్ణానది దాటిన మాట నిజమైతే, అతడి సేనలకూ, ఆ హనుమప్ప నాయకత్వంలో వున్న సేనావాహినులకూ ఎక్కడో ఒకచోట ఘోరసంగ్రామం జరిగి వుంటుంది!

తనలో కలిగిన యీ భావ సంచల నాన్నేమీ బయటపెట్టకుండా అగ్నిపాలుడు సైనికుడితో ముందు భోజనం ముగించ మని చెప్పాడు. కొద్దిసేపటి తరవాత ఆ



సైనికుడు తృప్తిగా భుజించి, తిరిగి ప్రయాణ సన్నాహం అవుతూండగా, అగ్నిపాలుడు అతణ్ణి దగ్గిరకు పిలిచి, "ఇందాక నిన్నొక ప్రశ్న అడుగుదా మనుకుంటూనే ఉపేక్షించాను. విజయం ఎవరిది?'' అన్నాడు.

"విజయం మనదే! నవభోజ మహారాజు సైన్యాలకు ఎదురు నిలవగలిగిన సైనికశక్తి ఎవరికుంది? ఆ ద్రోహి కాలభోజుడు చావుతప్పి కన్ను లొట్టపోయి, కృష్ణానది దాటుకుని చాళుక్యరాజ్యంలోకి పారిపోయాడు," అన్నాడు సైనికుడు.

"చాలా ఆనందం కలిగించే వార్త చెప్పావు! ఇప్పుడు యిక ఆ ప్రాంతంలో ఏ కల్లోలాలూ లేవన్నమాట?" అంటూ అగ్నిపాలుడు చిరునవ్వు నవ్వాడు.

సైనికుడి ముఖంలో అంత ఉత్సాహం లేదు. అతడు గొంతు తగ్గించి. అయ్యా, అప్పుడే అంతా ముగిసి పోయిందని సంతోషించటానికి వీల్లేదు. మన రాజ్యం లోనే కొందరు ద్రోహులు—సామంతులూ, సంస్థానాధిపులూ ఆ కాలభోజుడి పక్షం వహించారు. అందువల్లనే అతడు అంత ధైర్యంగా కృష్ణానదిని దాటి మానుకోటను పట్టుకోగలిగాడు. అతడు ప్రాణాలరచేత బట్టుకుని చాళుక్య రాజ్యానికి పారిపోయినా, అతడి పక్షీయులు యింకా కొందరు, కృష్ణకు యీవల ప్రాణాలకు తెగించి పోరాడుతూనే వున్నారు. వాళ్ళకు చావు తప్ప మరో మార్గాంతరంలేదు. ఓడి మనకు బందీలుగా చిక్కినా, ద్రోహులుగా వారికి ఉరితప్పదు గదా? అందుకేవాళ్లు అంత తెగించి యుద్ధం చేస్తున్నారు!" అన్నాడు

ఆ పైన అగ్నిపాలుడికి ఆ సైనికుణ్ణి ప్రశ్నించవలసిందేమీ లేదనిపించింది. అతడు తిరిగి పక్క మీద మేను వాల్చాడు. అతడి మనసులో అనేక ఆలోచనలూ, భయాలూ ముసురుకున్నవి. తను మల్లూరు సంస్థానం చేరటానికి, యింకా యాభైకోసుల దూరమైనా పోవాలి; అదీ దగ్గిరదారిన పోతే మాత్రమే! ఒకవేళ దారిలో ఎక్కడైనా ఇరుపక్షాలకూ పోరు జరుగుతూవుంటే, తను మరో చుట్టుమార్గాన్ని అనుసరించ

వలసివుంటుంది దురదృష్టవశాత్తూ తను పోరాడే శత్రుపక్షాల మధ్య చిక్కుకుంచే...అతడి శరీరం జలదరించింది.

సరిగా అదేసమయానికి దగ్గరలో అడుగుల చప్పుడు వినిపించింది. తన ఆలోచనలను కట్టిపెట్టి అగ్నిపాలుడు కళ్లుతెరచి చూశాడు. ఎదురుగా చేతులు కట్టుకుని మాహూ నిలబడివున్నాడు.

అగ్నిపాలుడు తల కొంచెం ఎత్తి, ఏమిటన్నట్టు అతడికేసి చూశాడు. మాహూ తలాడిస్తూ, "చిత్తం, మరేం లేదు. ఆ సైనికుడు చెప్పింది విన్నారు గదా?" అన్నాడు.

"విన్నాను!" అన్నాడు అగ్నిపాలుడు ముక్తసరిగా.

"అయితే, మన ప్రయాణం......"

ఆ మాట అగ్నిపాలుణ్ణి ఆశ్చర్యచకితుణ్ణి చేసింది. "మన ప్రయాణాని కొచ్చిన చిక్కేమిటి?" అన్నాడతను,

"సరిగా మనం వెళ్ళవలసిన దారిలో వున్న కూర్మశైలం గుట్టదగ్గిరే, ఇరుపక్షాలూ పెద్ద పోరుకు సిద్ధమవుతున్నవట!" అన్నాడు మాహూ.

"అలా అయితే, మనం ఆ మార్గం వదిలి మరో మార్గాన ప్రయాణిద్దాం, సరిపోయిందా?" అంటూ అగ్నిపాలుడు కళ్లు మూసుకున్నాడు.

మాహూ కొంచెంసేపు అక్కడే నిలబడి, యజమాని ఎంతకూ కళ్ళు తెరవక పోయేసరికి, మెల్లిగా అక్కణ్ణించి కదిలి, తిరిగి ప్రయాణం సాగించేందుకు అవసరమైన ఏర్పాట్లు చేయడంలో నిమగ్నుడయ్యాడు.

సూర్యుడు బాగా పశ్చిమానికి ఒరిగిన తరవాత, తిరిగి ప్రయాణం ప్రారంభమైంది. వినపడీ వినపడనట్లు శస్త్రఘుల మోతలు గాలివెంట వస్తున్నవి. ఎక్కడో దూరాన నల్లని పొగలు ఆకాశంకేసి మందంగా నడుస్తున్నవి.

అగ్నిపాలుడి బండివెంటే నడుస్తున్న మాహూ ఓ క్షణకాలం ఆ ధ్వనులనూ, ఆకాశంకేసి పోతున్న పొగమేఘాలను చూసి, మెల్లగా తన గుర్రాన్ని బండీ వెనకకు రానిచ్చి, "ప్రభూ!" అన్నాడు భయ సంకోచాలతో.

"ఏమిటి?" అంటూ అగ్నిపాలుడు బండీలోంచి మాహూకేసి తల తిప్పి చూశాడు.

"మనం సరాసరి యుద్ధం జరుగుతున్న ప్రదేశానికే పోతున్నామని, నా భయం," అన్నాడు మాహూ.

"మన యీ ప్రయాణం యుద్ధంలో పాల్గొనేందుక్కాదు. ఆ సంగతి నీకు తెలుసుగదా?" అన్నాడు అగ్నిపాలుడు కోపంగా.

"చిత్తం...అదికాదు!" అంటూ మాహూ నసిగి, "సరే, యీ ప్రాంతాలన్నీ, నాకు తెలిసినవే. బండ్లను మరో మార్గానికి తిప్పిస్తున్నాను. ఆ అడవి

మార్గం కొంత చుట్టయినా, క్షేమం అనుకుంటాను," అన్నాడు.

"నీకీ ప్రాంతాలు తెలివున్నది-ఇరవై ఏళ్ళనాటి మాట! అది గుర్తుంచుకుని... ఒళ్ళు దగ్గిర పెట్టుకు మరీ దారి తెలుసుకుంటూ, ముందునడువు," అన్నాడు అగ్నిపాలుడు.

మాహూ గుర్రాన్ని అదిలించి, అందరికన్నా ముందుండి దారితీస్తూ, రాజమార్గానికి పక్కగావున్న మరో మార్గంనుంచి బండ్లను అడవిదారికి పట్టించాడు. అతడు దూరంగా ఒక కొండను గుర్తుపెట్టుకుని-అదే కూర్మశైలంగుట్ట అనీ, సాధ్యమైనంతవరకూ దానిని తప్పుకుపోవాలని ఆలోచించాడు.

క్రమంగా చీకటిపడింది చల్లని గాలి ప్రారంభమై కొంతసేపటికి సన్నని తుంపరలు పడసాగినై. ఇదే నిజంగా చిలికి చిలికి పెద్ద జడివాన అయితే, ఈ రాత్రికి ఏ పంచ జేరడమా అన్న భయం మాహూను బాధించసాగింది.

బండిలో మెత్తని పట్టు పరుపులపై పడుకున్న అగ్నిపాలుడి ఆలోచనలు మరొకవైపుకు నడుస్తున్నవి. తను మల్లూరు మండలాధీశ్వరుడితో, తన పేరూ, వచ్చిన కార్యం చెప్పి ఆతిథ్యం అడగటమా లేక, ఏదో ప్రయాణం మధ్యలో అనుకోకుండా అక్కడికి చేరినట్టు నటించి, ఓ వారం రోజులు అతిథిగా వుండి, ఆ కాలంలో వకుళమాలను తనదాన్నిగా చేసుకునేందుకు శాయశక్తులా ప్రయత్నించటమా! ఏది ఏమైనప్పటికీ, తను అవజ్ఞవర్మతో వేసిన పందెం సంగతి ఎట్టి పరిస్థితుల్లోనూ బహిర్గతం కాకూడదు ఒకవేళ యీ సరికే అవజ్ఞవర్మను, నవభోజ మహారాజే పంపాడన్న సంగతి మల్లూరు ప్రభువుకు తెలిసివుంటే, తన రాకకూ అలాంటి కారణాన్నే ఆయన ఊహించుకోవచ్చు! నవభోజుడి ప్రోత్సాహంతో, ఆయన ఆ స్థానంనుంచి ఒకరొకరుగా తనను వివాహం ఆడేందుకు వరులు వస్తున్నారని తెలిస్తే, వకుళమాల తనను గురించి ఎలాంటి అభిప్రాయాన్ని ఏర్పరచుకుంటుంది? తనను ప్రేమించి కాక, కేవలం రాజాజ్ఞాపాలనకోసం తనమీద ప్రేమ నటించే వారిని చూస్తే, ఏ కన్య మాత్రం ఎలా ప్రేమించగలదు? గౌరవించగలదు? అన్నివిధాలా తాను పెద్ద చిక్కులో పడిపోయానే అని అగ్నిపాలుడు నిట్టూర్చాడు. కావాలనే తనను కించపరిచేందుకు అవజ్ఞవర్మ యీ ఎత్తు వేశాడని, ఆ క్షణాన అతడికి నమ్మకం కుదిరిపోయింది అగ్నిపాలుడు ఆ విధమైన ఆలోచనలతో సతమత మవుతుండగా, "ప్రభూ!" అని పిల్చాడు, మాహూ.

అగ్నిపాలుడు లేచి కూర్చుని, బయటికి తొంగిచూశాడు. వణికిపోతూ దీన వదనంతో మాహూ నిలబడి వున్నాడు.

"ఏం జరిగింది?" అని అడిగాడు అగ్నిపాలుడు.

"మనం దారి తప్పాం," అన్నాడు మాహూ వణుకుతున్న గొంతుతో.

అగ్నిపాలుడు తన సేవకుడికేసి ఓ తృటికాలం నిప్పులు చెరిగే కళ్ళతో చూశాడు. "అంటే, మనం యుద్ధ భూమిలో...ఇరుపక్ష సేనల మధ్య చిక్కుకున్నా మన్న మాట. అంతేనా?" అన్నాడతను కోపంగా.

"చిత్తం, అది కాదు..." అన్నాడు మాహూ.

"మరి?" అంటూ అగ్నిపాలుడు బండి నుంచి ఒక్కదూకున బయటికి వచ్చి, చుట్టూ కలయచూశాడు. అప్పుడు వాళ్ళున్నది ఒకా నొక కొండ అంచున అనతి దూరంలో చిన్న చిన్న పొదలూ, రాళ్ళ గుట్టలూ—అస్పష్టంగావున్న చంద్ర కాంతిలో నీలగా కనబడుతున్నవి. ఎక్కడా జనపదం వున్న జాడలే లేవు.

"ఈ కొండ గుర్తుపెట్టుకోవటం పెద్ద పొరపాటయింది, ప్రభూ! లోగడ మీ తండ్రిగారితో నేను ప్రయాణంచేసి నప్పుడు, యీ దరిదాపులకైనా మేము రాలేదు," అన్నాడు మాహూ ఎంతో బాధపడుతున్నట్టు.

అంత విషమపరిస్థితిలో కూడా, అగ్నిపాలుడికి ఆ మాటలు నవ్వుతెప్పించినై-అతడు మాహూవైపుకు రెండడుగులు వేసి, "బహుశా, ఈ కొండ యిరవై ఏళ్ళలోనూ పుట్టి పెరిగి వుంటుంది!" అని, మిగిలిన నౌకర్లకేసి తిరిగి, "మనం యీ రాత్రికి యిక్కడే గడపవలసి వస్తుందేమో! తగు ఏర్పాట్లు చేయండి," అన్నాడు.

అందరూ తమ తమ గుర్రాలమీది నుంచీ, బండ్లమీదినుంచీ దిగి, సమతలంగా వుండే ప్రదేశంకోసం వెతకసాగారు. అగ్నిపాలుడు, మాహూ చేసిన పొరబాటుకు లోలో మండిపోతూ, ఏమీ తోచక, కొండ అంచునే ముందుకు నడవసాగాడు.

అతడా విధంగా కూతవేటు దూరం నడిచేసరికి, ఉన్నట్టుండి కొండ మలుపు తగిలింది. ఇక వెనక్కు తిరిగిపోదామని అగ్నిపాలుడు అనుకునేంతలో, అతడి దృష్టి ఆ మలుపు పక్కనవున్న ఒక సమతల ప్రదేశంలో, ఎత్తుగావున్న ఒక గుడిసెమీద పడింది.

"ఓహో, యీ ప్రాంతాల ఏదో పల్లె పట్టు వున్నట్టున్నదే!" అనుకుంటూ అగ్నిపాలుడు తాపీగా ఆ గుడిసెను సమీపించబోయాడు. అంతలో, లో నుండి సన్నని మూలుగు వినిపించింది. అగ్నిపాలుడు ఓ తృటికాలం స్థాణువులా అయిపోయి, అంతలోనే తెప్పరిల్లి, మెల్లగా గుడిసెను సమీపించి, ద్వారానికి అడ్డంగావున్న మేదరితడికను తోసుకుని లోపలికెళ్ళాడు.

లోపల అంతా చీకటి. వెనకవైపున



గోడ అక్కడక్కడా శిథిలమైన కారణంగా, ఆ ఖాళీ ప్రదేశాలనుంచి బయటి చంద్రకాంతి అస్పష్టంగా ఆ ప్రదేశాన పడుతుంది. అక్కడవున్న ఒక గడ్డి మేటి మీద, ఒక మానవాకారం కాళ్ళూ, చేతులూ కదిలిస్తూ, మధ్య మధ్య మూలుగుతున్నట్టు అగ్నిపాలుడు గ్రహించాడు.

సంభ్రమాశ్చర్యాలతో అగ్నిపాలుడు ముందుకు ఒకడుగు వేసేసరికి, ఆ మూలుగుతున్న వ్యక్తి ఒక్కసారిగా పక్కకుతిరిగి, "ఎవరు?" అని ప్రశ్నించాడు.

అగ్నిపాలుడికి ఆ పరిస్థితుల్లో ఏమని జవాబుచెప్పాలో తెలియలేదు. ఏమని జవాబివ్వటమా అని అతడాలోచిస్తున్నంతలో, ఆ వ్యక్తి మళ్ళీ అదే ప్రశ్న అడిగాడు. ఈసారి అతడి కంఠస్వరంలో భయ చిహ్నాలు కనిపించినై.

''నువ్వెవరివి? కాలభోజుడి పక్షీయుడివా? నవభోజుడి భృత్యుడివా?" అన్నాడా వ్యక్తి, బాగా ఆయాసపడిపోతూ.

"రెండూ కాదూ...నేను, యిప్పటి పరిస్థితుల్లో ఏ పక్షానికీని చెందినవాణ్ణి కాదు!'' అంటూ అగ్నిపాలుడు, ఆ వ్యక్తిని సమీపించాడు.

"నమ్మవచ్చునా?'' అన్నాడా వ్యక్తి.

"నేనే పక్షంవాణ్ణీ కాను. అయినా, యిప్పుడు నువ్వున్న స్థితిలో ఎవరినైనా నమ్మటం, నమ్మకపోవటం అన్న సమస్యే రాదు," అన్నాడు అగ్నిపాలుడు.

"అవును!" అంటూ ఆ వ్యక్తి సూటిగా అగ్నిపాలుడి ముఖంలోకి చూశాడు.

ఆ వ్యక్తి దుస్తులన్నీ రక్తంతో ఓడుతున్నవి. పొట్టమీద గట్టిగా బిగించివున్న ఒక వస్త్రంకేసి వేలితో చూపుతూ అతడు, "ఇక్కడ పెద్దగాయం తగిలింది. చాలా రక్తం కూడా పోయింది. ఇక నేను ఎంతోకాలం బతకను, నా

తుదికోర్కె...ఒక సాయం...చేయ గలరా?'' అన్నాడు బొంగురుపోయిన గొంతుతో.

అగ్నిపాలుడు అతడి పక్కనే వంగి అతడి ముఖాన్నీ, ధరించిన దుస్తులనూ పరీక్షగా చూశాడు. అతడికి పాతికేళ్ళ కన్నా ఎక్కువ వయసుండదు. శరీరానికి యింకా కవచం వున్నది. దాన్ని చూస్తూనే అగ్నిపాలుడు, అతడు సామాన్య సైనికుడు కాదని గ్రహించాడు.

"మీకు ఎలాంటి సహాయం అయినా చేయగలను. కాని, అలా అని వాగ్దానం చేసే ముందు, మీ రెవరో నాకు తెలియాలి గదా?" అన్నాడు అగ్నిపాలుడు.

ఆ క్షతగాత్రుడు అగ్నిపాలుడి కళ్లల్లోకి ఓ మారు చూసి, "నా పేరు విష్ణుమిత్రుడు. కూర్మశైల సంస్థానాధిపతిని. ఈ మధ్యాహ్నమే మా పక్షానికీ, నవభోజుడి పక్షానికీ మధ్య దారుణ యుద్ధం జరిగింది. అందులో నేను గాయపడి, ప్రాణాలతో యిక్కడికి చేరగలిగాను,'' అన్నాడు.

"అంటే, మీరు కాలభోజుడి పక్షీయులన్నమాట; అయినా నా కొచ్చిన అభ్యంతరం ఏమీలేదు. ప్రాణాపాయ స్థితిలోవున్న మీకు ఎలాటి సహాయమైనా చేయగలను,'' అన్నాడు అగ్నిపాలుడు.

అగ్నిపాలుడి మాటలు, విష్ణుమిత్రుడిలో ఎక్కడలేని ఆశారేఖలనూ పొటమరింపచేసినై. అతడు హీనస్వరంతో, అగ్నిపాలుడికేసి చేయి వూపుతూ, "చాలా కృతజ్ఞుణ్ణి! గొంతు ఎండిపోయింది. దాహం తీర్చుకునేందుకు మీ దగ్గిరేమైనా మంచినీ రున్నదా?" అని అడిగాడు.

"ఒక్కక్షణం!" అంటూ అగ్నిపాలుడు, ఒక్క గంతులో గుడిసెనుంచి బయటికివచ్చి, కొంత మలుపువరకూ వేగంగా పరిగెత్తి, "మాహూ! మాహూ! నీటిపాత్ర తీసుకుని వెంటనే, రా!'' అని కేకవేశాడు.

తన యజమానికోసం, అతడు వెళ్ళిన దారివెంటే వస్తున్న మాహూ, యీ కేక వింటూనే ఛెంగున వెనుదిరిగి, హుటాహుటాని బండ్లదగ్గిరకు పోయి, నీటిపాత్ర తీసుకుని, ఆగ మేఘాలమీద అగ్నిపాలుడి దగ్గిరకు పరిగెత్తుకు వచ్చాడు.

క్షణాలమీద ఇద్దరూ గుడిసెలో ప్రవేశించారు. గడ్డిమేటిమీద ఆయాస పడుతున్న విష్ణుమిత్రుణ్ణి చూస్తూ, మాహూ గతుక్కుమన్నాడు. అది గమనించిన అగ్నిపాలుడు, "నీ కొచ్చిన ప్రాణభయం ఏమీలేదు! అతడికి వెంటనే దాహం యివ్వు,'' అన్నాడు చిరుకోపంగా.

నీటిపాత్రను చూస్తూనే విష్ణుమిత్రుడు లేచి కూర్చునేందుకు ప్రయత్నించాడు. కానీ, బాధగా మూలుగుతూ వెనక్కు



పడిపోయాడు. మాహూ, పాత్రకు చేతిని అడ్డంపెట్టి, చిన్న ధారగా విష్ణుమిత్రుడి గొంతుకలో నీరుపోశాడు. దప్పిక తీరగానే విష్ణుమిత్రుడు వద్దన్న సూచనగా చేయి వూపాడు. మాహూ నీటి పాత్రను కిందపెట్టి, అగ్నిపాలుడికేసి తిరిగి, "ఈయనెవరో బాగా గాయపడి నట్టుంది! గాయాలకు కట్లు కట్ట మన్నారా?" అని అడిగాడు.

అగ్నిపాలుడు జవాబు చెప్పబోయేంతలో, విష్ణుమిత్రుడు హీనస్వరంతో ఒక్క మూలుగు మూలిగి, "మీదయకు కృతజ్ఞుణ్ణి! కట్లు కట్టేందుకు ఎన్నో గాయాలు లేవు; ఒకే ఒక్క గాయం. దానికి, ఆయుద్ధభూమిలోనే, నా భటులు మందు వేసి కట్టు కట్టారు. అయినా ఆలోపలే రక్తం చాలా పోయింది. పైగా యిప్పుడు ఆగాయం కట్లతో నయమయేది కాదు;" అని ఆయాసపడుతూ కొంచెం ఆగి, అగ్నిపాలుణ్ణి దగ్గిరకు రావలసిందిగా సౌంజ్ఞచేశాడు.

అగ్నిపాలుడు అతణ్ణి సమీపించి, అతడి తలవైపున వంగాడు. అప్పుడు విష్ణుమిత్రుడు మరింతగా ఆయాసపడుతూ, "నా అంతం దగ్గిరవుతున్నది. అదుగో, చూడండి..." అంటూ గుడిసెలో ఒక మూలకేసి చేయి చూపి, "అక్కడవున్న గడ్డికింద కొన్ని కాయితాలు వున్నవి. వాటిని..." అంటూ దుఃఖభారంతో డగ్గుత్తికఅయి, అంతలోనే కొద్దిగా తెప్పరిల్లి, "ఇక నాకు మాట్టాడే శక్తి కూడా పోతున్నది. వాటిని... ఆ కాయితాలు...అవి అన్నీ నాకు కాబోయే వధువు రాసిన లేఖలు. అదృష్టం వున్నట్టయితే యీ నాటినుంచి ఒక్క నెలరోజుల్లో మాకు వివాహం జరిగివుండేది. కానీ...దురదృష్టవంతుణ్ణి...మీరు..."




ఆ పైన విష్ణుమిత్రుడి మాటలు మరింతగా అస్పష్టంగా సాగినై. అగ్నిపాలుడు అతడి పెదాల దగ్గిరగా చెవి పెట్టి వినేందుకు ప్రయత్నించాడు. కాని, ఆ ప్రయత్నం విఫలమైంది. అంతలో విష్ణుమిత్రుడి ముఖం వివర్ణం కావటం, కంఠనరాలు ఉబ్బి బిగుసుకు పోతూం డటం—అగ్నిపాలుడు గమనించాడు. అతడు ఎక్కడలేని కుతూహలంతో, ఆదుర్దాతో ముందుకు వంగి, "విష్ణుమిత్రా! ఇంతకూ నేనా లేఖలు అందించ వలసిన నీ ప్రియురాలు—వధువు పేరు చెప్పావుకాదు," అన్నాడు.

విష్ణుమిత్రుడు ఎంతో ప్రయత్నంమీద కనురెప్పలు కదిలించిః కళ్ళు తెరవ గలిగాడు. అతడి గొంతులో చిన్న శబ్దం ప్రారంభమై, కొద్దిసేపటికి అగ్నిపాలుడి చెవిలో, ''ఆమె... పేరు... పేరు—" అనేంతవరకూ వచ్చి, హఠాత్తుగా నిశ్శబ్దం అయిపోయింది.

అగ్నిపాలుడు ఒక్క అంగలో విష్ణుమిత్రుడు చెప్పినచోటుకు వెళ్ళి, అక్కడ ఎండుగడ్డి కిందవున్న పెద్ద పొట్లంలాటి దాన్ని చేతికి తీసుకున్నాడు. తరవాత అతడు వెనుదిరిగి, విష్ణుమిత్రుడికేసి చూశాడు. అ నరికే అతడి నాడిని పరీక్షించి చూస్తున్న మాహూ, అగ్నిపాలుడికేసి తలతిప్పి పెదాలు చప్పరించి 'ప్చ్, ప్చ్' అంటూ, తన పై నున్న వస్త్రాన్ని, విష్ణుమిత్రుడిమీద కప్పి, తలవంచుకుని లేచి నిలబడ్డాడు.

(సశేషం)




కుఱ్ఱవాడికి ఏమీ నయంలేదు. దగ్గూ పడిసెం తగ్గితే గజ్జీ, గజ్జి పోతే లివరు, లివరువాపు తగ్గితే జ్వరము! నాలుగేళ్ళ కుఱ్ఱవాడికీ యమునికీ మధ్య లాగులాట పీకులాటగా ఉన్నది. కాళ్లూ చేతులూ ఊచలైనవి; ముఖం పాలిపోయింది; కళ్లు మాత్రం తళతళ మెరుస్తున్నవి — విశ్వంలో ఉన్న గ్లాంతిని, విరక్తినీ ప్రజ్వలింపజేస్తూ, అవి శిశువు కళ్ళు కావు; జీవితంలోని సమస్త తిక్తరసాలనూ సేవించి విరక్తిజెందిన వృద్ధుడు ఎవడో వాటిలో దాగున్నాడు; అందులో ఉన్న అసహాయతా, కాతరతా మాత్రమే శిశువువి!

ఎప్పుడూ ఒకటే ఏడుపూ, మూ రామూ! విసుగెత్తినప్పుడు చిత్ర కుర్రవాడిని వీపుమీద చరిచి "చావనన్నా చావవు! కొట్టీ కొట్టీ నా చేతులే నొప్పి పుడుతున్నై!" అనేది. కుఱ్ఱవాడు ఇంకా ఇంటికప్పు లేచేటట్టు అరిచేవాడు. పక్క మీద పండుకున్న వినయుడు మేలుకొని ఉన్నా నన్నట్టూ అటూ ఇటూ పొర్లేవాడు; మాట్లాడేవాడు కాదు. ఇంతకు ముందు ఈ విషయమై భార్యతో పోట్లాడేవాడు కూడా. కాని ఇప్పుడు ఏమీ అనటంలేదు. భార్య విసుగుచెందటానికి కారణా లేమిటో అతనికీ తెలుసు. అతని హృదయం బాధపడేది.

కాని గత్యంతరం లేదు. వినయుడు వారఫ్‌లో గుమస్తా. వచ్చేజీతం ఇంటి ఖర్చులకే సరిపోదు. డాక్టరుకు ఏమిస్తాడు? అయినా ఆ లోపంకూడా ఉంచలేదు.

క్రురవాడు ఆకాశం బద్దలయ్యేటట్టు అరుస్తున్నాడు. ఆ అరుపులో వేదన ఏమీ లేదు—ఈ ప్రపంచం మీద విద్రోహంతప్ప. చిత్ర ఆ కోపంలో ఒక దెబ్బవేసినా తర్వాత చాలా లాలించి బెల్లించి కుర్రవాణ్ణి మైదుపుచ్చాలని చూసేది. ఈ కేకలకు భర్త ఎక్కడ మెలకువ వస్తుందో అని భయపడేది. పాపం, పగలెల్లా చాకిరీ చేయటంవల్ల ఆమెకూ నిద్ర ముంచుకొచ్చేది; కుర్రవాడు నోరు మూస్తేకదా! వాడికి లాలింపు అక్కర్లేదు; బొమ్మలు అక్కర్లేదు; తినుబండారాలు అక్కర్లేదు. వాడి అంతరంగంలో ఉన్న విద్వేష మంతా ఏడ్పుగా బయటికొస్తున్నది. ఆదేడుపుకాదు_సృష్టికి శాపం!

వినయుడు నిద్రపోతున్నట్లు పండుకుని డాక్టరిచ్చిన సలహాను గురించి ఆలోచించేవాడు: "కుర్రవాణ్ణి 'వేలూరి'కి తీసుకు వెళ్లాలట లేకపోతే లాభం లేదట!— తను ఎలా తీసుకెళ్లగలడు?" ఇక ఆలోచన ఆపి భార్య కుర్రవాణ్ణి లాలించటం వింటూ పడుకునేవాడు.

"మా నాయనకదూ, ఏడవమాకు రేపు నీకు ఎర్రటి మోటారు కారు కొని పెడతాను నువ్వు దాంట్లో కూర్చుని నడుపుదువుగాని —" కుర్రవాడు ఏమాత్రం ఊరుకునేవాడు కాదు. "నన్నెందుకు కొట్టావు?" అనేవాడు.

చిత్ర కుర్రవాణ్ణి చంకకు తీసుకుంటానికి చేతులు చాపి "మా తండ్రికదూ! మోటారుకారెక్కి 'బంయ్, బంయ్' అని హార్న్ వాయించుదువుగాని" అనేది.

కుర్రవాడు చేతులూ కాళ్లూ నేలకు కొట్టుతూ అదేపాట పాడేవాడు: "నన్నెందుకు కొట్టావు?"

కుర్రవాని మూర్ఖపుపట్టూ భార్య తెలివి తక్కువ లాలింపూ చూస్తే వినయుడికి నవ్వువచ్చేది కాని ఆ లాంతరు వెలుగులో భార్య ముఖంవంక చూసినప్పుడు చాలా బాధపడేవాడు. ముఖం గోడ వైపుకు పెట్టి మళ్ళీ ఆలోచనలో పడేవాడు: "తను వివాహం చేసుకోవటం తప్పా? ఏకాకిగాఉంటే జీవితం [illegible] వ్యర్థమయ్యేదికాదా? ఇక మానవుడు కల్పించిన దారిద్ర్యంకోసం జీవితాన్ని నిష్ఫలం చేసుకోటం ఏమంత వివేకం?"

"నన్నెందుకు కొట్టావు?" అనే కుర్రవాడి చీత్కారంతో వినయుని ఆలోచనా శృంఖల తెగిపోయేది. "వీణ్ణి వేలూరికి ఎక్కడకు తీసుకుపోవాలి?" వినయుడ నేకచోట్లు తలుచుకునేవాడు కాని డబ్బో? భార్య దగ్గర ఉన్న నగలెల్లా రెండు గాజులు. అవి అమ్మినా వందకంటే




ఎక్కువరావు హాజీతో ఎన్నాళ్లు గడుస్తుంది?

కుర్రవాడు హఠం మానలేదు. వినయుడు లేచి కుర్రవాడి దగ్గరికి వచ్చాడు. కూర్చుని కునికిపాట్లు పడుతున్న చిత్ర కుర్రవాణ్ణి ఇంకొకటివేసి "కుదిరిందా రోగం? అందరి నిద్రా పాడు చేశావు! ఎక్కడినించి పుట్టుకొచ్చావురా. నా కడుపున రాక్షసుడివి," అన్నది

"అబ్బ! మళ్ళీ కొట్టేవెందుకు?" అన్నాడు వినయుడు

"కొట్టను! అర్ధరాత్రిపూట దొంగలు పడ్డట్టు కేకలు పెట్టి ఇరుగుపొరుగును లేవగొట్టుతూ ఉంటే?"

"వాడిని అనేదేముంది? రోగంతో తీసుకుని తీసుకుని అట్లా ఏడుపుగొట్టు వాడయాడు!" అని కుర్రవాణ్ణి ఎత్తుకోటానికి చేతులు చాచాడు. వాడు తండ్రి దగ్గరికి రావటానికి ఇష్టపడలేదు తల్లి కొంగు గట్టిగా పట్టుకొని ఏడవసాగాడు.

చిత్ర కొంగు విదలించి లాక్కుని "చావనన్నా చావవు పీడా వదిలిపోయేది!" అన్నది.

"ఛీ, ఏమి టామాటలు చిత్రా!" అన్నాడు వినయుడు.

చిత్ర ఏడుపుపర్యంతమై, "ఇంకా ఏమనమంటారు? వాడు బతికేవాడు కాడని నాకు తెలియదూ? తీసుకు తీసుకుని పోయేవాడుపోక, నన్ను కూడా వెంట తీసుకుపోతాడు" అని చాటుగా కళ్ళు తుడుచుకున్నది.

కుర్రవాడు వినయుని చంకలోనుంచి బలపాల్లాంటి చేతులు చావి 'అమ్మ దగ్గరికి పోతా' నని చీత్కారం చేయసాగాడు.

"ఛేంజికి తీసుకుపోతే నయమవుతుందని డాక్టరుగారు చెప్పారు"—ఈ మాట భార్యను ఓదారుస్తుందని వినయునికి నమ్మకంలేదు. అసలు అతనికే లేదాయె!

చిత్ర జవాబివ్వలేదు. కుఱ్ఱవాణ్ణి భర్త దగ్గిరనుంచి తీసుకుని, పక్కమీద పడుకోబెట్టి "నోరుమూస్తావా, లేదా? ఈ దఫా అరిచావంటే తలుపుతీసి రోడ్డు మీద పారేసి వస్తాను." అని కుఱ్ఱవాడి పక్కనే, పడుకుని భర్తతో "మీరు వెళ్ళి పండుకోరాదూ? రాత్రంతా మేలుకుంటే ఎలా? పగలంతా పని చేయాలాయె— ఇలా ఐతే బండి ఎన్నాళ్ళు సాగుతుంది?" అన్నది.

వినయుడు పక్కమీద పడుకుని "నువ్వు ఒక్క కునుకూ వేయలేదుగా!" అన్నాడు.

"నేను పండుకుంటానుగా, ఇక నిద్ర పోతాను."

కాని ఆమెకు నిద్రపోయే అదృష్టం పట్టలేదు. కుఱ్ఱవాడు కొత్తరకం హఠం సాగించాడు: "నువ్వు పడుకున్నావెందుకు? ఇదిగో, ఇక్కడ కూర్చో!" అన్నాడు వేలుతో చూపిస్తూ.

వాడు చూపించినచోట చిత్ర కూచో వలసిందే. బతిమాలినా, బెదిరించినా లాభంలేదు.

"మా చిట్టివి కదూ! భలే నిద్ర వస్తున్నది: కాసేపు నడుం వాలుస్తాను— అక్కడే పడుకుంటానులే. ఏం?"

ఉహూ! పడుకోను వల్లకాదు! కూర్చోవలసిందే. "పడుకున్నావెందుకు? కూర్చో!"

పీడి మారాము చూస్తే వినయుడికి కష్టమేసేది. లేచి "వాడి నిట్లా యివ్వు బజార్లో తిప్పుకొస్తాను," అన్నాడు.

"మీరు మళ్ళీ ఎందుకు లేచారు?" అన్నది చిత్ర విసుగుతో.

"వాడి పోరు తగ్గలేదుగా."

"అందుకని అర్థరాత్రిపూట రోడ్ల మీద తిప్పుతారా? మీరు పోయి పడుకోండి."

వినయుడు పక్కమీద పడుకునే వాడు. నిద్రా, విశ్రాంతీలేక, వాడిపోయిన భార్య ముఖంవకం చూడలేక పోయే వాడు. గోడవైపుకుతిరిగి పడుకుని చేంజికి తీసుకువెళ్ళటానికి డబ్బు ఎలా దొరుకుతుందని ఆలోచించేవాడు.

తర్వాత ఎప్పుడో కునుకుపట్టేది. కాని కుఱ్ఱవాడికేకలతో మెలకువ వచ్చేది. లేచి చూస్తే చిత్ర మంచానికి తల ఆనించి కూర్చుని నిద్రపోతూ వుండేది. కుఱ్ఱ వాడు చేతుల్తో జుట్టుపీకుతూ, కాళ్ళతో తలను తన్నుతూ "నువ్వు నిద్రపోయావెందుకూ? లే!" అని అరుస్తూండేవాడు.

* * *

ఇలా గడిచిపోతున్నవి రాత్రుల్లూ, పగళ్ళూ! ఒక మాదిరి రేకుల ఇల్లు: వంటకు పాకా, కాస్త కాళీజాగా— ఇదే వీరి ఆస్తి. వారింటికి దగ్గరలోఉన్న పంపుదగ్గర పేరులేని మొక్క ఒకటి మొలిచింది. ఈ శీతకాలంలో అది బాగా పుష్పించింది. కాని వాటికి అందమూ లేదు, గంధమూ లేదు. అయినా దానికి



అలంకారం అదే — బీదకుటుంబీకుల ముఖాన నవ్వుమాదిరిగా!

వినయుడు మొదట్లో పితృఋణం తీరుతుందని సంతోషించాడు. కాని ఇప్పుడు అదికూడా తీరేటట్టులేదు. భార్య ముఖం వంక చూడలేకుండా ఉన్నాడు. పాపం! మెడయెముక వెళ్ళుకొచ్చింది— కళ్ళు పీక్కుపోయినవి! ఇంట్లో చాకిరీకీ, కుర్రవాడి సేవకూ నలిగి పందొమ్మిదేళ్ళ చిత్ర నలభై యేళ్ళదానిలాగా అయింది. కుర్రవాడు రోజురోజుకూ మృత్యువుపైపై మొగ్గుతున్నాడు.

ఆవాళ డాక్టరుగారు దోవను పోతూ కారు దిగి ఇంటికొచ్చి, దగ్గరబంధువు మాదిరిగా– "ఇంకా కుర్రవాణ్ణి ఛేంజికి తీసుకుపోలేదా? మీరు వాణ్ణి బతకనిచ్చేటట్టు లేరు!" అని పోయాడు.

డాక్టరు పోగానే వినయుడు భార్యతో— "డాక్టరుకు మనమీద ప్రేమ కలిగిందనుకుంటాను, చిత్రా! మనతో డాక్టరు మాదిరిగా వర్తించడు, కాదూ?" అన్నాడు.

డాక్టరుగారి సహృదయాన్ని గురించి కాసేపు చర్చించుకున్నారు ఎలాగైనా సరే డబ్బు సంపాదించి నాలుగైదు రోజుల్లోనే కుర్రవాణ్ణి ఛేంజికి తీసుకు వెళ్ళాలని వినయుడు నిశ్చయించుకున్నాడు. చిత్ర నీళ్ళు తేవాలని పైపు

దగ్గరికి వెళ్ళింది. డాక్టరుగారి ఈ క్షణిక అభినయంతో వీరి హృదయభారం కొంత తగ్గింది.

* * *

అయినా అదెంత సేపు!

పొద్దుకూకింది. వినయుడు బడలికతో ఆఫీసునుంచి ఇంటికి చేరుకున్నాడు. కుర్రవాడిపోరు మామూలే. తల్లికొంగు పుచ్చుకుని వదలడు.

"నేను వంటా గింటా ఏమీ చేసుకో వద్దూ! ఇలా నీతో కూర్చుంటే ఎలా జరుగుతుంది?" అని చిత్ర కొంగు వదలించుకోవాలని చూస్తున్నది. కుర్రవాడు శోకంపట్టాడు.

"నువ్వు కూర్చోరాదూ? నేను బజారుకుపోయి పూరీలు తీసుకొస్తాను. వాడిదగ్గరే ఉండు లే." అన్నాడు వినయుడు వాడి ఏడుపుచూసి.

"రెండుకోసులనుంచి నడిచివచ్చి ఈ వానలో మళ్ళీ బజారుకు ఎక్కడ పోతారు? కుర్రవాడి నంత నెత్తికెక్కించుకో నక్కర్లేదు లెండి! పైగా మీకు బజారువస్తువులు సరిపడవు."

"ఒకరోజుతింటే ఏమీ ప్రాణంమీదికి రాదులే! అసలు–"

"అక్కర్లేదు. నేను వండటానికి పోతున్నాను. ఈ వానలో బజారు కెక్కడ పోతారు?" అని చిత్ర కుర్రవాణ్ణి బలవంతాన వదలించుకుని లేచింది. కుర్రవాడు చేతులూ, కాళ్ళూ రూడిస్తూ ఏడవటం సాగించాడు.

వినయుడు ఇక ఏమీ మాట్లాడకుండా బయటికి వచ్చాడు. టప టప వానచినుకులు పడుతున్నవి. రోడ్డంతా బురద. వినయుని కాళ్ళు బురదలోనుంచి లేచేవి కావు!

ఈ కుర్రవానిభారం వహించలేక ఈ కుటుంబం అణిగిపోతున్నది. ఈ శిశువు యొక్క అంధస్వార్థము అనుక్షణమూ బలికోరుతున్నది.

"శిశువు అంటే భవిష్యత్ మానవుడు. వాడికి అన్నీ కోరే అధికారమున్నది. వాడికోసం ఏ త్యాగమైనా చేయాలి" అనుకునేవాడు వినయుడు.

ఇంకోనాడు డాక్టరుగారు వచ్చి తల్లిదండ్రులు శిశువుల యెడల చూపవలసిన బాధ్యతను, కర్తవ్యాన్ని గురించి ఉపన్యసించి పోయాడు: ఈ మాటలు సహృదయంతో కాదు, అధికారదర్పంతో. వెళ్ళేటప్పుడు—"చూడండి, తన సుఖంకోసం కర్తవ్యాన్ని వదలినవారిని జైలుకు పంపటం న్యాయం. చెప్పండి! నిజమంటారా, కాదా?" అని పోయాడు

వినయుడు యథాప్రకారం ఆఫీసుకు పోతున్నాడు; వస్తున్నాడు. అతని ముఖం రాయిమాదిరిగా కఠినమైంది. మనసులో ఏమాలోచించుకున్నాడో ఎవరికి తెలుస్తుంది?

* * *

కుక్రవాడికి నయమైంది. ఇంకేమీ ఆదుర్దా లేదు. వినయుడు వరండాలో ఈజీచేరులో పడుకుని కుక్రవాడి ఆటలు చూస్తున్నాడు. చిత్ర కుర్చీవెనక నిలబడి "అబ్బ, ఎంత మంచి చోటండీ. మళ్ళీ నాకు కలకత్తా వెళ్ళ బుద్ధి పుట్ట టం లేదు" అని, భర్త చెవిదగ్గరకు వంగి నవ్వుముఖంతో "నిన్న కుర్రాణ్ణి ఎత్తుకుంటే చేతులు జిమ్ముమన్నవి!" అంది.

ఈ గరపభూమిరంగు చిత్ర చెక్కి ళ్ళకూ, చెట్లలోని సజీవత్వం చిత్ర వొంటికీ బాగా పట్టింది. వినయుడేం మాట్లాడలేదు.

చిత్ర కాసేపుండి కేకట్టింది; "ఒరే చిట్టీ! వాణి వదలిపెట్టు—అసలే బక్క ప్రాణం!"

చిట్టి తనతో ఆడుకునే కుర్రవాడి వీపుమీద ఎక్కి తల మట్టిలో కూరు తున్నాడు. వినయుడు పోయి వదలించిం దాకా వదలలేదు.

కిందపడ్డ కుర్రవాడు లేచి దుమ్ము దులుపుకుని ఏడవకుండా ముఖాన నవ్వు తెచ్చుకుని "చూడండి కక్కయ్యగారూ! చిట్టి నన్ను మోయమంటాడు నేను మోయగలనటండీ!" అన్నాడు.

కుర్రవాడి పేరు రఘు, పొరుగువారి అబ్బాయి. జబ్బుగా ఉంటే తండ్రివాళ్ళు ఇక్కడికి తీసుకువచ్చారు. చక్కని ముఖం; ఎప్పుడూ నవ్వుతూ ఉంటుంది. వినయుడు వీడితో తన కొడుకును పోల్చుకుని సిగ్గుపడ్డాడు. కొడుకును గదుముతూ "ఎందుకు వాడి తల మట్టిలో కూరింది? పోట్లాడకండి ఉండలేవూ?" అన్నాడు

చిట్టి కళ్ళూ ముఖమూ ఎర్రచేసు కున్నాడు. "పోట్లాడుకోలేదండీ! చిట్టి గుర్రపుఆట ఆడుకుందామంటే నేను మోయలేనన్నాను నాకేమీ దెబ్బ తగల లేదు" అన్నాడు రఘు.

"జాగ్రత్త. వాడి నెప్పుడూ అంటు కోకు!" అని వినయుడు వరండాలోకి వచ్చాడు.

"మన అబ్బాయికీ రఘూకూ కల వదు..." అని భర్త గంభీరముఖంవంక చూసి చప్పున ఆగింది చిత్ర.

ఆ మాట నిజమే రఘు ఎంత లాలిం చినా బతిమాలినా చిట్టి వినేవాడుకాడు. ముఖం మాడ్చుకుని, సందు చిక్కగానే తొడ మెలిపెట్టి పరిగెత్తేవాడు.

రఘు ఏడ్చేవాడు చిత్ర వాడిని చంకకు తీసుకుని కొడుకును గదిమేది. వినయుడు మాత్రం కుర్చీలోనుంచి లేచే వాడు కాదు. అతని ముఖం వేదనతో నల్లబడేది రఘు ఏడుపు చాలించి అతని దగ్గరకువచ్చి "కక్కయ్యా! చిట్టి నన్ను కొట్టాడు. రేపటినించి ఆడుకోటానికి రాను!" అని చెప్పేదాకా మాట్లాడేవాడు కాడు శూన్యంవంక చూస్తూ ఏమాలో చించేవాడో!

రఘు మళ్ళీ సాయంత్రం వచ్చాడు.

వినయుడు అప్పుడు కొడుక్కు చదువు చెప్తున్నాడు. అరగంట శ్రమ పడినా చిట్టికి అక్షరం రాకపోయేవరకు హతాశుడైనాడు. రఘు వచ్చి పక్కనే కూర్చున్నాడు. వినయుడు "రఘూ! నువ్వు 'అ' రాయగలవా" అని అడిగాడు.

రఘు నవ్వి "అ! కక్కయ్యగారూ! నేను బాలశిక్ష అంతా వప్పగించగలను'' అన్నాడు.

"నువ్వు బాలశిక్ష చదువుతున్నావా?" అన్నాడు వినయుడు ఆశ్చర్యంతో.

"పూర్తి కూడా అయిందండి 'అ' రాయమంటారా?" అని రఘు పలక కోసం చేయి చాపాడు.

చిట్టి పలక ఇవ్వలేదు. గట్టిగా పట్టుక్కూర్చున్నాడు.

''చిట్టిని పలకివ్వమని చెప్పండి కక్కయ్యగారూ! నేను అక్షరాలు బాగా రాస్తాను" అన్నాడు రఘు.

"వద్దులే! వాడు రాసుకుంటాడు. నువ్వింటికి పో!'' అన్నాడు వినయుడు పరుషంగా. ఈ మాట వినేవరకు పాపం రఘుముఖం వెలవెలపోయింది. కిక్కురు మనకుండా ఇంటికి పోయాడు.

కాసేపటికి చిత్ర ఇంట్లోనించి వచ్చి "మధ్యాహ్నంనుంచి వాడినే పెట్టుకు కూర్చున్నారే! జడ్డిని చేయంది వదలరా ఏమిటి?'' అన్నది.

"ఊ." అన్నాడు వినయుడు గంభీరంగా.

* * *

రఘు రెండు రోజులనుంచి రావటం లేదు. వినయుని సిగ్గుకూ, బాధకూ అంతులేదు. కుర్రవాణ్ణి వెంటపెట్టుకుని వాళ్ళ ఇంటికి కూడా పోవాలనుకుని మధ్యలోనే తిరిగి వచ్చాడు. తనముందే తన తల కొట్టేసినట్టున్నది అతనికి.

మూడోనాడు బయటికి వెళ్ళుతూంటగా, రఘు గేటుచాటున నిలబడి లోపలికి తొంగిచూస్తూ వినయుని కంటపడ్డాడు, 'రఘూ!' అని పిలిచాడు వినయుడు.

దొంగతనంచేస్తూ పట్టుబడ్డవాడి మాదిరయాడు రఘు పారిపోవాలని చూస్తున్నాడు.

"చిట్టితో ఆడుకోటానికి రావటం లేదే, రఘూ?''

ఈ మాటలోఉన్న ఆదరంతో రఘూకు ధైర్యంవచ్చింది. "మీరు కోప్పడరుకదూ కక్కయ్యగారూ?" అన్నాడు.

వినయుని కళ్ళలో నీరు తిరిగింది-ఈ రోగిష్టి కుర్రవాని మాటలూ చేష్టలూ చూసి! వినయుడు రఘూను ఎత్తి ముద్దు పెట్టుకుని "ఎందుకు కోప్పడతాను బాబూ?'' అన్నాడు.

రఘు ముఖం ఆనందంతో వికసించింది. "అయితే ఆడుకోటానికి పోయేదీ?'' అన్నాడు.




"పో!" అని వినయుడు దించాడు; రఘు సంతోషంతో పరిగెత్తాడు.

రెండురోజులకు చెల్లుగా ఇవ్వాళ వినయుడు ఉల్లాసంతో షికారుకు పోయాడు. కాని తిరిగి వచ్చేవరకు ఆ ఉల్లాసంపోయింది. వాకిట్లో ఉండగానే కొడుకు కర్కశస్వరం వినిపించింది:— "ఉహుఁ! వాడికి రెండివ్వటానికి వల్ల కాదు. ఏం, వాడింటికిపోయి తినలేడూ? ముష్టి వెధవ!"

లజ్జతో, వేదనతో, కోపంతో వినయుని ముఖం ఎర్రబడింది. కాస్త కుర్రవాడిలో ఇంత అసూయ ఎక్కడనుంచి వచ్చిందా అని ఆలోచించుకుంటూ గదిలోకి పోయాడు. "చూడు, నాయనా! అంత కుళ్ళుమోతుతనం ఉండకూడదు. వాడు నీకు తమ్ముడుకాదూ! రెండుకాకపోతే ఒక్కటిస్తాను" అని భార్య కొడుకును ఓదార్చటం గదిలోనుంచే వింటున్నాడు. "నాకు ఒక్క మిఠాయిఉండ చాలు పిన్నీ! జబ్బుకాదూ, అరగదు." అని రఘూ అనటంకూడా విన్నాడు.

"సరే నాయనా నువ్వొకటి తీసుకో; మా చిట్టికి రెండు ...సరేనా?"

కాని అది యివ్వటంకూడా చిట్టికిష్టం లేదు. "ఉహుఁ. వాడికివ్వటానికి వీల్లేదు. ఇవ్వు చూద్దాము. వాడి చేతిలోనుంచి లాక్కుపోతే!" అన్నాడు.

"లాక్కో, చూస్తాను! సిగ్గు! రెండిస్తేను పాపమని, వాడిచేతిలోది లాక్కుంటావా?" అన్నది చిత్ర కోపంతో.

"వాడికి మన మెందుకివ్వాలి? నాన్న వెళ్లగొట్టెనుగా, మళ్లీ ఎందు కొచ్చాడు?"

"బాగానేవస్తాడు! బాగానేతింటాడు?"

ఇదిమామూలు విషయమే! మామూలు పాటే! వినయునికి అసహ్యమేసిపోయింది. అతని జీవితస్వప్నాలూ, ఆశలూ తుడుచుకుపోయినట్లయినవి. మెదలకుండా లేచి వాకిట్లోకి వచ్చి నిలబడ్డాడు.

చిత్ర రఘు చేతిలో మిఠాయిఉండ పెట్టింది. ''నా కంతా అఖ్ఖర్లేదు పిన్నీ... నాకు అకలిలేదు కదూ!" అన్నాడు రఘు. కాని ఆ మాట పూర్తికాకముందే చిట్టి వాడి చేతిలోని ఉండ వొడిచి లాక్కుని "ఇన్, నీకు ఉండ కావాలీ?'' అన్నాడు.

చేయి నొప్పిపుట్టి రఘు ఏడ్చాడు. చిత్ర కొడుకు వీపుమీద ఒకటి వడ్డించింది. వినయుడు వచ్చిన విధంగానే మెదలకుండా మళ్లీ గదిలోకి వెళ్ళాడు.

*　　*　　*

"వాళ్ళ రఘూకు ప్రమాదంగా ఉన్నదటండీ!" అన్నది చిత్ర వచ్చి. వినయుడు సందె చీకటిలో వరండాలో కూర్చుని ''ఎవరికి, రఘూ కా?" అన్నాడు.

"ఆఁ వాళ్లమ్మ ఏడుస్తున్నదండి. ఇంత మంచి చోటు కొచ్చినా కూడా కుర్రవాడు బాగుపడలేదు. రోజు రోజుకూ దిగజారిపోయాడు.''

వినయుడు మాట్లాడలేదు. కొండల వంక చూస్తూ ఉండిపోయాడు. కాసేపు ఉండి చిత్ర ఇంట్లోకి పోబోతూ ఉండగా కొంగు పట్టుకుని 'మాట!" అన్నాడు.

''ఏమిటి ఏ?'' అని చిత్ర అడిగింది వినయుడు మళ్లీ ఏమీ మాటాడలేదు

"ఏమి చెపుతారో త్వరగా చెప్పండి. నాకు చాలా పనులున్నై" అన్నది చిత్ర.

"మన అబ్బాయికి బాగా నయమైనట్టేకదూ చిత్రా?"అన్నాడు వినయుడు-కుర్చీ చిత్రవైపుకు తిప్పి.

"అలాగే కనపడుతుంది."

"నీకు చాలా సంతోషంగా ఉంది కదూ?"

"ఏమిటండి ఆ తలా తోకా లేని మాటలు? ఎవరన్నా అడుగుతారూ ఇలాంటివి? కుర్రవాడికి నయమైనందుకు మీకు సంతోషంగా లేదా ఏమిటి?"

నిట్టూర్చాడు వినయుడు; ఏమీ మాట్లాడలేదు చిత్ర మళ్ళీ, పోబోతుండగా కొంగు పట్టుకుని ఆపి "ఈ కుర్రవాడే రేపు పెద్దవాడవుతాడు, సంసారం చేస్తాడు — కాదా చిత్రా?" అన్నాడు వినయుడు.

చిత్రకు ఇతని గొంతు అస్వాభావికంగా తోచింది!

"ఏమిటీ మీరు చెప్పేది? తెలిసేట్టన్నా చెప్పండి!" అంది.

"చూడు! ఈ కుర్రవాడే ముందు మనకు ఆధారం పుత్ర పౌత్రాదిపర్యంతం ఈ భూమిని అనుభవిస్తాడు అందు కనే ఈ మన ప్రయత్నాలు, త్యాగం. తెలిసిందా?"

"ఊరుకోండి. మీ వెటకారమూ, మీరూను!" అని కొంగు గుంజుకుని చిత్ర వెళ్ళిపోయింది. వినయుడు ఆ అంధకారంలోనే కూర్చుని, బహుశా భవిష్యత్తును ఊహించుకున్నాడనుకుంటాను.

కొన్నాళ్ళు గడిచినాక, అర్ధరాత్రిపూట

ఏడుపు విని చిత్ర లేచి భర్తను లేపి "ఏమన్నా వినపడుతోందా?" అని అడిగింది. "ఊఁ" అన్నాడు వినయుడు.

"రఘూవాళ్ల ఇంట్లోనించేకాదూ?" అన్నది వెలవెలపోయిన ముఖంతో.

"అట్లాగే ఉంది." అని వినయుడు మంచందిగి కిటికీదగ్గరకు పోయి నిలబడ్డాడు. తర్వాత ఇంట్లో పచారుచేస్తూ హఠాత్తుగా ఆగి "రఘు చచ్చిపోవటం, మన అబ్బాయి బతకటం ఆశ్చర్యం కాదా చిత్రా" అన్నాడు వికృతస్వరంతో.

చిత్ర జవాబివ్వలేదు; ఒక్కమాటు కంపించింది. వినయుడు తలవంచుకుని పచారుచేస్తూనే చెప్పసాగాడు: "మనమెంతో త్యాగం చేశాము; ఎన్నో కష్టాలు సహించాము; మనబ్బాయి తప్పక బతుకుతాడు చిత్రా! వీడేకాదు, వీడిలాంటి వాళ్ళు ఇంకా కోట్లమంది బతుకుతారు; కొట్టుకుని చంపుకుని ప్రపంచాన్ని కలుషితం చేస్తారు. లేకపోతే మన శ్రమంతా వృథాకాదా!"

గొంతు చాలా అస్వాభావికంగాఉంది.

"మీకు పిచ్చిఎక్కిందా ఏం?" అన్నది చిత్ర" విసుగుతో.

అలానే అనుకుంటాను!" అని చిత్ర చెయ్యిగట్టిగా పట్టుకొని "ఇక్కడికి రావటానికి డబ్బుఎక్కడిదో ఎరుగుదువా? పిల్లవాణ్ణి పుట్టించిన బాధ్యత ఎంత పని చేయించిందో తెలుసుకున్నావా?" అన్నాడు కర్కశస్వరంతో.

"ఎక్కడ తెచ్చారేమిటి?" అన్నది చిత్ర భయంతో.

"దొంగతనం చేశాను! చాటుగా ఓడలో వచ్చిన బేలు అమ్మాను. భవిష్యత్ మానవుని హక్కులముందు ఇది తప్పుపని కాదుకదూ!"

"కొంప మునుగుతుందా ఏమిటి!" అన్నది చిత్ర కంపిస్తూ

వినయుడు కర్కశంగా నవ్వి "ఏమీ మునగదు, భయపడమాకు! అసలు అక్కడే ఉంది గమ్మత్తు! ఈ దొంగతనం బయటపడదు! చిరకాలం నన్ను అంకుశంతో పొడుస్తూ ఉంటుంది!" అన్నాడు.

వినయునిలో ఆకస్మికంగా వచ్చిన ఈ పొంగు వెంటనే చల్లారిపోయింది. బయటికి వచ్చి శీతల స్నిగ్ధ అంధకారంలో మౌనంగా కాసేపు నిలబడ్డాడు. అతని ప్రవర్తన అతనికే ఆశ్చర్యం కలిగించింది—ఇంత ఆవేశం చెందాల్సిన అవసరం లేదని అతనికి తోచింది.

విశాల ఆకాశం నక్షత్రాల ప్రకాశంలో గగుర్పొడిచినట్లు ఉంది. క్షమాధరిత్రి యుగయుగాల నుంచి అనేకసార్లు హతాశచెంది నేటికీ ఓర్పు పోగొట్టుకోలేదు! మరి—?



(గత సంచిక తరువాయి)

మర్నాడు రాత్రి షాహర్ జాద్ తిరిగి ఇలా కథ కొనసాగించింది.

బులూకియ భయంతో కొయ్యబారి పోయి, కదలలేకపోయాడు.

ఇంతలో ఆ సేనకు సర్దారైనవాడు అతన్ని సమీపించి, "ఎవరు నువు? మా యజమాని సులేమాన్ ఇబన్ దావూద్ నిద్రించే ఈ ద్వీపానికి ఎలా వచ్చావు?" అని అడిగాడు.

"ఓ మహానాయకా, నేను బనూ ఇస్రాయిల్ ఏలే బులూకియను. నేను సముద్రంమీద కొట్టుకుపోయి ఇక్కడికి చేరాను. మీరెవరో, ఈ సైన్యమంతా ఏమిటో నేను తెలుసుకోవచ్చునా?" అని బులూకియ అడిగాడు.

"మేం జాన్ ఇబన్ జాన్ వంశానికి చెందిన భూతాలం. మా మహారాజు సఖర్ పరిపాలించే దేశంనుంచి ఇప్పుడే వచ్చాం. మాది తెల్లదేశం. దాన్ని ఒకప్పుడు అద్ కుమారుడు షిద్దాద్ పాలించాడు."

"ఈ సఖర్ మహారాజు పాలించే తెల్ల దేశం ఎక్కడుంది?" అని బులూకియ మళ్ళీ అడిగాడు.

"కాఫ్ పర్వతం అవతల ఉన్నది. అక్కడికి మనిషి ప్రయాణంచేస్తే డెబ్బై అయిదు మాసాలు పడుతుంది. కాని మేం తృటిలో వెళ్ళగలం. నువు రాజ కుమారుడివి గనక, కావాలంటే నిన్ను తీసుకుపోయి మా ప్రభువుకు పరిచయం చేస్తాం," అన్నాడు భూతాల సర్దారు.

బులూకియ ఇందుకు వెంటనే ఒప్పుకుని, మరుక్షణం సఖర్ మహారాజు మందిరంలో వెలిశాడు. అక్కడ ఒక అద్భుతమైన మైదానం ఉన్నది. దాని చుట్టూ వెండి, బంగారాలతో ఏర్పాటుచేసిన



కాలనీలున్నాయి. నేల అంతా కస్తూరి తోనూ, మందారు పూలతోనూ పరిచి ఉన్నది. మైదానంనిండా కృత్రిమ వృక్షాలుండి, నీడనిస్తున్నాయి. వాటి ఆకులు పచ్చలు, పళ్లు కెంపులు. అంతటా ఆకు పచ్చ సిల్కు డేరాలున్నాయి. వాటి మధ్య రత్నాలు పొదిగిన బంగారు స్తంభాలున్నాయి. మైదానం మధ్యలో అన్నిటి కన్న ఎత్తుగా ఒక పెద్ద చొప్పరం ఉన్నది. దాని స్తంభాలు కెంపుల తోనూ, పచ్చలతోనూ చేసినవి. మధ్యలో బంగారంతో తయారుచేసిన సింహాసనంమీద సఖర్ మహారాజు కూర్చుని ఉన్నాడు. ఆయన కుడిపక్క సామంతులూ, ఎడమపక్క మంత్రులూ, సేనానులూ, ఇతర ఉన్నతోద్యోగులూ ఉన్నారు

బులూకియ ఆయనకు వందనంచేసి, ప్రశంసలు పలికాడు. రాజు అతన్ని ఆప్యాయంగా తన సరసన ఒక బంగారు ఆసనంమీద కూర్చోమని ఆహ్వానించాడు. బులూకియ తన అనుభవాలన్నిటినీ వివరంగా చెప్పేసరికి, రాజుతోపాటు మిగిలినవాళ్ళుకూడా ఆశ్చర్యపోయారు.

తరవాత విందు జరిగింది. భూత కింకరులు వడ్డన చేశారు. బంగారు పాత్రలలో యాభై ఒంటెపిల్లల మాంసం కూరా, మరో యాభై ఒంటె పిల్లల వేపుడూ ఉన్నాయి. వెండి పాత్రలలో యాభై గొర్రెల తలలున్నాయి. పింగాణీ పళ్ళాలలో వింత వింత ఫలాలున్నాయి. భూతాలూ వారి అతిథీ కలిసి చక్కగా తిని, తాగి, పాత్రలన్నీ శుద్ధంగా ఖాళీ చేశారు.

విందు పూర్తిఅయిన మీదట భూతాల రాజు బులూకియతో, "బహుశా నీకు మా కథా, మా ఉత్పత్తీ తెలిసి ఉండదు. అదంతా నీకు క్లుప్తంగా చెబుతాను. నీవు మానవుల మధ్యకు తిరిగి వెళ్ళినప్పుడు వారికి నిజంచెప్పి, పుక్కిటి పురాణాలకు అవకాశం లేకుండా చెయ్యగలుగుతావు," అంటూ ఇలా చెప్పాడు.

"ఆదిలో అల్లా అగ్నిని సృష్టించి, దానిని భూగోళంమీద ఏడుచోట్ల నిక్షే పించాడు. ఆ ప్రదేశాలు ఒకదానికి ఎగు వగా ఒకటి ఉన్నది. అయితే వాటి మధ్య ఎడం వెయ్యేసి సంవత్సరాలు. మొదటి అగ్ని నిక్షిప్తమైన ప్రాంతంపేరు జహీ న్నం. అల్లా దాన్ని పశ్చాత్తప్తులుకాని పాపులకోసం ప్రత్యేకించాడు. రెండవ ప్రాంతం పేరు లజా. అది ఒక అగాధం. మహమ్మదు ప్రవక్త అవత రించిన అనంతరం నాస్తికులుగా ఉండ బోయే వారికోసం అది ఏర్పాటయింది. మూడో ప్రాంతం జహీమ్. అది సలసల కాగే పెద్ద గంగాళం. అది గోగ్, మగోగ్‌లకోసం ఏర్పాటయింది. నాలు గోది సయీర్. దేవుడి ఆజ్ఞ ప్రకారం ఆదం ముందు తలవంచి నిరాకరించిన తిరుగుబాటు దేవతలకు నాయకుడైన ఈబ్లీస్ కోసం అది ఏర్పాటయింది. ఆయిదవది సఖర్. అపవిత్రులకూ, అసత్యవాదులకూ, గర్విష్ఠులకూ అది ప్రత్యేకించబడింది. తరవాత అల్లా ఒక పెద్ద గుహ తవ్వి దానిని విషవాయువు లతో నింపాడు. దాని పేరు హిత్మా. అందులో యూదులనూ, క్రైస్తవులనూ చిత్రహింసలు పెడతారు. ఏడవది హావియా. అది అదనపు యూదులనూ, క్రైస్తవులనూ, భగవంతుడియందు విశ్వాసం కలిగే ధోరణి కనబరచిన వారిని ఉంచటానికి కేటాయించబడింది. అన్ని ప్రాంతాలలోకీ ఈ చివరి రెండూ ఎక్కువ దారుణమైనవి. రెండూ ఒకే విధంగా ఉంటాయి.

మొట్టమొదటి నరకం జహీన్నంలో డెబ్భైవేల పర్వతాలు తగలబడుతూ ఉంటాయి. ఒక్కొక్క పర్వతంలోనూ డెబ్భైవేల లోయలున్నాయి. ఒక్కొక్క లోయలోనూ డెబ్భైవేల నగరా లున్నాయి. ప్రతి నగరంలోనూ డెబ్భై వేల పేటలు; ప్రతి పేటలోనూ డెబ్భై వేల ఇళ్లు; ప్రతి ఇంటా డెబ్భైవేల బల్లలు. మొత్తం బల్లల సంఖ్య నువే గుణించుకో. ఒక్కొక్క బల్లమీదా డెబ్భై వేల రకాల హింస పరికరాలు; వాటిలో ఎన్నిరకా లున్నాయో దేవుడికే తెలి యాలి. నరకా లన్నిటిలోకీ ఇదే సౌమ్య మైనది గనక, మిగిలినవాటిలో ఎలాటి చిత్రహింసలు జరిగేదీ నువు ఊహించ వచ్చు.

అగ్ని గురించి ఎందుకు ఇంత వివ రంగా చెప్పానంటే, మేం అగ్ని సంతతి వాళ్ళం. అల్లా సృష్టించిన తొలి ప్రాణులు రెండు భూతాలు వాళ్ళను అల్లా తన అంగరక్షకులుగా ఉండటానికి సృష్టించి, వాళ్ళకు ఖలీత్, మలీత్ అని పేర్లు పెట్టాడు. ఒకడిది సింహం రూపం, రెండోవాడిది తోడేలు శరీరం. సింహం పురుషుడూ, తోడేలు స్త్రీగా అల్లా తయారుచేశాడు. ఆ ఇద్దరికీ పుట్టిన సంతానంలో పాములూ, తేళ్ళూ, ఇతర

జంతువులూ పుట్టి, పాపులను హింసించ టానికి ఏడు నరకాలలోనూ ఉంచ బడ్డాయి. వాటిలోకెల్లా గొప్పవాడైన ఈబ్లీస్‌కు వాటిపై నాయకత్వం ఇయ్య బడింది. దరిమిలా ఈబ్లీస్ అల్లాకు ఎదురుతిరిగి, నాలుగో నరకంలోకి అతని అనుచరులతోసహా పంపబడ్డాడు. అతనికి పుట్టిన పిశాచాలు నరకాలన్నిటా నివాసం ఏర్పరచుకున్నాయి. మిగిలినవాళ్ళ నుంచి మేం, భూతాలం, పుట్టాం. మా పుట్టు పూర్వోత్తరాలు సంగ్రహంగా చెప్పాను. మా తిండి పుష్టిచూసి నువ్వు ఆశ్చర్యపడరాదు. మేం సింహానికీ, తోడేలుకూ పుట్టిన సంతతివాళ్ళం. మాలో ప్రతి ఒక్కడూ రోజుకు పది ఒంటెలనూ, ఇరవై అయిదు గొర్రెలనూ తిని, నలభై గంగాళాల పాయసం తాగ గలం.

"బులూకియా, ఈ మహా సత్యం తెలుసుకో. భూమిని వడ్డాణంలాగా చుట్టి ఉన్న కాఫ్ పర్వతంనుంచి మంచు దిగి రావటంచేతనే మనుషులు భూమిమీద మనగలుగుతున్నారు; లేకపోతే భూమి దిగువనఉన్న అగ్ని వారిని బతక నియ్యదు. భూమికూడా ఏడు పొరలుగా ఉన్నది. దానిని మహా బలశాలి అయిన భూతం మోస్తున్నాడు. ఆ భూతం ఒక కొండమీద నిలబడి ఉన్నాడు. ఆ కొండను ఒక ఎద్దు మోస్తున్నది. ఆ ఎద్దును ఒక బ్రహ్మాండమైన చేప మోస్తూ అనంతంలో ఈదుతున్నది.

"అనంతమైన మహా సముద్రం అడుగే నరకానికి కప్పు. సప్త నరకాలూ ఒక మహా సర్పంనోట ఉన్నాయి. విచారణ దినందాకా అవి అలాగే ఉంటాయి. అప్పుడు ఆ సర్పం సప్త నరకాలనూ, అందులోని జీవులనూ దేవుడిముందు కక్కుతుంది. అప్పుడాయన సమస్తం గురించీ తీర్పులిస్తాడు.

"నీ జ్ఞానం పరిపూర్ణం కావటానికి మరొక్క విషయంకూడా చెప్పాలి. మా వయసు ఎప్పుడూ ఒకటిగానే ఉంటుంది. మా చుట్టూ భూమిపైగల జీవరాసుల కన్నిటికీ క్షయం కలిగినప్పటికీ, మాకు వార్ధక్యంరాదు. మేం నిత్య యౌవనంలో ఉండటానికి కారణ మేమంటే మేం జీవ జలం తాగాం. ఆ అమృతాన్ని ఛాయా లోకంలో ఖిదర్ రక్షిస్తూ ఉంటాడు. ఋతువులను క్రమంగా ఉంచటమూ, చెట్లను చిగురించటమూ, ప్రవాహాలను పారించటమూ, మైదానాలమీద గడ్డి తివాసీలను పెంచటమూ, సూర్యాస్తమయానంతరం ఆకాశంలో రంగుల తెరలు పరచటమూ ఖిదర్ పని.

"బులూకియా, నేను చెప్పినదంతా శ్రద్ధగా విన్నావుగనక నిన్ను నీ దేశానికి చేర్చే ఏర్పాటుచేస్తాను."

తనకు ఆతిథ్య మిచ్చినందుకూ, బోధ చేసినందుకూ, సహాయపడుతున్నందుకూ బులూకియ భూతాలరాజుకు ధన్యవాదాలు చెప్పుకున్నాడు. అతను రాజువద్దా

ఆయన అనుచరులవద్దా సెలవు పుచ్చు కుని, ఒక బలిష్ఠుడైన భూతం భుజాల మీద ఎక్కి, ఒక్క తృటిలో తన దేశపు సరిహద్దు చేరాడు.

అతను తన రాజధానికి పోయే మార్గాన బయలుదేరబోతూ ఉండగా, రెండు సమాధులమధ్య కూర్చుని, దీనంగా విలపిస్తున్న ఒక యువకుడు కనిపించాడు. ఆ యువకుడు చాలా అందంగా ఉన్నాడు. కాని అతని ముఖం పాలిపోయి, దీనంగా ఉన్నది.

బులూకియ అతన్ని సమీపించి, స్నేహపూర్వకంగా పలకరించి, "బాబూ, ఈ రెండు సమాధుల మధ్య కూర్చుని నువు ఎందుకు దుఃఖిస్తున్నావు? నీ విచారానికి కారణం తెలిస్తే, నిన్ను అనునయించటానికి ప్రయత్నం చేస్తాను," అన్నాడు.

ఆ యువకుడు ఏడుస్తూనే, "నీ దారిన నువు వెళ్ళక, నా ఏకాంత ముకాన్ని ఎందుకు భగ్నం చేస్తావు?" అన్నాడు.

"అభాగ్యుడా, నేను జాలికొద్దీ నీ విషాదగాథ వినటానికి సిద్ధంగా ఉన్నాను. సందేహించక, నీ దుఃఖానికి కారణం చెప్పు," అంటూ బులూకియ చలవరాతిమీద కూర్చుని, యువకుడి రెండు చేతులూ పట్టుకుని, అతన్ని తన కథ చెప్పమని ప్రోత్సహించటానికి, ముందు తన కథ అంతా అతనికి చెప్పాడు.

తరవాత ఆ అందమైన యువకుడు తన కథను ఇలా చెప్పాడు:

## యువకుడి విషాదగాథ

నేను కాబుల్ దేశంలో పుట్టాను. నా తండ్రి టీఘ్మూస్ బనూ షాహ్లాన్, అఫ్ఘనిస్తాన్‌లకు రాజు. ఆయనకింద ఏడుగురు సామంతు లుండేవారు. ఒక్కొక్కడి ఆధీనంలోనూ నూరేసి నగరాలూ, నూరేసి దుర్గాలూ ఉండేవి. నా తండ్రి గొప్పవాడు. ధర్మాత్ముడు ఆయనకింద ఒక లక్ష అశ్వికదళమూ, లక్ష కాల్బలమూ ఉన్నాయి. మా తల్లి ఖురాసాన్ రాజైన బహిర్వాన్ కూతురు.

మా తండ్రి నాకు చిన్నతనంనుంచీ విద్యా, కళాభ్యాసమూ, వ్యాయామాలూ నేర్పించాడు. పదిహేనేళ్ళ వయసులో నేను అత్యుత్తమ అశ్వికుడుగా తయారై, నా గుర్రంమీద ప్రతి వేటకూ, ప్రతి పందెంలోనూ ముందు ఉంటూ వచ్చాను.

ఒకనాడు నేను నా తండ్రితోనూ, ఆయన ఉద్యోగులతోనూ వేటకు వెళ్లాను. మూడు రోజులపాటు అరణ్యాలలో వేటాడి చాలా జంతువులను చంపాం. సూర్యాస్తమయం కాబోతుండగా నేను ఏడుగురు సేవకులతోబాటు విశ్రాంతి తీసుకుంటున్నచోటికి సమీపంలోకి ఒక అందమైన లేడిపిల్ల దూకింది. అది మమ్మల్ని చూసి, వెనక్కు తిరిగి చెంగు చెంగున దూకుతూ పారిపోయింది. నేనూ, నా సేవకులూ దాన్ని చాలాసేపు వెంబ



డించాం. చివరకు ఒక పెద్ద నది అడ్డు తగిలింది. అక్కడ దాన్ని తేలికగా పట్టగలుగుతా ననుకున్నాను.

కాని, ఒక్క క్షణం ఆగి, అది నది లోకి దూకి, అవతలి ఒడ్డుకు ఈద సాగింది. మేం గుర్రాలు దిగి, వాటికి ఒకణ్ణి కాపలాఉంచి, దగ్గిరలోనే ఒక పల్లెకార్ల పడవ పడిఉంటే అందులోకి దూకి, జింకపిల్లను తరుముతూ తెడ్డువేసి బయలుదేరాం. అయితే మేం నడి ప్రవాహం చేరేసరికి, పడవ మా అధీ నంలో ఉండక, గాలికీ ప్రవాహానికీ కొట్టుకుపోసాగింది. చీకటికూడా ముంచు కొచ్చింది. వెనక్కు తిరిగివచ్చే సామ ర్థ్యంకూడా లేక మేం ప్రవాహం వెంబడి అతి వేగంగా కొట్టుకుపోయాం. ప్రవాహం దారిలో ఏ రాయికో తగిలి మా పడవ పగిలిపోతుందన్న భయం మాకు కలిగింది.

మర్నాడు పగలూ, రాత్రీకూడా అలాగే కొట్టుకుపోయాం. ప్రమాదం మటుకు జరగలేదు. మర్నాడు సాయం కాలానికిగాని మా పడవ తీరానికి కొట్టుకు రాలేదు. అప్పుడు మేం మళ్ళీ ఒడ్డు చేరాం.

ఈ లోపల మా తండ్రి, మేం గుర్రా లకు కాపలా ఉంచిన సేవకుడిద్వారా, మేం నదిలో కొట్టుకుపోయిన వార్త తెలుసుకున్నాడు. ఆయన నా కోసం ఎంతో విలపించి, మమ్మల్ని వెతకటానికి మనుషులను పంపాడు. మా అమ్మకు కలిగిన దుఃఖం ఇంతా అంతాకాదు. ఆమె నేను పోయినట్టే భావించి, మైల దుస్తులు ధరించింది.

మేం ఒడ్డుకు చేరినాక, ఒక చక్కని సెలయేరు చూశాం. అది చెట్లమధ్యగా ప్రవహిస్తున్నది. ఒక మనిషి నీటిలో కాళ్ళు పెట్టుకుని కూర్చుని ఉన్నాడు. మేం అతన్ని పలకరించి, మేం ఉన్న ప్రదేశం ఏదని అడిగాం. అతను మాకు జవాబుగా గ్రద్ద అరిచినట్టు కీచుగా అరిచి, చివాల్న లేచి, నడుము దగ్గిర రెండుగా

చీలాడు. అతని శరీరంలో పైభాగం మా మీదికి వచ్చింది, కిందిభాగం ఇంకో వైపు వెళ్ళింది

వెంటనే అరణ్యం అన్ని దిక్కుల నుంచీ అతనిలాంటివాళ్ళే పరిగెత్తు కుంటూ వచ్చి, సెలయేటిని చేరుకుని, రెండుగా చీలి. పై భాగాలతో మా మీదికి వేగంగా వచ్చారు. వాళ్ళు తమకు అందిన ముగ్గురు మనుషులను, నా సేవకులను, పట్టుకుని, అలాగే తినెయ్యసాగారు.

నేనూ, నా మిగిలిన ముగ్గురు సేవకులూ, తారెత్తి పడవలోకి దూకి, ఒడ్డు నుంచి తోసి, ప్రవాహంలో పడ్డాం. ఆ మనుషుల చేతిలో చావటంకన్న ప్రవాహంలో మునిగి చావటం చాలా మేలనిపించింది. వాళ్ళ పై భాగాలు తినటంలో నిమగ్నమైఉండే వాళ్ళ కాళ్లు మమ్మల్ని అందుకోవటానికి తీరం వెంబడి పరిగెత్తుకు రావటం కనిపించింది. మేం పూర్తిగా అందకుండా పోయినదాకా ఆ కాళ్ళు అలాగే పరిగెత్తాయి.

పోయిన మా మనుషులకోసం మేం విచారించి, ఆ మనుషులు అలా చావటం గురించి ఆశ్చర్యపోయాం.

మర్నాడు ఉదయం మళ్ళీ మేం ఒడ్డు పట్టాం. ఆ చిన్న ప్రాంతం ఫలవృక్షాలతోనూ, పుష్ప వృక్షాలతోనూ ఆహ్లాదకరంగా ఉన్నది. నాను ఒడ్డుకు పోబుద్ధి గాక, నా ముగ్గురు సేవకులను పంపాను. వాళ్ళు మధ్యాహ్నందాకా తిరిగివచ్చి, ప్రమాదం ఏమీ లేనట్టు చెప్పారు. వాళ్లకు ఒక చలవరాతి భవనం కనిపించింది. దానిమధ్య ఒక తోటా, ఆ తోటమధ్య ఒక కొలనూ ఉన్నాయి. వాళ్ళు ఆ భవనంలో ప్రవేశించి, ఒక విశాలమైన మహలూ, అందులో దంతపు కుర్చీలూ ఉన్నాయి. ఆ కుర్చీలమధ్య ఒక బంగారు సింహాసనం, రత్నాలు పొదిగినది ఉన్నది. కాని వాళ్ళకు ఎక్కడా మనిషి పొడ కనిపించలేదు.

ఈ కబురు విన్నాక నేను పడవదిగి, బయలుదేరాను. దారిలో చెట్లనుంచి పండిన పళ్ళు కోసుకుతిని ఆకలి తీర్చుకున్నాం. తరవాత విశ్రాంతికోసం భవనంలో ప్రవేశించాం. నేను సింహాసనంమీద కూర్చున్నాను నా సేవకులు దంతపు కుర్చీలలో కూర్చున్నారు. ఆ సమయంలో నాకు నా తల్లిదండ్రులు జ్ఞాపకంవచ్చి ఏడుపొచ్చింది. నాతోబాటు నా సేవకులూ ఏడ్చారు.

ఇంతలో మాకు గొప్ప సముద్ర ఘోష లాంటిది వినిపించింది. రాజ దర్బారులోకి మంత్రి సామంతాదులు ప్రవేశించిన విధంగా ఒక పెద్ద మంద ప్రవేశించింది. అయితే అవి అన్నీ వానరాలు చిన్నవీ, పెద్దవీ కలిసి అవి చాలా పెద్ద సంఖ్యలో ఉన్నాయి. ఈ సారి మాకు చావు తప్పదనుకున్నాం. కాని అన్నిటిలోకీ పెద్ద వానరుడైన వజీరు నన్ను సమీపించి, ఎంతో మర్యాదగా తలవంచి, మనుష్య



భాషలో, నన్ను తానూ, తన ప్రజలూ రాజుగా భావిస్తున్నట్టూ, నా సేవకులను తమ సేనానులుగా స్వీకరిస్తున్నట్టూ చెప్పాడు. అతను మాకు జింకపిల్లల మాంసంతో విందుచేసి, తమ వానర సైన్యాన్ని తణిఖీ చెయ్యమనీ, వారంతా తమ పొరుగునఉన్న శత్రువులైన పిశాచాలమీద యుద్ధానికి సిద్ధంగా ఉన్నారనీ చెప్పాడు.

తెగ అలిసిఉండటంచేత నేను వజీరునూ ఇతర వానరులనూ పంపేశాను. తర్వాత నేనూ, నా సేవకులూ ఒక గంటసేపు చర్చించుకుని, ఆ ప్రదేశాన్ని సాధ్యమైనంత త్వరగా వదిలి వెళ్ళిపోవటానికి నిశ్చయించాం. అయితే మేం నదివద్దకు వెళ్ళేసరికి అక్కడ మాపడవలేదు. అందుచేత మేం భవనానికి తిరిగి రావలసి వచ్చింది. అక్కడ ఆ రాత్రి పడుకుని నిద్రపోయాం

నేను నిద్రలేచేసరికి వజీరు వానరుడు వచ్చి వందనంచేసి, పిశాచాలమీద యుద్ధానికి బయలుదేరటానికి సర్వసన్నాహాలు జరిగినట్టు చెప్పాడు. నేనూ, నా సేవకులూ సవారీ చెయ్యటానికి నాలుగు పెద్దకుక్కలను తెచ్చారు. మేం విధిలేక ఆ కుక్కలమీద సవారీ అయి, ముందు బయలుదేరాం. మా వెనకగా వజీరూ, తదితరులూ వస్తూ, మహా భయంకరంగా అరిచారు.

మా దండయాత్ర ఒక పగలూ, ఒక రాత్రీ సాగినాక ఒక ఎత్తయిన నల్లకొండ వచ్చింది. దాని చరియలలో పిశాచాల నివాసాలున్నాయి త్వరలోనే పిశాచాలు ప్రత్యక్షమయ్యారు. వాళ్ళలో చాలా రకాలున్నారు ఒక రకంకన్న మరొక రకం మరింత అసహ్యంగా ఉన్నది. కొందరికి ఎద్దు తలలూ, ఒంటె శరీరాలూ ఉన్నాయి. కొందరు దుమ్ములగొండ్లలాగా ఉన్నారు. మరికొందరు దేని లాగానూ లేరు.

పిశాచాలు మమ్మల్ని చూడగానే గబ గబా కొండ దిగి వచ్చి, మా మీద రాళ్లు విసరసాగారు. నా అనుచరులు ఆ రాళ్ళనే తిప్పికొట్టారు. త్వరలోనే యుద్ధం దారుణంగా పరిణమించింది. నేనూ నా సేవకులూ బాణాలతో చాలా మంది పిశాచాలను చంపి, నా అనుచరులకు ఎంతో ఆనందం కలిగించాం. చివరకు జయం మాదే అయింది. మేం పారిపోతున్న పిశాచాలను తరిమి కొట్టాం

ఈ కోలాహలంలో నేనూ, నా అనుచరులూ, వానరులనుంచి తప్పించుకుపోవ నిశ్చయించుకుని, వేగంగా కుక్కలను వెనక్కు తిప్పి, రెండు సేనలనూ వదిలించుకున్నాం.

చాలా సేపు సవారీ చేసినమీదట, కుక్కలకు అలుపు తీరటానికి ఒకచోట ఆగాం. అక్కడ ఒక నున్నటి రాతిమీద హీబ్రూ భాషలో ఇలా రాసి ఉన్నది.

"విధివశాన వానరులకు రాజువైన ఓ బందీ! ఈ రాజరికం నుంచి తప్పించుకు పారిపోవటానికి రెండు దారులున్నవి. కుడివైపునగల దగ్గరదారి భూమిని చుట్టి ఉండే సముద్రం వద్దకు నిన్ను చేర్చుతుంది. అయితే ఆ దారిలో క్రూరమైన రాక్షసులతో నిండిన ఎడారులున్నవి. ఎడమ వైపున గల దారి నడవటానికి నాలుగు మాసాలు పట్టుతుంది. అది చీమలలోయ అనే గొప్ప లోయకుండా పోతుంది. ఈ దారినవెళ్ళి చీమల బారిన పడకుండా తప్పించుకున్నట్లయితే నువు ఒక అగ్ని పర్వతాన్ని చేరుకుంటావు. దాని దిగువన యూదుల నగరం ఉన్నది. నీ విమోచన కొరకు నేను, సులేమాన్, ఇబన్ దావూద్‌ను ఈ మాటలు రాశాను."

అమిత ఆశ్చర్యంతో ఈ మాటలు చదివిన మీదట, మేం ఎడమవైపున గల దారి పట్టుకుని, చీమల లోయకుండా యూదుల నగరం చేరటానికి బయలుదేరాం.

మేం ఒక్క రోజు ప్రయాణంచేశామో లేదో, భూమి అదరసాగింది. త్వరలోనే నా వానర ప్రజను వెంటేసుకుని వజీరు వానరుడు అతివేగంగా వస్తూ ఉండటం కనబడింది. వాళ్ళు మా చుట్టూమూగి మేము దొరికినామను ఆనందంతో పెడబొబ్బలు పెట్టారు. మేం క్షేమంగా ఉన్నందుకు అభినందిస్తూ వజీరు చిన్న ఉపన్యాసం చేశాడు.

మాకు చాలా చిరాకు వేసింది. కాని మేం దాన్ని పైకి కనబడనీయకుండా వెనక్కు తిరిగి వానరులతో వెళ్ళిపోవడానికి సిద్ధమవుతూండగా, లోయ అవతలి చివరనుంచి ఒక పెద్ద చీమల సేన వచ్చిపడింది. ఒకొక్క చీమా ఒక కుక్క ప్రమాణంలో ఉన్నది.

రెప్పపాటులో చీమలకూ, వానరులకూ భయంకరమైన పోరాటం సాగింది. చీమలు వానరులను తమ గిట్టల మధ్య

పట్టుకుని ఒక్క దెబ్బతో రెండేసి ముక్కలు చేస్తూంటే, పదేసి,పదేసి వాన రాలు ఒక్కొక్క చీమమీద పడి, దాని కీళ్ళు ఊడగొట్టాయి.

ఈ దొమ్మి చాటున మేం మా కుక్కల మీద పారిపోదామనుకున్నాంగాని, నా ముగ్గురు సేవకులూ చీమల కంటపడి వాటిచేత కత్తిరించబడినందున, నేను ఒక్కణ్ణి మాత్రమే తప్పించుకోగలిగాను. నా అనుచరులు పోయినందుకు విచారిస్తూ, నేనొక నదిని చేరుకుని, అక్కడ కుక్కను వదిలేసి, ఈదుతూ నది దాటి అవతలికి చేరాను. మధ్య నది ఉండటంచేత నన్ను వానరులుగాని చీమలుగాని వెంటాడే ప్రమాదం లేదు గనక, నేను నా బట్టలు ఆరేసి. గాఢమైన నిద్రలో మునిగిపోయాను.

తిరిగి నిద్రలేచి, నేను రోజుల తరబడి నడిచి, దారిలో ఆకులూ, అలములూ తిన్నాను. చిట్టచివరకు అగ్నిపర్వతం చేరుకున్నాను. దాని దిగువన యూదుల నగరం ఉన్నది. అంతా రాతి పలకమీద రాసినట్టే ఉన్నదిగాని, ఒక వింత విషయం ఆ పలకమీద రాసి లేదు. అది నాకు చాలా ఆశ్చర్యం కలిగించింది. అదేమిటంటే, నేను ఒక నీరులేని నదిని కాలినడకన దాటాను. కాని మిగిలిన వారమంతా పూటుగా పారుతూ కనిపించింది. యూదులకు పర్వదినమైన శనివారంనాడు ఆ నది ఎండిపోతుందని నాకు తరవాత తెలియవచ్చింది.

నగరంలోకి ప్రవేశించాను. కాని, వీధులలో ఎవరూ లేరు. అందుచేత, కనిపించిన ఒక ఇంట్లో ప్రవేశించాను. ఒక హాలులో అనేకమంది పూజనీయులు వలయంగా కూర్చుని ఉన్నారు. వారిని చూసి ధైర్యం తెచ్చుకుని, వారిని సమీపించి వినయంగా వందనంచేసి "నా పేరు జాన్‌షా. కాబుల్. బనూషాహ్లాన్‌లను ఏలే తీఘ్‌మూస్ రాజు కొడుకును. నా దేశం ఇక్కడికి ఎంతదూరంలో ఉన్నదో నేను ఏ దారిన అక్కడికి చేరగలనో దయఉంచి తెలుపగలరా. నేను చాలా ఆకలిగొని ఉన్నాను కూడా," అన్నాను.

కూర్చుని ఉన్న పెద్దలు నాకేసి చూశారుగాని, జవాబు చెప్పలేదు. వారిలో ముఖ్యుడులాగ కనిపించినవాడు సంజ్ఞలతో "తిను, తాగు, కాని మాట్లాడకు. అని తెలియజెప్పాడు. ఆయన నాకొక పాత్ర చూపాడు. అందులోని కూరలు వాసననుబట్టి నేనెన్నడూ ఎరుగనివిగా తోచాయి. నేను తిని, తాగి మౌనంగా ఉండిపోయాను.

నా పని ముగియగానే ఆ యూదుల నాయకుడే నన్ను సమీపించి, సంజ్ఞలతోనే, "ఎవరవు? ఎక్కడినుంచి? ఎక్కడికి?" అని అడిగాడు.

జవాబు చెప్పవచ్చునా అని సంజ్ఞల

తోనే అడిగాను. మూడే మాటలు మాట్లాడమని ఆయన సంజ్ఞచేశాడు.

"బిడారు కాబుల్. ఎప్పుడు?" అని అడిగాను.

"తెలీదు," అని సంజ్ఞచేసి, ఆయన నన్ను వెళ్ళిపొమ్మన్నట్టు చెయ్యి ఊపాడు.

నేను ఆయనకూ మిగిలినవాళ్ళకూ వందనంచేసి ఈ వింత ఆచారాన్ని గురించి ఆశ్చర్యపడుతూ, వీధిలోకి వచ్చాను. వీధిలో నాకు ఎవరైనా తటస్థపడి సహాయం చేస్తారా అని చూశాను. ఆ సమయంలో చాటింపుచేసేవాడు ఇలా అరవటం నాకు వినిపించింది.

"వెయ్యి బంగారు దీనారాలనూ, అప్సరసలాటి భార్యనూ సంపాదించుకోగోరేవాడు నా వెంటవచ్చి, ఒక గంటపాటు పనిచెయ్యాలి?"

బొత్తిగా నిస్సహాయస్థితిలో ఉన్నవాణ్ణి కావటంచేత నేను ఆ మనిషిని సమీపించి, "ఆ పనికీ, వెయ్యి దీనారాలకూ, అప్సరసలాటి భార్యకూ నేను ఒప్పుకుంటున్నాను," అన్నాను.

ఆ మనిషి నన్ను చెయ్యిపట్టుకుని ఒక సంపన్నగృహానికి తీసుకుపోయాడు. అక్కడ ఒక ముసలి యూదువాడున్నాడు చాటింపువేసినవాడు ఆయనకు వందనంచేసి "మూడు నెలలుగా చాటింపువేస్తుంటే ఇప్పటికి ఇతను ఒక్కడే జవాబు పలికాడు," అన్నాడు.

ఆ మాట విని వృద్ధుడు ఆదరంతో నన్ను తనసరసన కూర్చోబెట్టుకుని, నాకు చక్కని విందు భోజనం పెట్టించాడు. నా భోజనం పూర్తికాగానే అయన నాకు వెయ్యి బంగారు దీనారాల సంచీ ఇచ్చి నాకు పట్టుబట్టకప్పి తన భార్యద్వారా నన్ను సుందరివద్దకు పంపాడు. నేను చేయబోయే పనికి ముందుగానే నాకు ఆమెను ఆయన ప్రతిఫలంగా ఇచ్చేశాడు.

నేను ఆమె ఉన్న గదికి వెళ్ళి ఆమెతో రాత్రి అంతా గడిపి, ముసలాయన అన్నట్టుగానే ఆమె ఇంకా కన్యగానే ఉన్న సంగతి తెలుసుకున్నాను. ఆమెతో మూడురోజులు గడిపాను. నాలుగోనాడు ఉదయం అయన నన్ను పిలవనంపి, "నువ్వు చెయ్యవలసినపని చెయ్యటానికి సిద్ధంగా ఉన్నావా?" అని అడిగాడు.

ఆ పని ఏమిటో నాకింకా తెలియక పోయినప్పటికీ, సిద్ధంగానే ఉన్నాననక తప్పిందికాదు ముసలాయన తన బానిసలచేత రెండు జీనువేసిన కంచర గాడిదలను తెప్పించాడు. ఇద్దరమూ చెరొకటి ఎక్కి, వేగంగా ప్రయాణం చేసి ఒక కొండ దిగువకు చేరుకున్నాం ఆ కొండమీదికి ఎక్కటానికి ఎలాటి దారీ లేదు.

మేం దిగగానే ముసలాయన నా చేతికి ఒక కత్తి ఇచ్చి, "పని ప్రారంభించాలి.

దీన్ని నీ కంచరగాడిద డొక్కలో పొడు," అన్నాడు.

నేను కత్తిని డొక్కలో పొడవగానే కంచరగాడిద చచ్చిపోయింది. ఆయన అడిగిన మీదట నేను దాని చర్మం ఒలిచి కొంతవరకు శుభ్రంచేశాను.

తరవాత నన్ను ఆ చర్మంమీద పడుకోమని, ఆయన నన్ను అందులో కప్పికుట్టేసి, "విను. త్వరలోనే నిన్నొక పెద్ద పక్షి పట్టుకపోయి, ఈ కొండ మీద ఉండే తన గూట్లో పెట్టుతుంది. అది నిన్ను పైకి తీసుకుపోయేటప్పుడు తన్నుకోకు, తన్నుకుంటే అది నిన్ను వదిలేస్తుంది., నువు కిందపడి నుజ్జు నుజ్జు అయిపోగలవు. కాని అది నిన్ను పైకితీసుకొనిపోయి గూట్లో పెట్టిన తరవాత నువు నీ కత్తితో చర్మాన్ని కోసేసి బయటికి వచ్చెయ్యి పక్షి భయపడి నీ జోలికి రాదు. అప్పుడు నువ్వు చెయ్యవలసిందల్లా ఏమిటంటే కొండపైన ఉండే వజ్రాలను కిందవేసి, తరవాత నువ్వు దిగి వచ్చెయ్యి." అన్నాడు.

ముసలాయన మాట్లాడడం పూర్తి చేశాడో లేదో నేను గాలిలో తేలిపోతున్నట్లు గ్రహించాను. కొద్ది క్షణాల అనంతరం నేను నేలను తాకినట్టు తెలిసింది. కత్తితో చర్మాన్ని చీల్చి, తల బయటికి పెట్టి చూశాను. నన్ను చూసి భయపడి ఒక బ్రహ్మాండమైన పక్షి అతివేగంగా ఎగిరిపోయింది.

నేను వెంటనే ఉపక్రమించి, కొండ మీద చెదిరిపడి ఉన్న పచ్చలనూ, కెంపులనూ, ఇతర మణులనూ ఏరి, కొండ కింద ఉన్న ముసలాయనకు పారేశాను. కాని నేను దిగిపోదామనుకునేసరికి నాకు ఎక్కడా కాలుమోపేచోటు కనిపించలేదు. దానికోసం నేను వెతుకుతుండగానే ముసలివాడు తన కంచరగాడిదమీద రత్నాలతోసహా వేగంగా పోతూ కనిపించాడు.

హతాశుణ్ణి అయిపోయి, నా ప్రారబ్ధానికి విలపిస్తూ ఆ కొండమీదనే ముక్కుసూటిగా రెండు నెలలపాటు ప్రయాణం చేసి అల్లా కటాక్షంవల్ల ఆ పర్వతపంక్తి చివర ఉన్న ఒక లోయ చేరాను. చెట్లతోనూ, సెలయేళ్ళతోనూ అసంఖ్యాకమైన పక్షులతోనూ ఆ లోయ ఎంతో అద్భుతంగా ఉన్నది. ఆ లోయలో అమిత ఎత్తుగా ఉన్న భవనం ఒకటి కనిపించింది. నేను దానికేసి వెళ్ళాను

దాని ద్వారంలో ఒక బల్లమీద ఒక వృద్ధుడు కూర్చుని ఉన్నాడు. ఆయన ముఖం కాంతివంతంగా ప్రకాశిస్తున్నది. ఆయన చేతిలో కెంపుతో చేసిన రాజదండమూ, నెత్తిన వజ్ర కిరీటమూ ఉన్నాయి. నేను ఆయన ముందు బాగా వంగి ప్రణామం చేశాను

ఆయన నన్ను చాలా దయతో పలకరించి, "నా పక్కన కూర్చో బాబూ," అన్నాడు.

నేను కూర్చున్నాక ఆయన నన్ను "ఎన్నడూ మనుష్యమాత్రుడు అడుగు పెట్టని ఈ ప్రదేశానికి ఎక్కడినుంచి వచ్చావు? నీ ప్రయాణం ఎక్కడికి?" అని అడిగాడు.

ఆయన ప్రశ్నలకు జవాబుగా నేను వెక్కుతూ ఏడ్చాను.

"అలా ఏడవకు, నాయనా, నేను సహించలేను. ధైర్యంగా ఉండు నువ్వే నాకిప్పుడేమీ చెప్పకు. ముందు ఆహార పానీయాలు తీసుకో," అన్నాడాయన.

ఆయన నన్ను లోపల చాలా ఎత్తున్న హాలులోకి తీసుకుపోయి. నేను కాస్త కుదుటపడినదాకా తినిపించి, తరవాత నా కథ చెప్పమన్నాడు. నేను నా కథ అంతా ఆయనకు చెప్పి, ఆ భవనం ఎవరిదని అడిగాను.

"బాబూ ఈ భవనాన్నే ప్రాచీన కాలంలో మా యజమాని సులేమాన్ గారు కట్టించారు. నేనాయన పక్షులకు రక్షకుణ్ణి. ప్రతియేడూ ప్రపంచంలోఉండే పక్షులన్నీ వచ్చి నన్ను సేవించిపోతాయి నీవు నీ దేశానికి తిరిగి పోగోరితే, ముందు వచ్చే పక్షులద్వారా నిన్ను నీ ఇష్టం వచ్చిన చోటికి చేర్పిస్తాను. అవి వచ్చే దాకా నువు ఈ భవనంలో యథేచ్ఛగా తిరగవచ్చు. నీకు అన్ని గదుల తాళపు చెవులుగల గుత్తి ఇస్తాను. ఐతే బంగారు తాళపుచెవితో తెరిచే గదిమాత్రం ప్రవేశించకు," అని హెచ్చరించి, ఆయన నాకు తాళపుచెవుల గుత్తి ఇచ్చి, నన్ను ఇష్టం వచ్చినట్టు తిరగమని పంపేశాడు.

నేను మొట్టమొదట ముందుపక్క ఉండే గదులన్నీ తిరిగాను తరవాత లోపలి గదులు చూశాను. అవి అన్నీ పక్షులు నివసించటానికి అనుకూలంగా అమర్చి ఉన్నాయి. చిట్టచివరకు నేను బంగారు తాళపు చెవితో తెరుచుకునే గదివద్దకు వచ్చి, చాలాసేపు నిలబడ్డాను. వృద్ధుడు హెచ్చరించి ఉండటంచేత తలుపుమీద చెయ్యివెయ్యటానికి కూడా నాకు ధైర్యం చాలలేదు.

అయితే చిట్టచివరకు ఉత్కంఠ జయించింది. నేను బంగారు తాళపు చెవితో తలుపు తెరచి, లోపల ఏము న్నదో చూడటానికి పోరాని ఆ గదిలోకి వెళ్ళాను.

అందులో నాకు భయానక దృశ్యం ఏదీ ఎదురుకాకపోగా, రంగురంగుల రత్నాలు పరిచిన నేల మధ్య వెండితో చేసిన జలయంత్రపు తొట్టి ఉన్నది. దాని చుట్టూ బంగారు పక్షులున్నాయి. వాటి ముక్కుల నుంచి జలధారలు తొట్టిలో పడుతూ శ్రావ్యమైన ధ్వనులు చేస్తు న్నాయి. ఆ పక్షులు నిజమైనవే అయి ఉంటే అవి ఎలాటి ధ్వనులు చేస్తాయో అలాటి ధ్వనులే వినిపిస్తున్నాయి.

జలయంత్రం చుట్టూ అమిత అందంగా ఉన్న రంగురంగుల పూల తివాసీ లున్నాయి. అవి సువాసనలు వెదజల్లు



తున్నాయి. జలయంత్రానికి నీడనిస్తూ ఫలవృక్షాలున్నాయి. కాలికింద మెత్తగా తగులుతున్న ఇసుక వజ్రపుపొడి. అది బాటలాగా ఒక సింహాసనం వద్ద వరకు పరచుకుని ఉన్నది. ఈ సింహాసనాన్ని ఒకే కెంపు శిలనుంచి మలిచారు. దానినుంచి వెలువడే రక్త కాంతులు తోటకుండా నీటిమీదికి ప్రసరిస్తున్నాయి.

ఈ సౌందర్యమయ ప్రదేశాన్ని పారవశ్యంతో తిలకించి, ఎర్రపట్టు చాందినీ గల సింహాసనంమీద కూర్చుని, ఈ దృశ్యాన్ని జీర్ణించుకోవటానికి కళ్ళు మూసుకున్నాను. నేను తిరిగి కళ్ళు తెరిచేసరికి మూడు పావురాలు తొట్టిలో స్నానం చెయ్యటానికి వస్తూ కనిపించాయి. అవి మనోహరంగా తొట్టె అంచు మీద వాలి. పరస్పరం ఆలింగనం చేసుకుని, రకరకాలుగా ముద్దులాడి, చివరకు తమ రెక్కల తొడుగులను విసర్జించి, అద్భుతసౌందర్యంగల నగ్నరూపంతో బయటికివచ్చి, నా కళ్ళకు దిగ్భ్రమ కలిగించాయి. వాళ్ళు ముగ్గురూ నీటిలో దూకి మునుగుతూ, తేలుతూ, కిలకిలా నవ్వుతూ జలక్రీడలాడసాగారు.

అన్నా బులూకియా! ఇదిచూసి నాకు పూర్తిగా మతిపోయింది. నేను పట్టలేక నీటి తొట్టికేసి పరిగెత్తుతూ, "ఓ కన్యలారా! ఓ చంద్రబింబాల్లారా! ఓ రాణుల్లారా!" అని కేకలు పెట్టాను

ఆ కన్యలు నన్ను చూడగానే భయంతో కెవ్వున అరిచి, చప్పున నీటిలోంచి పైకి వచ్చి. తమ రెక్కల తొడుగులతో తమ నగ్నత్వాన్ని దాచుకుని, జలయంత్రానికి ఎగువన ఉండే చెట్టుకొమ్మల మీదికి ఎగిరి కూర్చుని, నన్ను చూసి నవ్వసాగారు.

ఇంతలో తెల్లవారేసరికి షాహర్ జాద్ కథ చెప్పటం నిలిపేసింది.

[సశేషం]




శంకరనారాయణ, బరువుగా ఓ నిట్టూర్పు విడిచాడు.

"బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రా అరుణా: నీ శ్రేయస్సు కాంక్షించే వాణ్ణి గాబట్టి యింతగా చెబుతున్నాను ఈ వివాహానికి అంగీకరించు. చదువు తక్కువే అయినా, రాజారావు సలక్షణమైన ఉద్యోగం చేసుకుంటున్నాడు స్వంత కొంప వుంది. నాలుగురాళ్లు వెనకేసు కుంటున్నాడు. నీకు ఏలోటూ రాకుండా చూచుకోగల సహృదయుడు" అన్నాడు అరుణ వివాహానికి ఒప్పించే ప్రయత్నంచేస్తూ.

అరుణ మొహం పాలిపోయింది. రాజా రావు చదువు సంధ్యల గురించి ఆమె చూచాయగ వింది థర్డ్‌ఫారమ్ వరకు చదివి మానేసినట్టు ఆమెకి తెలిసింది. అందుకనే ఆతనంటే అంతగా ఆసక్తి కనబరచటంలేదు.

"మావయ్యా, బి. ఏ. చదివిన నేను థర్డుఫారమ్ వరకూ చదివిన వ్యక్తిని పెళ్ళిచేసుకోవడంలో యెంత సుఖం వుంటుందో, మీరే యోచించండి. నాకూ ఏవేవో ఆశయాలుంటాయి. కోరిక లుంటాయి. వాటిని చంపుకుని, జీవితాన్ని దుర్భరం చేసుకోలేను కదా మావయ్యా. నేను మీ కూతుర్నే అయితే మీరు యిట్లాంటి సలహా యిచ్చి వుండే వారు కాదేమో." నీరసంగా, నిస్పృహతో అంది అరుణ. తన నిరాకరణ స్పష్టంగా మావయ్యకి తెలియజేసినా, అయన యింకా తనని ఒప్పించాలని ప్రయత్నిస్తున్న మేనమామతో చివరి జవాబుగా యిలా అనక తప్పిందికాదు అరుణకి.

శంకరనారాయణ నివ్వెరపోయాడు. అరుణ తనని ఆ విధంగా అంత కటువుగా నిందిస్తుందని, యెప్పుడూ ఊహించలేదతను. అరుణ తనకి స్వయానా మేన కోడలే అయినా, తల్లీ దండ్రీ లేని పిల్లని యెంతో ఆదరంతో పెంచాడు. బి ఏ. చదివించాడు. బహుశా అంతవరకూ చదివించడమే తను చేసిన పెద్ద పొరపాటని యిప్పుడనుకున్నాడు కాని, యేంలాభం? చేతులు కాలాక ఆకులు పట్టుకున్నా, ప్రయోజనం శూన్యం... పొడిగా నవ్వేడు.

"ఎంతమాట అనేశావమ్మా అరుణా, నేను, నిన్నెంత వాత్సల్యంతో, ఆదరాభిమానాలతో పెంచానో నీకు మాత్రం తెలీదా? ఈ పరిస్థితుల్లో నా స్వంత కూతురైతే మాత్రం నేను చెయ్యగలిగిందేమిటిచెప్పు? రోజులు అలా మారి పోయినై అమ్మా. నీ వివాహం నిర్ణయించాలని నేనెన్ని సంబంధాలు చూచానో లెక్కలేదు. కనీసం బి ఏ. చదువుకున్న వరుణ్ణి చూస్తే పదివేల కట్నానికి కిందికి దిగిరావడంలేదు. అటువంటి సంబంధం యేదేనా నిశ్చయించాలంటే నాకు ఆర్థిక స్తోమత లేదు. అందుకనే యిప్పుడీ సంబంధం అన్నివిధాలా అనువుగా తోచింది గాబట్టే, నిశ్చయించా లనుకుంటున్నానమ్మా. కేవలం చదువేకాదు ప్రధాన విషయం. బాగా చదువుకున్న నిరుద్యోగిని పెళ్ళిచేసుకుంటే మాత్రం ప్రయోజనం యేమిటి చెప్పు. కుటుంబాన్ని పోషించగలిగే స్తోమత వుండాలిగా అందుకేనమ్మా యీ నా తాపత్రయం అంతాను." అన్నాడు ఆవేదనా భరితంగా.

అరుణకి, మేనమామ వాదన యేదీ నచ్చలేదు.

"అలాగయితే, ఓ కిళ్ళీకొట్టువాడికి కట్టబెట్టండి మావయ్యా. అతడూ నన్ను

పోషించగల స్తోమత వున్నవాడేగా !" అంది విసురుగా.

శంకరనారాయణకి వున్నపాటున కోపం ముంచుకొచ్చింది. అరుణ వితండ వాదం అతనికి హేళనగా అగుపించింది. అందుకే ఆ కోపం—అయితేనేం—యిన్నాళ్ళూ సహనం వహించిన తాను, యిప్పుడు తొందరపడకూడదనుకుని ప్రయత్నంమీద తమాయించుకున్నాడు. బరువుగా ఓ నిట్టూర్పు విడిచాడు.

నీకు పెళ్ళి చేసేస్తే, నా బాధ్యత పూర్తిగా తీరుతుందని ఆశించానమ్మా ! కాని నా ఆశ ఫలించే యోగంలేదు. ఏంచెయ్యను ? అది నా దురదృష్టం ఒక్క విషయం మాత్రం గుర్తుంచుకో అరుణా. నీకు ఇష్టంలేని పెళ్ళి నేనెప్పుడూ చెయ్యనమ్మా. నేనంత కర్కోటకుణ్ణి కాను." అని చెప్తూ బయటికి నడిచాడు. ఆ మాటలంటున్నప్పుడు అతని గొంతు బొంగురుపోయింది.

అరుణ నిస్పృహతో మంచంమీద కూలబడింది. మొదలు తెగిన వృక్షంలా, ఏమిటి తన జీవితానికి అర్థం? ముందు ముందు యేంజరగనున్నది? ఈ ప్రశ్నలు ఆమె ముందు వికృతంగా నాట్యం చేశాయి. మావయ్య చెప్పిందాంట్లో అసత్యంలేదు! ఈ రోజుల్లో ఆడపిల్లల పెళ్ళిళ్లు జరగడం యెంతో గడ్డు సమస్యగా తయారయిందో, చూస్తూనే వుంది తను అలాగని తనకంటే బాగా తక్కువ చదువుకున్న వ్యక్తిని యెట్లా పెళ్ళాడుతుంది తను? కాని...కాని ... యింకె న్నాళ్ళు మావయ్యకి బరువుగా వుంటుంది. అయితే, ఇప్పుడేం చెయ్యడం? ఆలోచించింది యెంతో లోతుగా. ఆమెకి ఒక్కటే మార్గం అగుపించింది. తన గురించి మావయ్య ఆలోచనల్ని పెంచుకోకుండా వుండాలంటే, తను యెక్కడికైనా వెళ్ళిపోవాలి కాని, ఎక్కడికి పోతుంది. ఆమెకు స్నేహితురాలు వేదవతి గుర్తుకొచ్చింది. వేదవతి విశాఖపట్నంలో నర్సుగా వుంటోంది. కాని, ఆమె అడ్రస్ తెలీదే...ఆ ఊరు వెళ్ళాక యెట్లాగయినా ఆమె వునికి తెలుసుకోవచ్చు ...అన్న నిర్ణయానికి వచ్చింది అరుణ.

* * *

మరునాడు తెల్లారేసరికి అరుణ ఇంట్లో అగుపించకపోవడంతో, శంకరనారాయణ కంగారు పడ్డాడు. స్వంత కూతురు కాపోయినా, స్వంత మేనకోడలు అందునా, పెంచిన ప్రేమ ఒకాటి పట్టిలాగుతూనే వుంది. ఆమె మంచం తలగడ క్రింద వుత్తరం దొరికింది, చదివాడు.

పూజ్యులైన మావయ్యకి,

నమస్కారం,

నేనేం ఆత్మహత్యం చేసుకోడానికి బైలుదేరలేదు. నాన్నా, అమ్మా పోయాక మీరే నన్ను చేరదీసి, యింత దాన్ని చేశారు. ఇంకా మీకు నేను యెంత




కాలం బరువుగా వుంటాను, చెప్పండి. నా వివాహ సమస్య యిప్పుడో పెద్ద సమస్య అయింది. కనీసం నాలానే ఓ గ్రాడ్యుయేట్‌ని పెళ్ళి చేసుకుంటానుకాని మరీ తక్కువ చదువుకున్నవాణ్ణి పెళ్ళి చేసుకోడానికి నా అంతరాత్మ అంగీకరించడంలేదు. ఈ విషయంలో, మీ మనస్సుకి కష్టం కలిగించినందుకు, నాలో నేను ఎంతగా కుమిలిపోతున్నానో ఆ భగవంతుడికే తెలుసు. మీకు, నా మొహం చూపించడానికే సిగ్గుగావుంది. అందుకనే నేను ఇంటినుంచి వెళ్ళిపోతున్నాను విశాఖపట్నంలో నాస్నేహితురాలుంది అక్కడికే పోతున్నాను. మీరేం కంగారుపడకండి నేనీ సాహసానికి ఒడిగట్టినందుకు, నన్ను క్షమిస్తారనే విశ్వసిస్తున్నాను. అత్తయ్యకి నా నమస్కారాలు పిల్లలకి దీవెనలు.

ఇట్లు—అరుణ"

ఆ వుత్తరం చదువుకుని నిర్విణ్ణుడైన శంకరనారాయణ, దీర్ఘంగా ఓ నిట్టూర్పు విడిచాడు "ఎంతపని చేశావమ్మా అరుణ..." అంటూ వాపోయాడు.

శంకరనారాయణ భార్య శాంతమ్మ కంట తడి పెట్టుకుంది.

"ఒంటరిగా వెళ్ళింది. ఎట్లా బ్రతుకగలదో ఈ పాడు ప్రపంచంలో...?" అంది, తోటి స్త్రీ గా సానుభూతి వ్యక్తపరుస్తూ. మొదట్నుంచీ కూడా, అరుణంటే ఆమెకి ఎప్పుడూ ద్వేషంలేదు.

*       *       *

స్టేషన్లో దిగిన అరుణ, లైట్ల కాంతిలో కొట్టొచ్చినట్టు అగుపిస్తోన్న గడియారం కేసి చూసింది. తొమ్మిది దాటింది ఆ రాత్రిపూట వేదవతికోసం యెక్కడ వెదుకుతుంది. ఈ సమస్యని ముందే ఆలోచించుకోకపోవడం, తన తప్పేననుకుంది. ఇప్పుడేం అనుకున్నా ప్రయోజనం లేదనుకొని ధైర్యాన్ని కూడదీసుకున్నదై, స్త్రీల వెయిటింగు రూంకేసి నడిచింది.

ప్లాట్‌ఫారమ్ నియాన్ లైట్ల కాంతిలో

మెరిసిపోతోంది ఆ దృశ్యానికి మరో కష్టమైతే ఆనందించేదే కాని, అప్పట్లో ఆమెకి ఆనందం రవ్వంతయినా కలుగ లేదు. ఏదో భయం చెప్పలేని ఆరాటం ఆమెని కదలించివేశాయి.

స్త్రీల వెయిటింగ్‌రూమ్ ఆయా పేరు నరసమ్మ, మధ్య వయస్కురాలు. వుద్యోగంలో చేరకముందు యెలా వుం డేదో గాని, ఇప్పుడు మాత్రం సీటుగా ముస్తాబై తన వయస్సుని మరుగు పెడదా మన్న ప్రయత్నం చేస్తున్నట్టనిపించేలా వుంది. ద్వారం దగ్గరే స్టూలుమీద కూచుంది. "ఈ రాత్రికి ఇక్కడే వుంటా నమ్మా!" అంది అరుణ, నరసమ్మతో.

నరసమ్మ, అరుణకేసి తదేకంగా చూసింది.

"టిక్కెట్టు వుందికదా?" అంది.

"వుంది..."

"అయితే సరే, లోపలికి వెళ్ళండి "

అరుణ లోపలికి అడుగుపెట్టి, సూట్ కేసు బల్లమీద పెట్టి, కుర్చీలో కూల బడింది, వుస్సురనుకుంటూ. ఆమెకి యెదురుగా, యింకెవరో స్త్రీ నిద్రపోతూ వుంది. ఒక ప్రక్క అరుణకి ఆకలి వేస్తోంది. ఏంచెయ్యాడమో, తోచలేదు. చేతిలో డబ్బయితే వుందిగాని యెక్కడికి వెళ్ళి తింటుంది? ముక్కూ మొహం తెలీని ఆ పట్నంలో, ఆ రాత్రిపూట బైటికి వెళ్ళడానికే భయమేసింది. అందుకనే, ఆకల్ని భరిస్తూనే, ఓపికపట్టి అలా వూరుకుంది.

పదిన్నర కావస్తోంది. అప్పుడే యేదో బండి వచ్చింది. నిద్రపోతోన్న స్త్రీని ఆయా లేపింది. "మీరెళ్లే బండొచ్చిం దమ్మగారూ.. లేవండి." అంటూ.

ఆ స్త్రీ చప్పున లేచి, బాత్‌రూమ్‌లోకి వెళ్ళి మొహం కడుక్కుని వచ్చి, సూట్ కేసు పట్టుకొని బైటికొచ్చింది. వెళ్తూ, ఆమె ఆయా చేతిలో చిల్లరడబ్బులు పెట్టి నట్టు అరుణ గమనించింది. ఆ వుద్యో గం బాగానే వున్నట్టనిపించిందామెకి ఆ క్షణంలో

వచ్చినబండి వెళ్ళిపోయింది. ప్లాటు ఫారమ్ నిశ్శబ్దంగావుంది, సుమారు. అక్కడక్కడా యెవరో ప్రయాణీకులు ప్లాటుఫారమ్ మీదే విశ్రాంతి తీసుకుంటు న్నారు కొందరు కబుర్లు చెప్పుకుంటు న్నారు

అరుణకి అలా ఒంటరిగా, మౌనంగా కూకోవడం, మరీ యిబ్బందిగా తోచింది. నరసమ్మ దగ్గరికి వెళ్ళింది.

"ఇంత పెద్ద స్టేషన్లో కూడా, వెయిటింగ్‌రూమ్‌లు ఖాళీగానే వుంటాయా యేవిటి?" ప్రశ్నించింది నరసమ్మను.

"అబ్బే ఎప్పుడూ ఖాళీగావుండవమ్మా ఒక్కోరోజు వుండడానికి వెయిటింగ్ రూమ్‌కి వచ్చినోళ్ళు, యే సినీమాకో పోతారు. అప్పుడు ఖాళీయేగా మరి! ఆళ్ళు రాత్రి ఒంటిగంట కొచ్చేస్తారు.

ఈ రోజూ అదే జరిగిందమ్మా! మీరేం కంగారుపడకండి. నేనున్నానుగా! ఈ వుద్యోగంలో నాకు పదిహేనేళ్ళ సార్వీసుంది. అన్నట్టు, మీ పేరేమిటమ్మా?" అడిగింది నరసమ్మ.

"అరుణ"

"భోజనం చేశారా! లేక యేమైనా తెచ్చిపెట్టమంటారా?''

ఆ ప్రశ్న ఆయానోటే రావడం, తన అదృష్టమే అనుకుంది. వెదక బోయిన తీగ కాళ్ళకి తగిలినట్టయ్యింది.

"మరేం వొద్దుగాని, ఓ గ్లాసుడు పాలు, ఓ బ్రెడ్డూ తెచ్చిపెడుదూ చాలు." అంటూ సూట్‌కేసు తెరిచి, అందులోంచి తీసిన పర్సునుండి ఓ రూపాయి అందించింది.

"ఇప్పుడే వొస్తానమ్మా," వెళ్ళింది చరచరా నరసమ్మ.

అరుణకి. ఒంటరిగా అక్కడుండటం మరీ భయంగావుంది. అప్పుడప్పుడూ యెవరో మగాళ్లు అలా వరండాలోంచి పోతూ, ఆమెకేసి అదోలా చూస్తూ వెళ్ళి పోతున్నారు. వారిలో ఇద్దరు ముగ్గురు టిక్కెట్టు కలెక్టర్లు కూడా వున్నట్టు గమనించింది, అరుణ.

అరుణకి, ముచ్చెమటలు పోసినయ్. ఏవిఁటీ వాతావరణం! ఈ రాత్రి తన కిక్కడ రక్షణ వుంటుందా/...అన్న ప్రశ్నలు ఆమె అంతరంగంలో వుద్భ వించాయిగాని!, నరసమ్మ వుంటుందికదా అన్న ధైర్యాన్ని కూడదీసుకొని, పిరికి తనాన్ని ఆవలికి నెట్టింది.

కాస్సేపటికి, నరసమ్మ వచ్చేసింది, బ్రెడ్డూ పాలూ తీసుకొని. అరుణ వాటితో కడుపు నింపుకొని, తృప్తిగా ఓనిట్టూర్పు విడిచింది. నరసమ్మ, చిల్లరడబ్బు లివ్వ బోయింది.

''నువ్వుంచుకో!'' అంది, అరుణ. ఆమెని ఆ విధంగా తృప్తిపర్చడం, అప్పట్లో తనకి చాలా అవసరమేమో ననిపించిందామెకి.

నరసమ్మ ముసి ముసి నవ్వుకుంటూ ఆ పైసాల్ని కొంగున ముడివేసుకుంది.

పదకొండున్నర దాటింది. అప్పుడే ఓ బండి వచ్చి వెళ్ళిపోయింది. ఇంకా పన్నెండు కాలేదు. ఓ యిద్దరు టిక్కెట్టు కలెక్టర్లు, మరోవ్యక్తి (యూనిఫారమ్‌లో లేడుగాబట్టి, యేం వుద్యోగం చేస్తున్నాడో గుర్తుపట్టడం కష్టం) నరసమ్మ దగ్గరికి వచ్చారు. అందులో ఒక వ్యక్తి, అరుణకేసి అదోలా చూశాడు. మిగతా యిద్దరూ ఆమెకేసి చూస్తూనే, యెవ రైనా తమని చూస్తున్నారేమోనని, దిక్కులు కూడా చూస్తున్నారు.

"ఏం నరసమ్మా, యివ్వేళ మంచి పిట్ట గూటికి చేరిందే!" అన్నాడొక టిక్కెట్టు కలెక్టరు. ఆ స్వరంలోనూ, మనిషిలోకూడా మోటుతనం వుంది.

నరసమ్మకి అటువంటి మాటలు వినడం పరిపాటేమోమరి—నవ్వేసింది.

''ఈ రాత్రి యిక్కడే వుంటుందట బాబూ!" అంది, వారి మాటలకి మరే విధమైన విమర్శా లేకుండా.

ఆ మాటలు వింటోన్న అరుణకి గుండె ఝల్లుమంది. నరసమ్మకీ, వాళ్ళకీ యేవో లావాదేవీలుండొచ్చునని, యిట్టే గ్రహించేసింది. ఆమె హృదయం ఆరాటంతో, కంగారుతో విపరీతంగా కొట్టుకుంది. ఇప్పుడేం చెయ్యడం? సినీమాకి వెళ్లినవాళ్లు సగంఆటలోనే తిరిగొచ్చేస్తే యెంతబావుణ్ణు?. నరసమ్మని చేతిలో పెట్టుకుని, వాళ్లు తనకేం అపకారం తలపెడతారో ?—ఆమె వూహించలేకపోయింది అప్రయత్నంగా కాళ్లు వొణికినయ్ ఒక ప్రమాదాన్ని యెదుర్కొంటున్నందుకు, తన దురదృష్టాన్ని తిట్టుకుంది. అయినా, యిప్పుడనుకుని, ప్రయోజనం యేవిటి? ఈ రాత్రిపూట యెక్కడికీ వెళ్ళలేదుకదా? తను వుంటున్నది పబ్లిక్ స్టేషనుగాని, అడవి కాదు కదా అన్న మొండిధైర్యాని కూడదీసుకుంది.

నరసమ్మతో యేవిటో మాట్లాడి వాళ్లు వెళ్లిపోయారు. అరుణమాత్రం వస్తోన్న నిద్రని ఆపుకుంటూ అలా కూచుంది. ఆమెకి నిద్రపోవాలనిపించలేదు. మరో అరగంట దాటింది.

''నిద్రపో అమ్మా! మీకేం భయం లేదు,'' అంది, నరసమ్మ.

''నిద్రరావడం లేదులే నరసమ్మా!" అంది, అరుణ

నరసమ్మ నవ్వింది ఆ నవ్వులోని గూఢార్థాన్ని చదవలేకపోయింది, అరుణ.

మరికొన్ని క్షణాలు గడిచినయ్. ఎక్కడో దూరంగా యింజను కూతలు విన్పిస్తున్నాయ్, తను ప్లాటుఫారమ్ మీదికి వెళ్లి, నలుగురూ వున్నచోట కూర్చుంటేనో...? అనుకుంది అరుణ ఆ వూహకి, యింకా స్పష్టమైన రూపం రాలేదు. అంతలోనే మొదట నరసమ్మతో మాట్లాడిన ముగ్గురు వ్యక్తులూ మళ్ళీ వచ్చారు ఈసారి వారి కళ్ళల్లో యెర్రదనం భీకరంగా అగుపించింది. మోటుగా వున్న వ్యక్తి, నరసమ్మ చేతిలో నోట్లు మడత పెట్టడం చూసింది, అరుణ. ఆమెలో లేని ధైర్యం మొండితనాన్ని రేకెత్తించింది. లేచి నిల్చుంది. అన్నింటికీ తెగించినవ్యక్తిలా చెంగు చీర కుచ్చిళ్ళలో దోపి భగవంతుని మనస్సులో తల్చుకుంది.

ఆ ముగ్గురూ లోపలికివచ్చి, తలుపు వెయ్యాలని ప్రయత్నిస్తున్నంతలో, మరో టికెట్ కలెక్టర్ రాఘవరావు గొంతు ఖంగుమని వినిపించింది ఆముగ్గురికీ ''తలుపు వెయ్యకు ముకుందం." అదో గర్జనలానే వుంది.

ముకుందం, మిగిలినయిద్దరూ మొదట్లో




నివ్వెరపోయినా, మత్తులో వున్నారు గాబట్టి, పిరికితనాన్ని జయించేశారు.

"ఏవిటోయ్ ఆ అరుపు?" అన్నాడు ముకుందం వాడిగా చూస్తూ.

"అరుపు కాదిది! ఆజ్ఞ! మీ విషయం, కొద్దిసేపట్నుంచీ కనిపెడతూనే వున్నాను. ఒంటరిగావున్న ఆడదాన్ని వంచించాలనికదూ? ఆ పప్పులేం వుడకవ్...బైటికిరండి..." ధైర్యంగానే అన్నాడు, రాఘవరావు.

ఎప్పుడూ మెతగ్గావుండే రాఘవరావు ఆ క్షణంలో అంత ధైర్యంగా మాట్లాడుతూ వుండటం, ముకుందంకి ఆశ్చర్యమే కలిగించింది.

"చేతకాని దద్దమ్మవు. నువ్వేం చేస్తావ్ పోవోయ్ అట్టే వాగక, నీ దారిన వెళ్ళు. మా ఇష్టం...అనుభవిస్తాం..." అన్నాడు ముకుందం, తలుపు దగ్గరికి వెయ్యబోతూ.

మెరుపులా అక్కడికివచ్చిన అసిస్టెంటు స్టేషను మాష్టారు, వాళ్ళకి అగుపించలేదు.

"అనుభవిస్తావేం...?రా స్కౌల్. ఇదా, మీరు చేస్తున్న వుద్యోగం? కం అవుట్ వన్స్.. వూఁ...." అంటూ వురి మాడు ఆయన.

ముకుందం మిగిలిన యిద్దరూ నీరై పోయి, పట్టుబడిన దొంగల్లా వణికి పోతూ, వరండాలోకి వచ్చారు.

"క్షమించండి సార్! మాకు వేరే దురుద్దేశం లేదు. ఆమె దగ్గర టిక్కెట్టు వుందో లేదో అడగడానికి వెళ్తున్నాం." అంటూ, తడబడుతున్న గొంతుతో సాకుచెప్పాడు. ముకుందం.

"అలాగేం? తలుపు వేసి టిక్కెట్టు అడుగుతావన్నమాట! అబద్ధమాడినా, అతికినట్టుండాలోయ్...అయినా, వెయి టింగ్ రూమ్‌లో టికెట్టు అడగడం, మీ డ్యూటీ కాదోయ్ వాజమ్మా! మీలాంటి చీడపుగురులు వుండటంవల్ల మనందరికీ చెడ్డ పేరు రావొచ్చు. మీ ప్రవర్తన గురించి వింటున్నాం. కాని నమ్మలేదు. ఇవ్వాళ స్వయంగా చూశాను. అసలు, మిమ్మల్ని అనేదేవిఁటి? మీతోపాటు ఈ నరసమ్మకి బుద్ధిచెప్పాలి." అన్నాడు మేష్టారు.

వగలమారి నరసమ్మ, భయపడు తున్నట్టు వణికిపోయింది.

"నాదేం తప్పులేదు బాబుగారూ! నే వొద్దంటున్నా, వీళ్ళు లోపలికి పోతు న్నారు..." అంది.

అంతవరకూ అవాక్కయి అంతా చూస్తోన్న అరుణకి, వొళ్ళు మండి పోయింది. వెళ్లి అమాంతంగా నరసమ్మ పీక నొక్కేయాలనిపించింది. అయితే. అంత సాహసం తనలో లేదనుకుంది.

"అంతా అబద్ధంసార్! ఈమె, వీళ్ళతో లాలూచీపడి, నన్ను నాశనం చెయ్యదల్చుకుంది ఈ నరసమ్మ. కావాలంటే, ఆమెకి వీళ్ళిచ్చిన డబ్బు ఆమె చేతిలోవుంది చూడండి. ఇటువంటి నీచపు స్త్రీలు ఆయాలుగా వుండటం, మరీ ఘోరం..." అంది వుద్రిక్తతతో.

"అంతా అర్థమయ్యిందమ్మా! నీకీ యిబ్బంది కలిగినందుకు చాలా విచారిస్తు న్నాను. వీళ్ళందరి విషయం నేను చూసు కుంటాన్లే...నువ్వు ప్రస్తుతానికి ఫసు క్లాసు లేడీస్ వెయిటింగ్ రూమ్‌కి వెళ్లమ్మా! రాఘవరావ్, నువ్వీమెని తీసు కెళ్లి ఫస్టుక్లాసు లేడీస్ వెయిటింగ్ రూమ్‌లో అప్పజెప్పు...నేనుచెప్పినట్టు అక్కడున్న వరహాలుకి చెప్పు ఆ ముసల్ది మంచిదే!" అన్నాడు మేష్టారు.

"థ్యాంక్యూ సార్..." అంటూ అరుణ సూట్‌కేసు పట్టుకుని రాఘవరావు వెంట వెళ్లింది.

"గొప్ప వుద్ధారకుడు వచ్చాడండీ! అంతగా ఆమెపట్ల అభిమానం వుంటే, ఆమెని పెళ్లిచేసుకోరా! ఆ దమ్ము లేదు..." కసిగా, వుండబట్టలేక రాఘవ రావుతో అన్నాడు ముకుందం.

రాఘవరావు యేమీ అనలేదుగాని మేష్టారు వుగ్రుడై పోయాడు.

"షటప్ స్కౌండ్రల్ ... మాట్లా డ్డానికి, యింకా సిగ్గులేకపోతేసరి!..." అంటూ వాళ్లని తనవెంట రమ్మంటూ వెళ్ళిపోయాడు తన ఆఫీసు గదికేసి మేష్టారు.

రాఘవరావు ఫస్టుక్లాసు లేడీస్ వెయి టింగ్ రూమ్‌కేసి అరుణతో నడిచాడు.

నరసమ్మకి కళ్లు తిరిగినట్టయ్యింది. ఆమెపై యేవిధమైన చర్య తీసుకుంటా రోన్న భయం ఆవరించిం దామెని. ముకుందం వాళ్లందించిన రూపాయలు, తనకి వుచ్చిత్రాడులా మారుతాయని ఆమె వూహించలేదు పాపం! దిగాలుపడి కూచుండిపోయింది. రేపట్నుంచి సస్పెండు చేస్తారేమోనన్న భీతి, ఆమె మెదడులో ఆలోచనల్ని రేకెత్తించింది. ఇప్పుడు పశ్చాత్తాపపడినా, ప్రయో జనం యేవిటి?

అరుణకి రాఘవరావుని చూస్తుంటే అభిమానం, జాలి కలిగాయి. తన శీలాన్ని కాపాడ్డమే గాకుండా, వాళ్ళచేత నానా మాటలు తిన్నాడు. ఇక ముందు కూడా వాళ్లు ఆయన్ని మాటలతో చిత్ర వధ చేస్తారు. పెళ్ళిచేసుకోమని, వాళ్ళ తణ్ణి ఛాలెంజి చెయ్యడం, అరుణ చెవుల్లో యిప్పటికీ గింగుపెడుతూనే వుంది. ఆయనే గనక సమయానికి అడ్డుపడక పోతే, తన బ్రతుకు యేమయ్యేది! అటువంటి వ్యక్తిని పెళ్ళిచేసుకుంటే, తప్పేముంది! అయితే, ఆయన అంగీక రించాలిగా! ఆయన చేస్తున్న వుద్యోగం ఫరవాలేదు. మరి చదువో...? అక్కడే తను దెబ్బతింటుంది...అయినా ఆ ప్రసక్తి యింక తీసుకురాకూడదని నిశ్చయించుకుంది

"చూడండీ...' ఫస్టుక్లాసు లేడీస్ వెయిటింగ్‌రూమ్‌లో తనని అప్పజెప్పి, తిరిగి వెళ్ళిపోతోన్న రాఘవరావుని పిల్చింది, అరుణ.

''చెప్పండి...'' అన్నాడు రాఘవ రావు.

"మీ పేరు చెప్పడానికి అభ్యంతర ముందా?"

"అబ్బే...! రాఘవరావు..."

"చూడండి రాఘవరావుగారూ! వాళ్ల ప్రయత్నానికి మీరు అడ్డు తగిలారు. వాళ్ళేమైనా మీకు అపకారం తలపెడతా రేమో, కాస్త జాగ్రత్తగా వుండండి." చెప్పాలనుకున్న సలహా చెప్పేసింది.

రాఘవరావు ధైర్యంగానే ఓ మంద హాసం చేశాడు.

"ఏడిశారు. నాకూ బలగముందండీ! అటువంటి భయమేం లేదు. పిచ్చివేషాలు వేశారంటే, దుమ్ముతేరించేస్తాను. సరే గాని, మీరు రేపు యెక్కడికి వెడ తారు?" అన్నాడు.

"మా స్నేహితురాలు నర్సుగా పని చేస్తుందండీ! అక్కడికి వెళ్ళాలి.''

"అయితే, మీరు ఒంటరిగా వెళ్ళకండి. ఆ వెధవలు, దెబ్బతిన్న పులుల్లా వేచి వుంటారు. రేపు వుదయం వచ్చి, నేను తీసుకెళ్తాలెండి."

ఆశ్చర్యపోయింది, అరుణ.

"మీ కెందుకండీ అంత శ్రమ?" అంది.

"శ్రమకేముంది లెండి... మీరున్న పరిస్థితిలో నేను శ్రమపడినా, కష్టమనిపించదు. వస్తా..." అంటూ వెళ్ళిపోయాడు, రాఘవరావు.

"ఎంత మంచి వ్యక్తి...?" అనుకుంది మనసులో.

వెళ్ళి సోఫాలో కూలబడింది. ఆమె మనో నేత్రాల ముందు, రాఘవరావే మెదుల్తున్నాడు.

* * *

తెల్లవారింది ... ఏడుగంటలకి, రాఘవరావు వచ్చాడు.

"మీరు రెడీయేనా?" అన్నాడు.

"పదండి...ఏదీ ఆ సూట్ కేసు..."

"అబ్బే! మీరు పట్టుకోవడ మేమిటండీ! ఏమంత బరువుకాదు లెండి... నేను పట్టుకుంటాను."

"ఏం ఫరవాలేదు." అంటూ తన చేతిలోకి తీసుకొన్నాడు సూట్ కేసుని.

అరుణ, నిజంగా కొత్త పెళ్ళి కూతురులా సిగ్గుపడిపోయింది...

రిక్షాస్టాండు దగ్గరికొచ్చి, ఓ రిక్షాని పిల్చి, అందులో కూర్చోమన్నాడు రాఘవరావు.

"మరి, మీరో...?" అంది అరుణ. రిక్షాలో కూచుంటూ.

"నాకు సైకిలుంది లెండి..." అంటూ కాస్తంత దూరంలో వున్న సైకిల్ని తెచ్చుకుని బైలుదేరాడు.

కొంతదూరం వెళ్ళాక, ఓ డాబా యింటిముందు రిక్షాని ఆపమన్నాడు, రాఘవరావు.

"ఇక్కడి కెందుకండీ?" కాస్తంత కంగారుతో అడిగింది, అరుణ.

రాఘవరావు నవ్వేడు.

"మరేం కంగారుపడకండి. ఇది మా ఇల్లు. మా అమ్మగారు మిమ్మల్ని తీసుకురమన్నారు. టిఫిను, కాఫీ తీసుకుని హాస్పటల్ కి వెళ్దాం." అన్నాడు

అరుణ, సందేహిస్తూ అతనికేసి కళ్ళు వ్పగించి చూస్తోంది. ఆ కళ్ళల్లో యేదో అనుమానం దోబూచులాడుతోంది. అది గమనించిన రాఘవరావు మళ్ళీ అన్నాడు.

"సందేహిస్తున్నా రెందుకో నాకు అర్థంకాదు. మా అమ్మగారున్నారు... పదండి..." అని, అరుణ దిగింది రిక్షా

రాఘవరావు సూట్ కేసు తీసుకుని, రిక్షావాడికి డబ్బులిచ్చి పంపాడు.

"రండి..." ఇంట్లోకి నడిచాడు. అరుణ అతణ్ణి అనుసరించింది.

రాఘవరావు తల్లి శాంతమ్మ, వాళ్ళకి




యెదురుగా వచ్చి, అరుణకేసి తదేకంగా చూస్తోంది

"మా అమ్మగారు..." అంటూ అరుణకి పరిచయం చేశాడు, రావఘరావు.

అరుణ సవినయంగా నమస్కరించిందామెకి

శాంతమ్మ మొహంలో ప్రసన్నతతో కూడిన ఓ చిరునవ్వు తళుక్కుమంది.

"మా అబ్బాయి అంతా చెప్పాడమ్మా! కూచో...టిఫినూ,కాఫీ తీసుకుందువుగాని అంటూ వంటగదికేసి వెళ్ళింది. అరుణ కూడా అక్కడుండకుండా, శాంతమ్మను అనుసరించి, అక్కడే కూచుని, టిఫినూ, కాఫీ తీసుకుంది.

శాంతమ్మ, పూర్వకాలపు మనిషయినా, కొద్దిపాటి ఆధునిక భావాలు గలది. అందుకే కొడుకు అరుణని తీసుకొస్తానంటే కాదనలేదు. పైగా ఆమెతో ఆప్యాయంగా మాట్లాడింది.

అరుణ, శాంతమ్మకి కృతజ్ఞత చెప్పుకుని, మళ్ళీ బైలుదేరింది. రాఘవరావు, ఆమెతోపాటువెళ్ళాడు. వేదవతిడ్యూటీలో లేదని తెలిసింది, తీరా హాస్పటల్‌కి వెళ్ళాక ఆమె వుంటున్న ఇల్లు తెలుసుకుని, అక్కడికి వెళ్ళారు.

వేదవతి, అరుణని చూడగానే విస్తుపోతూ, యెంతో ఆదరంగా ఆహ్వానించింది.

"రావే అరుణా! చాలా రోజుల తర్వాత నిన్ను చూశాను. యెంతో సంతోషంగా వుంది. నా ఇల్లు తెలుసుకోవడంలో యిబ్బందేం కలగలేదుకదా" అంది, హుషారుగా.

"లేదే, ఇదిగో–వీరిసహాయంతో సులువుగా తెలుసుకోగలిగాను. ఈయనేగాని నన్ను ఆదుకోపోతే యేమయ్యేదాన్నో..."

వేదవతి ఆశ్చర్యం యినుమడించింది.

"ఓ! అయితే, యీయన మీ ఆయన

కాదన్న మాట! ఐయామ్ సారీ! మీరిద్దరూ కలిసొస్తే, పెళ్ళయ్యాక యిలా వచ్చారేమో నను కున్నాను." నవ్వుతూ అంది, రాఘవరావు కేసి చూస్తూ.

రాఘవరావు యిరుకునపడి, మొహం దించుకున్నాడు. అసలే అతనికి బిడియం.

అరుణ నవ్వేసింది.

"మంచిదానివేనే!" నవ్వుతూనే అంది, అరుణ.

"ఐయామ్ సో సారీ మిష్టర్..." రాఘవరావుకేసి అదోలా చూస్తూ అంది, అరుణ.

"నా పేరు రాఘవరావండీ! ఇక్కడే టి. సి. గా పనిచేస్తున్నాను," అన్నాడు

"ఐసీ! గ్లాడ్ టు మీట్ యు నా స్నేహితురాలికి సహాయం చేసినందుకు థాంక్స్... రండి లోపలికి."

వేదవతి ఇరువుర్నీ ముందుగదిలో కూచోబెట్టి, కాఫీ తయారుచేసేందుకు వంటగదిలోకి వెళ్ళింది. అరుణ కూడా ఆమెను అనుసరించింది.

రాఘవరావు చుట్టూ కలయజూశాడు. గదినీటుగా వుంది. గది గోడలనిండా వేదవతి వివిధభంగిమల్లో తీయించుకున్న ఫొటోలు వున్నయ్. నిజంగానే ఆమె అందమైనది. అయితే, అరుణ అతణ్ణి ఆకర్షించినంతగా, వేదవతి ఆకర్షించలేకపోయింది.

కాఫీ తెచ్చి యిచ్చింది వేదవతి. కాఫీ తీసుకున్నాక, వాళ్ళిద్దరికీ చెప్పి బయలుదేరాడు రాఘవరావు. "నా కృతజ్ఞత యెలా తెలియజెయ్యాలో అర్థంకావడం లేదండీ రాఘవరావుగారూ!" అంది మెల్లగా అరుణ చీరచెంగు చేతి వేలికి సుతారంగా చుట్టుకుంటూ.

"ఆఁ... దానికేముందిలెండి..."

"మళ్ళీ కనిపిస్తారా?"

"వీలు చూసుకొని వస్తాలెండి..." అంటూ రాఘవరావు నిష్క్రమించాడు.

రాఘవరావు వెళ్ళిపోయాక, చిలిపిగా అరుణకేసి చూసింది వేదవతి.

"ఏవిఁటే, యీ ఊరి టి. సి. తో యింత పరిచయం యేర్పడిందంటే, ఆశ్చర్యమే! మొదట్నుంచీ తెలిసినవాడా?" అంది.

అరుణ, బరువుగా ఓ నిట్టూర్పు విడిచింది.

"అదేం కాదులే; రాత్రి బండి దిగాక లేడీస్ వెయిటింగ్ రూమ్‌లో అడుగుపెట్టాను... ఆ తరువాత జరిగిన సంఘటనలో, యీయనే నన్ను కాపాడారు." ఒక్క ముక్కలో చెప్పింది.

"ఏవిఁటి కథ?" వేదవతి బుగ్గమీద వేలేసుకుని; అదోలాంటి పోజులో అడిగింది.

అరుణ, అంతా వివరంగా చెప్పింది.

"అయితే,యీ ఊళ్ళో అడుగుపెడుతూనే ప్రమాదంలో యిరుక్కున్నావన్నమాట!" నవ్వుతూ అంది వేదవతి.

"ఏమైనా నువ్వు అదృష్టవంతురాలివే;




ఈ రాఘవరావు, కాశీమజిలీల్లోని రాజ కుమారుడిలా ఆదుకున్నాడు. లే... స్నానం చేద్దువుగాని...''

స్నానం అయ్యిందిలే..."

"మరి టిఫిను?"

''అదీను..."

"ఎక్కడ...?"

''రాఘవరావుగారే వాళ్ళింటికి తీసు కెళ్ళి టిఫిను, కాఫీ పెట్టించారు...''

''అబ్బో! మరింకేం... వాళ్ళావిడ యేం అనలేదా?"

''ఈయనకింకా మేరేజ్ కాలేదుట... వాళ్ళమ్మగారున్నారు... ఆమె చాలా మంచిది..."

"అయితే, తొలి చూపుల వలపేవిఁటి చెప్మా–'' విరగబడినవ్వుతూ అంది, వేదవతి.

అరుణ కూడా నవ్వింది–కాస్తంత సిగ్గుతో.

"ఫోవే! నువ్వెప్పుడూ యింతే!" అంది మూతి తిప్పుతూ.

"సరే! పద...వంటచేద్దాం కలిసి.."

అరుణ లేచింది.

* * *

ఆ రాత్రి పదింటికి డ్యూటీకి వెళ్తానని చెప్పింది వేదవతి. సాయంత్రం అలా షికారుకని బీచ్‌కి వెళ్ళారు ఇద్దరూ. అక్కడ వేదవతికి తెలిసినవాళ్లు చాలా మంది కలిశారు. అందరికీ అరుణని పరిచయం చేసింది. వాళ్ళంతా తనకేసి పరిశీలనగా చూడ్డం, అరుణకి యెబ్బెట్టుగా తోచింది. ఎనిమిదికి తిరిగొచ్చి, భోజనాలు చేశారు. కాస్సేపు ఇద్దరూ విశ్రాంతిగా కూర్చొని గతస్మృతుల్ని నెమరువేసుకుంటూ వుంటే, తలుపు తట్టారెవరో. వేదవతి వెళ్ళి తలుపు తీసింది.

ఆ వచ్చినవ్యక్తి పురుషుడే. అతనితో వేదవతి చెప్పిన జవాబు మాత్రం స్పష్టంగా వినిపించింది, అరుణకి.

"మా స్నేహితురాలువచ్చింది. హాస్పిటల్లో కలుద్దాం... పదింటికి వెళ్తాను," అని మెల్లగా చెప్తూ వచ్చింది వేదవతి.

"ఎవరే...?" అరుణ ప్రశ్న.

"ఓ పిల్ల డాక్టరులే..."

"ఓ!"

ఆ ప్రసక్తిని పొడిగించలేదు అరుణ. పదింటికి సెమీ సూట్‌లో వున్న ఓ యువకుడొచ్చాడు. వేదవతి హడావుడిగా బైలుదేరింది.

"అరుణా వస్తానే! ఎవరొచ్చినా, తలుపుతియ్యకు. నేను లేనని చెప్పేయ్," అంటూ చెప్పి, ఆ యువకుడితోపాటు వెళ్ళిపోయింది.

నర్సు దుస్తుల్లో, వే ద వ తి మరీ అందంగా అగుపించింది అరుణకి. ఆ క్షణంలో, ఆ వృత్తిపట్ల యెక్కడలేని అభిమానం, అభిలాష,పుట్టుకొచ్చిందామెలో. అయితే, యెవరొచ్చి పిల్చినా, తలుపు తియ్యొద్దని ప్రత్యేకంగా వేదవతి యెందుకు చెప్పినట్టు...? ఆమె మెదడులో యేవేవో ప్రశ్నలు, అలల్లా లేచాయి. తలుపు గడియ వేసుకుని పడుకుంది. గతరాత్రి సమంగా నిద్ర లేకపోవడం వల్ల, చప్పున మగత కమ్మేసిందామెకి.

అరుణ మాంచి నిద్రలో వుండగా, తలుపు తట్టిన శబ్దం అయ్యింది. కళ్ళు నులుముకుంటూ, విసుగ్గా లేచింది. ఆమె గుండెలు అప్రయత్నంగా జోరుగా కొట్టుకున్నాయి కాళ్ళు వణక సాగినయ్. టేబిల్ మీదున్న అలారం టైమ్‌పీస్‌వేపు దృష్టి సారించింది. ఒంటిగంట దాటింది.

"ఎవరూ?"

"ఏమిటి వేదం, నా గొంతు గుర్తుపట్టలేదా? తలుపు తెరు..." అన్నదా గంభీరమైన గొంతు.

అరుణ నిర్ఘాంతపోయింది. వేదవతి చెప్పిన మాటలు గుర్తుకొచ్చినయ్ తలుపు తియ్యదల్చుకోలేదు.

"వేదవతి డ్యూటీకి వెళ్ళిందండీ! నేనామె స్నేహితురాల్ని... హాస్పిటల్‌కి

వెళ్ళండి, ఆమె కలుస్తుంది..." గొంతు కాస్త హెచ్చించి మరీ అంది.

"స్నేహితురాలివే కదా; మరింకేం; తలుపు తియ్యి" అన్నదా గొంతు.

వొళ్ళు మండిపోయింది, అరుణకి.

"షటప్! వొళ్ళు దగ్గర పెట్టుకుని మాట్లాడండి... వెళ్ళండిక ... లేకపోతే అరుస్తాను." కోపంగా గర్జించింది.

అతను మళ్లీ యేం మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. అరుణ, నడుం వాల్చింది. ఆమెకి ఆ వాతావరణం చాలా అసహ్యంగా తోచింది. తను యేం అనుకుని యింటినించి బైలుదేరింది? ఏం జరుగుతోంది...? చాలా సేపటివరకూ బాధ పడింది

* * *

తెల్లారింది—

ఏడింటికి వేదవతి వచ్చింది. "రాత్రి యెవరైనా వచ్చి పిలిచారా నన్ను?" ప్రశ్నించింది, కాఫీ తీసుకుంటూ.

ఎవ్వరూ రాలేదనే అబద్ధం చెప్పింది.

"నిద్రపట్టిందా?" మళ్లీ వేదవతి ప్రశ్న.

"లేదే! ఒంటరిగా పడుకోవడమంటే నాకు చెడ్డ భయం. మా మామయ్యగారింట్లో మా శోభ నా దగ్గర పడుకునేది. నేనిక్కడ వుండలేను బాబూ..." అంది అరుణ.

"అయితే మరేం చేస్తావ్? ఉద్యోగం కోసం ప్రయత్నిస్తా నన్నావుగా...!"

"ఉద్యోగం దొరకడం మాత్రం అంత సులువా? మళ్ళీ మావయ్య దగ్గరికే పోతాను..."

"అక్కడికి మరి వెళ్ళనని చెప్పావు?"

"తప్పుతుందా మరి? అవివాహిత స్త్రీ ఒంటరిగా జీవించడం, చాలా కష్టం—యెంతో చొరవ వుంటేనే తప్పించి. నాకు మరీ భయమేస్తోంది ఇవ్వాళే వెళ్లిపోతాను."

"పోనీ, ఓ రెండ్రోజులుండి వెళ్ల కూడదూ?" అంది వేదవతి.

నిజానికి వేదవతికి యెంతో ఆనందమన్పించింది, అరుణ వెళ్ళిపోతానంటే. అరుణ, ఆమె స్వేచ్ఛకిఅడ్డంగా వుందేమోనని మరి.

"మళ్లీ యీ సారి వస్తాలేవే; ఇప్పుడు మాత్రం వుండను..."

"ఎప్పుడూ నీ మనస్తత్వాన్ని అర్థం చేసుకోలేకపోతున్నాను...డబ్బుందా?"

"వుందిలే..." అంది. వేదవతిని డబ్బడగడం యిష్టంలేకపోయిందామెకి యెందుకో.

ఆ రోజే మధ్యాహ్నం నాలుగింటికి బయలుదేరింది అరుణ.

"స్టేషనుకి రావాలనుకున్నానే అరుణ! కాని, నా ఫ్రెండొకామె వస్తానంది. మరేం అనుకోకు..."అంది, వేదవతి.

"ఫరవాలేదులేవే! నేనేం పల్లెటూరిదాన్నా, వెళ్ళలేకపోవడానికి?" నవ్వేసింది, అరుణ.

రిక్షా ముందుకి సాగింది. రిక్షా వేగంతోపాటు, అరుణ ఆలోచనలు వేగాన్ని అందుకున్నాయి. వేదవతి యెంతగా మారిపోయింది? ఆమెకి అంత వరకూ వేదవతిపట్ల ఉండే గౌరవం నశించింది. నేరుగా రాఘవరావు ఇంటికి వెళ్ళింది. ఆయన దగ్గర కొంత డబ్బు తీసుకోవాలి. అతడు తప్పకుండా ఇస్తా డనే నమ్మకం వుంది. ఆ పరిస్థితుల్లో అంతకంటె మరోమార్గం అగుపించలేదు.

కాఫీ తీసుకుంటున్న రాఘవరావు, సూట్‌కేసు పట్టుకొని ఇంట్లో అడుగు పెట్టిన అరుణని చూసి, విభ్రాంతి చెందాడు.

"రండి... రండి... మళ్లీ ఎక్కడికి బయలుదేరారు?" అంటూ ముందు కొచ్చాడు.

అరుణ, బరువుగా ఓ నిట్టూర్పు విడిచింది. ఆమె మొహంలో ఉత్సాహం యే కోశానా లేదు.

"నేను, నా స్నేహితురాలితో ఉండి, ఉద్యోగ ప్రయత్నాలు సాగించాలన్న కలల్ని పండించుకొని వచ్చానండీ కాని నా స్నేహితురాలు చాలా మారిపోయింది. అక్కడి వాతావరణం చాలా యెబ్బెట్టుగా ఉంది. మరోక్షణం అక్కడ వుండలేనంతగా, జుగుప్స కలిగింది. ఏం చెయ్యడం? ఎక్కడ్నించి వచ్చానో, మళ్ళీ అక్కడికే వెళ్లిపోతాను. మా మావయ్యకి క్షమాపణ చెప్పుకుని ఆయన నిశ్చయించిన సంబంధాన్ని సంతోషంతో అంగీకరిస్తాను. అంతకు మించి నేను చెయ్యగలిగిందేమీ లేదు అయితే, మీరు నాకో చిన్న సహాయం చెయ్యాలి..." ఆమె అలా చెబుతూవుంటే గొంతులో కంపన ధ్వనించింది ఆమె కళ్ళు చెమ్మగిల్లడం, రాఘవరావు గుర్తించాడు.

రాఘవరావు అసలే జాలిగుండెలకు ప్రతినిధి. కరిగిపోయాడు.

"ఏమిటి చెప్పండి...?"

"నాకో పదిరూపాయలివ్వండి. నేను మా ఇల్లు చేరుకున్నాక, పంపుతాను," అంది, మొహం దించుకుని. ఆమె ఎంతగా బాధపడుతుందో, రాఘవరావు అర్థం చేసుకోగలిగాడు.

శాంతమ్మ, లోపలిద్వారం దగ్గర నిలబడి అంతా విన్నది. ఆమెకి సానుభూతి కలిగింది కొడుకు అరుణ గురించి పదేపదే చెబుతూ వుండటం వాడి ఆలోచనలు ఆమె చుట్టూ పరిభ్రమిస్తూ వుండటం పసిగట్టిన శాంతమ్మ, కొడుకు మనస్తత్వాన్ని అర్థంచేసుకోగలిగింది. ఆమెకి అరుణంటే అభిమానం యేర్పడింది. అరుణ ప్రవర్తన యెటువంటిదో ఆకళింపు చేసుకుంది. ఆమె ఉత్తమ ఇల్లాలు కాగలదనుకుంది.

వెళ్లిపోడానికి తొందరేమిటమ్మా? ఇక్కడే వుండకూడదూ?" అంటూ దగ్గరగా వచ్చింది, శాంతమ్మ.

"వొద్దండీ! మీ ఇంట్లో ఉంటే మరిం కెన్నో అభాండాలు వెయ్యొచ్చి పాడు ప్రపంచం..." అంది, అరుణ.

"చూడమ్మా అరుణా, నా మనసులోని మాట చెబుతాను. నువ్వేమీ అనుకోవు కదా?"

"ఎంతమాటన్నారండీ; మీరు నా శ్రేయోభిలాషులు. మీరుచెప్పింది నేనెప్పుడూ అపార్థంచేసుకోను."

"మాకూ యింకెవ్వరూ లేరమ్మా. నేను చూస్తే ముసలిదాన్నయిపోయాను. మా అబ్బాయి పెళ్లి గురించి నేను ప్రయత్నిస్తున్నా. వాడికి నచ్చిన అమ్మాయి దొరకడంలేదు. నువ్వు అంగీకరిస్తే, నా కోడలిగా చేసుకుంటానమ్మా!" అంది, శాంతమ్మ.

అరుణ ఆశ్చర్యంతో ఒక్కసారి నిర్ఘాంతపోయింది. ఏవిటీ అనుకోని సంఘటన, ఆమెహృదయాంతరాళంలోఎక్కడో చెప్పలేని ఆనందం పెల్లుబికింది. కళ్లు ఓ వింతకాంతిని సంతరించుకున్నాయి.

"ఏవిటండీ మీరంటున్నది?" అంది వుత్సుకతతో.

"ఔనమ్మా! నీ కిష్టమైతేనే అంగీకరించు..." మళ్ళీ అంది శాంతమ్మ.

మీ సహృదయతనిఎలా హర్షించాలో, నా కృతజ్ఞత ఎలా వ్యక్తీకరించుకోవాలో అర్థంకావడం లేదండీ! నదీప్రవాహంలో కొట్టుకుపోతున్న వ్యక్తికి ఆసరాగా ఏపాటి కట్టె దొరికినా, మంచిదేకదా: ఇంతకంటె నాకు కావల్సిందేవిటి? కాని, మీ అబ్బాయిగారికి..." అంటూ రాఘవరావుకేసి ఓరగా చూసింది, అరుణ.

ఆమె హృదయం వడివడిగా కొట్టుకుంది, అతను యేం జవాబు చెప్తాడో నన్న ఆందోళన అది.

"ఏరా అబ్బాయ్, నువ్వేమంటావ్?" మందహాసంతో అంది, శాంతమ్మ ఆమెకి తెలుసు, కొడుకు నిరాకరించడని.

"నా అదృష్టంగా భావిస్తాను..." అన్నాడు రాఘవరావు, అరుణకేసి అనురాగ దృక్కుల్ని సారిస్తూ.

ప్రపంచంలోకెల్లా తనే గొప్ప అదృష్టవంతురాలన్నట్టుగా మురిసిపోయింది అరుణ

"ఎంత అదృష్టవంతురాల్నండీ నేను.. నా అదృష్టమే నన్నిలా ఇక్కడికి తీసుకొచ్చిందేమో." అంటూ, శాంతమ్మ పాదాలకు సవినయంగా నమస్కరించింది.

శాంతమ్మ కళ్ళల్లో ఆనందభాష్పాలు ముత్యాల్లా మెరిసినయ్ తను యెదురు చూసినరోజు వచ్చినందుకే. ఆ ఆనందం! రెండుచేతుల్లో ఆమెని లేవనెత్తి,

"లే అమ్మా మీ మావయ్యకి ఉత్తరం రాయి, వెంటనే రమ్మని..." అంది.

"వద్దండీ! ఇప్పుడు మీరే నాకు సర్వస్వమూను. నా పెళ్ళయ్యాకనే అక్కడికి వెళ్తాను," అరుణ అంది.

"ఆయన, మరేం అనుకోరా."

"అబ్బే! ఏమీ అనుకోరండీ! నా శ్రేయస్సుని కోరేవ్యక్తి, ఆయనొక్కడే, మా బంధువుల్లో..."

"అయితే సరే! వివాహం, ఆలయంలో దైవసాన్నిధ్యంలో ఏర్పాటు చేస్తాను..." అంది శాంతమ్మ.

అరుణ మురిసిపోయింది ఆమె మొహం అప్పుడే సిగ్గుతో ఎఱ్ఱబారింది.

"పదమ్మా లోపలికి..." అంటూ తీసుకుపోయిందామెని శాంతమ్మ.

రాఘవరావు, ఆనందంతో వుక్కిరిబిక్కిరయ్యాడు.

* * *

మరుసటిరోజు ఏకాదశి ఆ రోజే శుభదినంగా భావించిన శాంతమ్మ, నలుగురు బంధువులూ, పెద్దల సమక్షంలో ఆలయ ప్రాంగణంలో కొడుకు వివాహాన్ని, జరిపించింది. ఆమె మంచితనాన్ని, అధునాతన భావాల్ని, అక్కడ చేరిన వారందరూ అభినందించారు. ఆ వివాహానికి వేదవతికూడా వచ్చింది స్నేహితురాల్ని, తనివితీరా కౌగలించుకుంది.

"నిజంగా నువ్వే అదృష్టవంతురాలివే అరుణా!" అంది ఆమె మాటల్లో అంతులేని ఆవేదన, నిస్పృహ ధ్వనించింది.

ఏమైనా, అరుణమాత్రం తనని వరించిన అదృష్టానికి మురిసిపోయింది. ఆమెకి తెలుసు రాఘవరావు గ్రాడ్యుయేట్ కాదని-కనీసం మెట్రిక్ అయినా పాసు కాలేదని. కాని, ఆ తెలివితక్కువ పట్టుదలని ఓ మూలకి విసిరేసి, ఆ ప్రసక్తిని మరచిపోయింది. అంతా దైవఘటనగా తోచిందామెకి. రాఘవరావుతో తన వివాహం రాసిపెట్టి ఉంది గాబట్టే, మావయ్య తెచ్చిన సంబంధాన్ని త్రోసిరాజని, యిలా వచ్చేసింది. అదే తన జీవితంలో మలుపు...తన జీవితానికి వెలుగురేఖ! రాఘవరావు తను నచ్చిన వాడు... మెచ్చినవాడు. అది చాలు అనుకుంది.

* * *

వారంరోజులు యిట్టే గడిచిపోయాయి. అరుణ వైవాహికజీవితం ప్రశాంతంగా సాగిపోతూ వుంది. మావయ్య దగ్గరికి తామిద్దరూ కలిసి వెళ్ళాలన్న కోరిక ఆమెలో బలీయంగా వుంది. ఓ రోజు అత్తయ్యతో అంది.

"మా మావయ్య గారింటికి ఓ సారి వెళ్లొస్తాం అత్తయ్యగారూ!" అని.

శాంతమ్మ కాదనలేదు.

"అలాగే వెళ్ళండమ్మా!" అంటూ గ్రీన్‌సిగ్నల్ యిచ్చింది.

మరునాడే రాఘవరావు, అరుణ బయిలుదేరారు. స్టేషన్లో ముకుందం వాళ్ళని చూసి, సిగ్గుతో తలవంచుకుని తప్పుకుని వెళ్ళిపోయాడు.

రాఘవరావు, అరుణ నవ్వుకొన్నారు.

* * *

శంకరనారాయణ దంపతులు, అరుణని హఠాత్తుగా చూసి నిర్ఘాంత

పోయారు. ఆమె ప్రక్కనే వున్న రాఘవరావుని చూసి మరీ విస్తుపోయారు.

"మమ్మల్ని దీవించండి మావయ్యా! అత్తయ్యా! నువ్వూను." అంది చిరునవ్వుతో అరుణ, వాళ్ళిద్దరికీ పాదాభివందనం చేస్తూ. రాఘవరావు కూడా ఆమెతోపాటు వాళ్ళకి నమస్కరించాడు.

"కలకాలం సుఖంగా, ఆనందంగా జీవించండి..." అంటూ మనసారా దీవించాడు శంకరనారాయణ.

"నేను చేసింది తప్పే అయితే, క్షమాపణ కోరుకుంటున్నాను మావయ్యా! మా వివాహం అనుకోనివిధంగా పరిస్థితుల ప్రభావం ఫలితంగా జరిగిపోయింది" అంటూ క్లుప్తంగా జరిగిన విషయాన్ని చెప్పింది.

శంకరనారాయణ, బరువుగా ఓ నిశ్వాసం వదిలాడు.

"దైవసంకల్పాన్ని యెవ్వరూ తుడిచి పెట్టలేరమ్మా అరుణా! నువ్వో యింటిదానివయ్యావు... మేం యెంతో సంతోషిస్తున్నామమ్మా!" అంటూ రాఘవరావు కేసి చూసి "ఏం బాబూ, యేం ఉద్యోగం చేస్తున్నావు? ఎంతవరకూ చదువుకున్నావు?" ప్రశ్నించారాయన.

రాఘవరావు చెప్పడాని కుద్యుక్తుడౌతున్నంతలో అరుణ అందుకుంది. "టిక్కెట్టు కలెక్టరుగా పనిచేస్తున్నారు మావయ్యా! స్వంత ఇల్లుంది. ఇహపోతే, చదువంటారా? మెట్రిక్ వరకూ చదివారు. అయినా, చదువులో యేముందిలే మావయ్యా? జీవితం సుఖంగా సాగిపోతే చాలు" అంది మెల్లగా మొహం దించుకునే. ఆమెకి మావయ్యతో తను చెప్పిన రోజు గుర్తుకొచ్చింది.

శంకరనారాయణ తృప్తిగా నవ్వేడు. తన మాట మొదట్లో కాదన్నందుకు, యిప్పుడామె మనసు మార్చుకున్నందుకు, అతనిలో యేమాత్రం కోపం రాలేదు.

"నిజమేనమ్మా! చదువులో యేముంది. ఇప్పటికయినా నీలోని వివేకం మేల్కొన్నది... అందుకు సంతోషం. అలా నిల్చుండిపోయావు... కూర్చో బాబూ!" అంటూ రాఘవరావుని ఆప్యాయంగా చెయ్యిపట్టుకుని కూర్చోబెట్టాడు కుర్చీలో.

అరుణ ముసిముసి నవ్వుల్తో, పిల్లల చేతిలో బిస్కెట్ల పేకెట్లు పెడుతూ, అత్తయ్య వెంట లోపలికి నడిచింది.

రాఘవరావు శంకరనారాయణ చల్లని మనస్సుని లోలోన అభినందించుకున్నాడు.

శంకరనారాయణ ఆ రోజు అనుభవించిన ఆనందం వర్ణనాతీతం; ఆ రోజు ఆ యింట్లో ఒక పండుగ.



# కథానాయ సాగరం

పాపా

(గత సంచిక తరువాయి)

## 18

### పద్మ - వ్యూహం

గోదావరి చేరబడి ఉంది పక్కనే సాగరం కూర్చున్నాడు.

"కాలక్షేపంగా కథ... ఊకొడితే విందువు గాని..." అన్నాడు.

"ఇలాగే అభిమన్యుడు కడుపున ఉన్నప్పుడు సుభద్రతో అర్జునుడు పద్మ వ్యూహాన్ని ప్రవేశించటం చెప్పి ఆగ వలసి వచ్చిందట. అలా కానివ్వరు గదా?" అంది గోదావరి నవ్వుతూ.

"ఫర్వాలేదులే! అమృతాన్నేగా ధరించావు!" అంటూ సాగరం మొదలు పెట్టాడు......

"వెంకన్న అనే పేరుతో స్కూల్లో చేరిన వెంకడు స్కూలు విడిచినవెంటనే వేన్‌కాన్ అని మార్చుకొని కాలేజీ ప్రవేశించాడు. చంద్రప్రభ అనే అమ్మాయికీ వేన్కాన్‌కీ క్లాసుల్లో కలిసిన చూపులు అన్నీ కలిపాయి. మొదట ఆ అమ్మాయి పేరు చెంద్రి — చంద్రమ్మట.

వెంకడికి చిన్నప్పుడే మంగిని పెళ్ళి చేశారు. ఆ మంగి అనగా మంగమ్మ పెద్దపిల్లయింది. కార్యం చేసుకోమని వచ్చిన ఉత్తరానికి వేన్కాన్ రెండు ముక్కల్తో తెంపుచేసుకున్నాడు. మంచి ఆస్తి ఉంది మరి. ఒక పొలం రాసేసి, కొంత డబ్బు యిచ్చేసి, మంగమ్మకు మరో పెళ్ళి చెయ్యవచ్చనీ చెప్పేసి వచ్చి చక్కా పెద్దపట్నంలో చంద్రప్రభతో రిజిస్టరీ పెళ్ళి చేసుకున్నాడు. నలుగురు స్నేహితులకి నాలుగు రకాల ఖరీదైన సీసాలతో పార్టీ యిచ్చి, ఆ నలుగురులో మొనగాడు పెళ్ళిపెద్దా అయిన నిరంజన్ రావు వేన్కాన్‌కి ద్వితీయ పాత్రలాంటి వాడు.

కేలండరు నిమిత్తంలేకుండా వేన్కాన్ చంద్రప్రభతో దివ్యంగా వెలిగించాడు. చంద్ర అందం బిగువూ సడల కూడదని, పిల్లా పీచూ బెడద లేకుండా కొంతకాలమైనా ఉండాలని కూడ బలుక్కున్నారు. అంతేగాకుండా నక్షత్రాన్ని అవాలని చంద్రకూ, చెయ్యాలని వేన్కాన్‌కీ ఉమ్మడిసంకల్పం. చంద్రప్రభ హేలా విలాసాలందుకు తగ్గవే గనక. చంద్రను వీళ్ళకూ వాళ్ళకూ చూపించాడు. అందాకా నాటకాల్లో తర్ఫీదు పొందటం మంచిదని సహృదయులు కొందరు చెప్పారు.

మంగమ్మ మరో పెళ్ళికి ఒప్పుకోలేదు. ఒక్కదాన్నే బతకలేనా ఏమిటి!! అంది. చాలా గడుసుది. డబ్బు వడ్డీలకు యిచ్చు

కుంది. రోజురోజుకూ పెంచుకుంది. మనుషుల్ని పెట్టుకొని పొలం సొంతంగా సాగుచేసుకొని మంచి ఆదాయం చేసుకొంది. బ్రాకెట్లు ఆడింపించింది. వడ్డీలు వచ్చిన డబ్బుని వడ్డీలకే తిప్పింది. రోజు వడ్డీలకిచ్చింది, చక్రవడ్డీలు లాగింది. మరో రెండు పెద్దపొలాలు తణకా పట్టింది. వేలుముద్ర మంగమ్మ యిందిగాని చదువేఉంటే ఈ ఖర్మ మింగేదేః అనిపించుకుంది. దశ అంత టితో ఆగలేదు, లాటరీ రూపాయితో లక్షాధికారిణై కూర్చుంది!

వేన్కాన్ చంద్రప్రభకు తనే నాయక పాత్రధారిగా సొంతవ్యయ ప్రయాసలతో ఒకేఒక్క నాటక ప్రదర్శన జరిపించాడు. చంద్రపట్ల అపారసానుభూతి చూపుతూ, నువ్వు హీరో వేస్తే లాభం లేదోయ్ వేన్కాన్! నిర్మొహమాటంగా చెప్పేశారు అభిమానులు. చంద్రప్రభకూడా నాటక నటనకో నమస్కారం పెట్టేసింది. నాటకానికి అందంకంటే వాక్కు, ఒళ్ళు విరుపులకంటే అరుపులు ముఖ్యమనీ, నాటకంలో క్లోజప్పులూ, ఆంగిల్సూ ఉండవనీ గ్రహించి!

నువ్వో ఒక సినిమా తీస్తేసరి, ఇప్పుడంతా కొత్తవాళ్ళతోనే తీస్తున్నారు కూడా, తోల్నిచేసి తారాజువ్వల్లాగ ఒదులున్నారూను - అన్నారు నలుగురూ చేరి వేన్కాన్‌తో ప్రోత్సాహంగా. ఆస్తిచాలా తగలడింది. చాలా పెట్టుబడి కావాలి.

అందుకోసం తిరుగుతూండగా మంగమ్మ మంచి దశలో వెలిగిపోతూన్న సంగతి తెలిసింది. హెచ్చువడ్డీలకి అప్పులిస్తూన్నదని కూడా.

మంగమ్మ బోలెడంత పెట్టుకూర్చునుంది. మిల్లు కొని నడుపుతూన్నది. చాలా మందికి జీతాలిచ్చి పెంచుతున్నది. ధనం మస్తుగా పెరగటంతో మంగమ్మకు కొంత ఔదార్య గుణంకూడా అబ్బింది. దాన ధర్మాలు చేసింది. విరాళాలు యిచ్చింది. పరపతి పెంచుకుంది.నాలుగు రకాల వ్యాపారాల్లో చేయి కలిపింది. పట్టింది బంగారం అవుతోంది. కాని, మంగమ్మకు కొరత తెలిసొచ్చింది. ఇంతా ఎవరికోసం? ఎందుకీ గొడ్డు సంపాదన? తనకొక్క నలుసుంటే ఎంత బాగుండును! అని

అలాంటి సమయంలోనే వేన్కాన్ వచ్చాడు. పెళ్ళిచేసుకోలేదేం? అన్నాడు. పెళ్ళి పెటాకులనే వాటిమీద నమ్మకం లేదంది మంగమ్మ. పెళ్ళి అనేది లేని జంతువులే అదృష్టం చేసుకున్నాయి అని అంది. మంగమ్మను చూసి వచ్చినపనే మర్చిపోయాడేమో - వేన్కాన్, వెనకటి మంగి కాదు-మంగమ్మ-కొత్త మంగమ్మ! కుట్టుదిట్టంగా ఉన్నదేమో, కాణాకదుర్లాగ మంచి బిగువూ అదీ చూసి ఇలాంటి రక్త చందనపు బొమ్మనెలాగ వదులుకున్నాను!! అనుకున్నాడు. మంగమ్మలో ధనంతోబాటు వచ్చిన అందం, ఆక

ర్షణా వేన్కాన్ని కవ్వించాయి. వేన్కాన్ కళ్ళలోదంతా చదివేసింది మంగమ్మ - తప్పుకూడా కాదు. వేన్కాన్ ఎవడో కాదు, వెంకన్నే !- వెంకడే!...తనూ మంగే! ......

ఆ తర్వాత తనకు మనోవర్తిలాగ యిచ్చిన పొలాన్నీ డబ్బునీ తీసుకోమంది, కాని వేన్కాన్‌కి మంగమ్మ ఆస్తి అంతటి మీదా ఉంది కన్ను!- ఇచ్చింది కక్కితే తీసుకోనని బెట్టుచేసి చూశాడు, అంతా నీదే! అనేస్తుందని అంచనా వేసుకొని. కాని మంగమ్మ బెసకలేదు. చల్లగా ఊరు కొంది. చివరికి సినిమా తీయడానికి పెట్టుబడి పెట్టమన్నాడు. యింకా చాలా మాటలు చెప్పి, చిట్టచివరకి పోసీ ఆనే నిచ్చినవే యిమ్మన్నాడు. ఏదైనా ఒక్క సారే, మంగమ్మ దగ్గిర రెండు మాటలు లేవు అని గడుసుగా తప్పించుకొంది. వేన్కాన్‌కి ఒక్కపైస కూడా చిక్క లేదు. అవసరం తీరిపోయినట్లు మంగ మ్మ ముఖం తప్పించుకు తిరగటం మొదలుపెట్టింది. వేన్కాన్ ఆశలన్నీ ఎగిరిపోయాయి, ఎటో వెళ్ళిపోయాడు. చంద్రప్రభ దగ్గరికి వెళ్ళలేదు కొన్నాళ్ల తర్వాత మంగమ్మ ఉక్కుతునకలాంటి బిడ్డడిని కన్నది.

చంద్రప్రభ ఆశలేవీ నెరవేరలేదు, సరిగదా, ఏదైనా పనిచేసి బతకాల్సి వచ్చింది. ఏదో కొద్దిపాటి చదువైనా ఉన్నది గనక చిన్న ఉద్యోగంకోస మని తిరుగుతున్నది. ఎవరో మంగమ్మ దగ్గరికి వెళ్ళమని చెప్పారు. ఒక ధనికు రాలని మాత్రమే గాని, చంద్రప్రభకు మంగమ్మ ఎవరో ఏమిటో ఏమీ తెలీదు. మంగమ్మకూ 'చంద్రప్రభ సంగతేమీ తెలీదు. వెంకన్న ఎక్కడో ఎవర్నో చేసుకున్నాడని వినడమేగాని ఆ పేరే వినలేదు - చంద్రప్రభ - అని. వేళా విశేషం అన్నట్లు చంద్రప్రభను చూడ గానే మంగమ్మకు అకారణంగా మంచి ఆదరణ పుట్టుకొచ్చి తనకు చేదోడు వాదోడుగా మంచి జీతంమీద పెట్టు కొంది. చంద్రకూడా విశ్వాస విధేయ తలతో సహాయపడుతూ మంగమ్మ తలలో నాలికైంది. మంగమ్మకు క్రమ క్రమంగా చంద్రపట్ల మైత్రీ అనుబంధమూ ఎక్కువై తనతో సమాన గౌరవంయిచ్చి దగ్గిరే ఉంచుకొంది. తనలాంటి పల్లె టూరి మోటుదాని దగ్గిర ఒక చదువున్న నాజూకు మనిషి చేరడం ఒక గొప్ప లాగ తోచింది.

మంగమ్మ కొడుకు రవి చంద్రప్రభ దగ్గిర మంచి చేరికై అత్త! అత్త! అంటూ వదిలిపెట్టడు. రవిని చూసుకోవడమూ చంద్ర వంతే! రవిని చూస్తున్నప్పుడల్లా తనకూ ఒక బిడ్డ లేకపోయిందే! అని నిట్టూర్చేది లోపల. చంద్రను ఒదిలేసి వేన్కాన్ వెళ్ళిపోయి చాలా కాలం అయింది ఇంచుమించు చంద్ర వేన్కాన్‌న్ని మరిచిపోయిందనుకోవచ్చు.



తనగతి యింతేనా అనుకునేది లోలోపల. ఒక్కరవ్వకూడా బైట పోక్కనివ్వలేదు మంగమ్మ దగ్గిర. మంగమ్మనూ రవినీ చూసి తనూ ఒక్క మాతృమూర్తి కాలేకపోయానుగదా అనుకునేది. మంగమ్మ చంద్రకు తన ఆస్తి ఆదాయాల్లో కొంత పెడతానంది, కాని చంద్రప్రభ ఎందుకూ నాకు? అనేసింది.

అలాంటి సమయంలో శిశిరంలోనే వసంతంలాగ చంద్రప్రభకు నిరంజన్ తారసపడ్డాడు. చంద్ర మీద చాలా ఆసక్తి, జాలి కనపర్చాడు. తను సినిమా కంపెనీలో ఉన్నానన్నాడు. చంద్ర అందచందాలు చెక్కుచెదర లేదన్నాడు. తనైతే చంద్రను పువ్వుల్లోపెట్టి అద్దాల మేడ ఆరో అంతస్తుకెత్తుదు నన్నాడు. ఉన్నట్టుండి చంద్రప్రభ కనిపించలేదు. మంగమ్మ విసుక్కుంది

కొన్ని నెలల తర్వాత భూదేవిలాగ చంద్రప్రభ వచ్చి మంగమ్మ కాళ్ళమీద పడింది భోరుమంటూ. మంగమ్మ మండి పడింది, "నేను డబ్బున్నదాన్ని; రవి తండ్రి ఏడీ? అని ఎదటకొచ్చి అడగరు, డబ్బు అన్నిటికీ విరుగుడు! నేను మోటు

దాన్ని గనక పెద్దలాగ కనపడతాను గాని వయస్సుబట్టి నువ్వే పెద్దదానివేమో, నేన్నీకు చెప్పడమా?! "అంది. "నిజంవే! నువ్వు ధనవంతురాలివే, నేను బిచ్చ గత్తెనే, కాని యిద్దరమూ ఆడవాళ్లమే కాదా? నాకూ ఆశా పాశా, యెందు కుండవూ? నాకేదీ ఉండకూడదా?" అంది చంద్ర. "నేను కర్కోటకు రాల్ని!, పిల్లికి బిచ్చంపెట్టను! అలాంటి నాకు నీ మీద యింత యిది ఎందుకు కల్గిందో నాకే తెలీదు. నేనసలే తిక్క శంకరమ్మను. ఒకసారి చేరదీశానో, నేను చావాలికాని, వాళ్లెలాంటి వాళ్లయినా కానీ ఒదల్లేను. దూరంగా నెట్టేసు కున్నానో, వాళ్ళు చచ్చినా నాకు కనికరం పుట్టదు—ఒక్కమనిషిని. ఏదైనా ఒక్క సారే, రెండులేదు. నీమీద నాకింత అభి మానం ఎందుకో చెప్పగలవా?" అంది మంగమ్మ. "అదే నాకూ తెలీంది,——" అంది చంద్ర. "నువ్వు చాలా అందమైన దానివి. ఒక అందకత్తె నా దగ్గిర పని చేయడానికివచ్చినందుకు ఉబ్బిపోయాను. నేనూ నీ అంత అందకత్తెనే అయిఉంటే నీకు యింత ఆదరణ లభించేదికాదేమో. ఇంత అందమైన నిన్ను యిలా చేసినవాడు ఎవడు?" అడిగింది మంగమ్మ. "నిరం జన్" అని చంద్రప్రభ నిరంజన్‌తో వెళ్ళిపోయిన సంగతి మాత్రం అంతా చెప్పింది. "సరే, అయిందేదో అయింది. మరేమీ అఘాయిత్యం చేసుకోకు," అని మంగమ్మ అభయం యిచ్చింది. చంద్రకు చక్కటి భవంతి యిచ్చి ఉండమంది. కొన్నాళ్లకి చంద్రప్రభ చక్కటి ఆడ పిల్లను ప్రసవించింది.

ఆడపిల్లపేరు పద్మ. రవి,పద్మ కలిసి ఆడుకునేవారు. చిన్నప్పటినుంచీ రవి వెంట ఛాయలాగ అంటిపెట్టుకొని తిరి గేది పద్మ. పద్మనూ,రవినీ చూసినవాళ్లు ముచ్చటపడేవారు. రవిలోనే ప్రాణాలు దాచిపెట్టుకుందేమో పద్మ. ఇద్దరూ పెద్ద వాళ్లవుతున్నారు చిలకా గోరింకల్లాగ. రెండేళ్లపాటు రవితో మారుమూల పల్లె టూరు వెళ్ళి ఉండిపోయింది మంగమ్మ. రెండేళ్ళతర్వాత వచ్చి రవి పద్మనుచూసి ఆశ్చర్యపోయాడు. పద్మనిండుగా ఎది గిందేకాని అరణ్యవాసంలో సీతలాగ కనిపించింది. రవిని చూడగానే తేరుకొని వికసించిన పద్మమే అయింది పద్మ. పద్మ రవికి కొత్త అందంతో మురిపించి నట్టుంది

"సమానవియ్యం అంటారు...," అని మంగమ్మ చంద్రప్రభకు ఇంచు మించు సగం ఆస్తి రాసింది. పెళ్ళిపంది రిలో వధూవరులు కూర్చున్నారు. పందిరి నిండుగా కళకళలాడుతోంది. ఆహ్వా నితులకు ఘన సన్మానాలు జరుగు తున్నాయి మంగమ్మ బాగా ఖర్చుపెడు తోంది.

దేగలాగ వచ్చి వాలాడు వేన్కాన్. తల్లులిద్దరూ తెల్లబోయారు.



"రవి నా కొడుకు-ఔనా?" అన్నాడు వేన్కాన్ రాబందులాగ చూస్తూ.

"కాదని ఎవరన్నారు గనక — సమయానికివచ్చావు, చక్కా కూర్చో!" అంది మంగమ్మ.

"చంద్రప్రభ ఎవరో తెలుసా?" అన్నాడు వేన్కాన్.

"స్వతంత్రురాలైన ఒక ఆడది!" అంది మంగమ్మ.

"కాదు— నా భార్య!" అంటూ వేన్కాన్ కాగితం చూపి," "చదవగలవా? చదువురాదుకదా...,"అన్నాడు విషపునవ్వు నవ్వుతూనే. "నాపేరిప్పుడు 'వేన్కటచల చిత్రపతి' లే!" అంటూ.

వచ్చినవాళ్ళు పందిట్లోంచి వెళ్ళిపోతున్నారు. అంతటి ఉక్కుమనిషి మంగమ్మ గజగజ కంపించిపోతూ "చంద్రా!...నిరంజన్...!" అంటూ

అరిచి చూసింది. చంద్ర అక్కడ లేదు. అక్కడ్నించి ఎప్పుడో వెళ్ళిపోయింది.

నిరంజన్ దొరకడు! కొన్నివేలు అపహరించి పారిపోయిన నేరం వాడిమీద ఉంది. వాడు నా మనిషే! వాడిని తెచ్చే పూచీ నాది - ఆ డబ్బు సర్దేస్తే వస్తాడు. నువ్వూ చంద్రా పిల్లలకోసం ఆస్తుంమీది మమకారం కాస్తా త్యాగంచేస్తే చాలు, ముడి విడుతుంది. అంతా సర్దుబాటు అవుతుంది క్షణంలో...," అన్నాడు వేన్కాన్, "పెళ్ళి ఆగవలసిన అవసరం లేదు!" అంటూ.

అయితే ఇప్పుడు నువ్వు సునాయాసంగా దోచుకోడానికి వచ్చావన్నమాట-దొంగలు దొంగలు ఊళ్ళు పంచుకుంటారన్నమాట...!" అంది మంగమ్మ తీక్షణంగా.

"మరేం-మగవాళ్ళంటే అంత అలుసనుకున్నావా?" అన్నాడు వేన్కాన్. అంతలో నూతిలో దూకబోతూంటే చంద్రను పట్టుకొని లాక్కొచ్చారు. చంద్ర మంగమ్మ కాళ్ళదగ్గిర కూలబడి పోయింది.

"మేం ఇద్దరం ఇద్దరాడవాళ్ళం - మా ఆస్తులు మాకున్నాయి - స్వతంత్రంగా బతుకుతున్నాం!, మీ మగవాళ్ళతో మాకు పనిలేదు, పద్మకాకపోతే పదిమంది. రవికి పిల్లే దొరకదనుకున్నావా? పద్మకు వరుడు రాకపోతాడా?" అంది మంగమ్మ.

"ఆ సంగతే రవికీ పద్మకూ ధైర్యంగా చెప్పుకోండి," అన్నాడు వేన్కాన్.

"బెదిరిస్తున్నావా? అట్టే మాటాడితే రవి నిరభ్యంతరంగా పద్మనే పెళ్ళాడుతాడు, వరసలూ, సాంప్రదాయాలు మాకు లేవు. ఉట్టి మనుషులం. నీ ఆట యింక సాగదు!" అంది మంగమ్మ.

"అనుకుంటున్నావు - రవి సంగతి నాకు తెలుసు. వాడు నా కొడుకే, మాదంతా ఒక జాతి! మగవాళ్ళం - అంతా ఒకటే, రవి ఒప్పుకోడు?" అన్నాడు వేన్కాన్— వేన్కాట చలచిత్రపతి!

"ఒప్పుకోకపోతే పోనీ, ఎవరెలాగ పోయినా నాకవసరం లేదు. నేనెవరో తెలుసా? మంగమ్మ మంగమ్మే! దేనికీ బెదరదు, చెదరదు, ఉక్కు మంగమ్మ!" అంటూ నిబ్బరంగా విగ్రహంలాగ నిలబడింది మంగమ్మ. చంద్రప్రభ ఉక్కు విగ్రహం పాదాల దగ్గిర కూలబడేఉంది.

పెళ్ళిపందిరి శూన్యంగా ఉంది.

దూరంగా చీకట్లోకి వెళ్ళిపోయినరవిని అనుసరించి పద్మ మోకరిల్లి అడుగుతోంది, "రవీ నేను చేసిన తప్పేమిటి? ఇద్దరం ఒకతల్లి బిడ్డలం కాంగా!" అని.

"చెల్లీ!" అనబోతున్నమాట రవి నాలుక చివరనే ఉంది, అనలేకపోతున్నాడు, అనాలనుకుంటున్నాడు.

"రవీ, నన్నేం చేయమంటావు? నన్నేం చేస్తావు? నేనేం చెయ్యాలి?" అంటున్నది పద్మ.




ముగింపు ఏమిటి ?

ఇద్దరాడవాళ్ల ఆస్తులూ ధారపోస్తే చాలు, తోడుదొంగలు సిద్ధంగా ఉన్నారు, అంతా సర్దిపెట్టగలరు.

మరి, మంగమ్మ అలాంటి మనిషి కాదే ! లొంగేరకం కాదు- ఉక్కు మంగమ్మ !

రవి నిక్షేపంగా చక్కా మరోపిల్లను చేసుకుంటాడు. నిరభ్యంతరంగా నిండు హృదయంతో పద్మను "చెల్లీ ! నువ్వో మంచి వరుడిని...'' అని తప్పక అనగలడు నిర్భరమైన మగ గుండెతో.

కాని - అలాగ అన్నా ! అనలేదు. ఆడపిల్ల. ఆ పిల్లహృదయం వేరు-బలం లేనిది...

పద్మ గతేమిటి ? పద్మ పద్మవ్యూహంలోంచి ఎక్కడికి పోతుంది ? ఒక్క స్త్రీ వ్యూహం ఎలా భేదించుకుపోగలదు ? వెండితెరపై చూడవలసిందే !" అంటూ ముగించాడు సాగరం.

"అబ్బ - అన్నంతపనీ చేసారే !... పద్మ చక్కా రెండు చాక్లెటు మిఠాయిలు కొనుక్కొని చప్పరించి అంతా మర్చిపోతుంది. అంతకీ కాకపోతే సినిమా హాల్లో కూర్చుని మిఠాయిలు చప్పరించుకొంటూ సినిమా అంతా చూసి, అంతా పీడకలలాగ ఎప్పుడో వెండితెరమీద 'శుభం'పడకముందే మర్చిపోతుంది-నిక్షేపంగా !" అంటూ గోదావరి గలగలా నవ్వింది.

"అలా అంటే సరా ?..." అంటూ అంతా మాటాడకుండా వింటూన్న సోమ్మవ్వ లేచి వంటింటోకి నడిచింది.



# ధర్మగుణం

రుద్రామంగ తాయారు

"ఓరే! సుబ్బిగా యిలా వచ్చావేరా?" అన్నారు ధర్మయ్యగారు.

"తవరి దరశనం సేసుకుపోదామని" అన్నాడు సుబ్బిగాడు.

"ఏం అలావున్నావు? వంట్లో బాగా లేదా?''

"అవును బాబయ్యా. పది రోజుల నుండి లేవటంలేదండి. తవరు ఏదైనా సాయం సేత్తే నాలుగురోజుల పాటు తింటాను బాబుగారు."

"ఆ! ఏమన్నావు! ఏదైనా..."

"...మరేనండి ఏదో నాలుగు కుంచాలు ధాన్యంగింజలు యిప్పించండి బాబు. నాలుగు రోజులపాటు తిని ఓపిక గూడుగట్టుకున్నాక పనిలోకి వచ్చి మీ ఋణం తీర్చుకుంటా బాబు."

"నీ కీస్తా కేమిటిరా! అలాగే యిద్దును, కాని సమయానికి ఇంట్లో ధాన్యంలేదు. పోనీ డబ్బులేమన్నా యిద్దామంటే చేతిలో చిల్లిగవ్వలేదు. (ఎక్కడ మళ్ళీ డబ్బు లంటాడో అని ముందుగానే చెప్పేసాడు) ఇవాళ కాకపోతే రేపు యిద్దువు. నీలాంటి నమ్మకస్తుడికి ఇస్తే ఎక్కడికి పోతాయి. పాపం ఓపిక చేసుకుని వచ్చావు. లంక జాలు ఎక్కువ చేసావో ఏమో-మరీ నీరసంగావున్నావు. ఏమే! నిన్నే-కాస్త మజ్జిగ తీసుకురా" గావుకేక పెట్టారు ధర్మయ్యగారు,

ధర్మ ప్రభువులుకాబట్టి మజ్జిగ అనే నీళ్ళు యిచ్చారు.

తడి ఆరిపోయిన గొంతులో ఆ నీళ్లు పోసుకుని—

"వత్తాను బాబుగారు" అని కాళ్ళీడ్చు కుంటూ బయలుదేరాడు సుబ్బిగాడు.

"ప్రతి వెధవకొడుక్కీ అప్పుకావాలి. వీళ్ళకు యివ్వటం-వీళ్ళు మళ్ళీ నాకు తీర్చటమూనా! రేపో మాపో చచ్చేవాడిలా వున్నాడు. అప్పుతీరుస్తాడట అప్పు. దుక్కలావుంటే ఇవ్వొచ్చు దేనికిక్కైనా పనికొస్తాడు," అనుకుంటూ లోపలికి వెళ్ళిపోయాడు ధర్మయ్యగారు.

సుబ్బిగాడు నీరసంగాపోతూ 'ధర్మయ్య బాబుగారు ధరమ పెబువులు. ఒకసారి ఏదో పెట్టి అర్ధరేతిరి పట్టికెళ్ళి పారు గూరు పాపయ్యగారికి యిచ్చినందుకు పాతిక రూపాయలు ఇచ్చారు. నాలుగు ఏళ్ళనాడు ఎలక్షన్లలో ఏ పనీ లేక పోయినా అక్కడివి యిక్కడ, యిక్కడివి అక్కడ చేరేసినందుకు, ఏదో నలుగురితోపాటు అరచినందుకు-రోజూ పది రూపాయలు యిచ్చేవోరు మారాజులు. ఇలా ఎన్నో రూపాయలు లెక్కలేకుండా ఇచ్చారు. అలాంటి మా పెబువులు దబ్బులుంటే ఒక్క పదిరూపాయలు యివ్వరా? ఎంతోటోడికైనా యిబ్బందులుంటాయి. ఇంతకీ నా కర్మ యిలావుండి ఆయనదగ్గర సొమ్ములేక పోయింది. ఈ పది రోజులనుండి మందులకు, మాకులకు ఇంట్లోవున్నవి తాకట్టు పెట్టి—దొరికినంత మట్టుకి అప్పుచేసాను. మాయదారి తెగులు నాకే రావాలా? కూటికిలేక సత్తుంటే మందులకు ఎక్కడ పోయను. ఎదవ పానానికి ఇంత తీపి ఎందుకు?'...ఆలోచిస్తూ యింటికి చేరాడు.

"పేంన సొమ్మసిల్లి పోతంది. గుక్కెడు మంచినీళ్లు యిచ్చేవోరు లేరు గందా' నులక మంచంమీద వాలి పోయాడు.

* * *

నాలుగు రోజులు పోయాక-ఒకనాటి పొద్దుట—

"సుబ్బయ్య పోయాడురా'' అన్నాడొక ఆసామి.

''ఆ! సుబ్బిగాడు పోయాడా! రామ రామ" అంటూ తుపుక్కున ఉమ్మేసాడు మరొక ఆసామి.

"ఏమి టేమిటీ సుబ్బిగాడు పోయాడా ఆ ధర్మయ్యగారి పనిలో తిరిగే సుబ్బిగాడేనా? దుక్కలా వుండేవాడు. ఎట్టా పోయాడు."

సుబ్బిగాడి శవంచుట్టూ పది పది హేనుమంది గుమికూడారు.

"అయ్యో! ఎంత మంచివాడని—ఒకళ్ళని పన్నెత్తుమాట అని ఎరుగడు కదా! మొన్న లంకణాలు పడ్డాడు కాబోలు. రెండు రూపాయలుంటే యిమ్మని వచ్చాడు. సమయానికి చేతిలో చిల్లిగవ్వ లేదు."

"ఏనాడు పెళ్ళాం పోయిందో కాని ఆనాటినుండి ఈనాటివరకు కూడా తనే

వండుకుంటూ పని వున్ననాడు ఎళ్ళి లేని నాడు ముసుగుతన్ని పడుకునేవాడు."

"ఎవరికయినా ఏదైనా సాయం కావలిసొస్తే ముందూ ఎనకా చూడకుండా -తన పనే అనుకొని చేసేవోడు."

"మా లావు కట్టంపడేవోడులే

"ఎన్ననుకుంటే ఏటుంది-యీనాటికి భూమ్మీద నూకలు సెల్లిపోనాయి."

...యిలా ఆ గుంపులోంచి అనేక మాటలు వినిపిస్తున్నాయి. సుబ్బిగాడు చేసిన మంచిపనులకు మరికాస్త మంచి తనం కల్పించి తెగ పొగుడుతున్నారు.

అంతలో ఎవరో "తప్పుకోండి" "తప్పుకోండి" అంటూన్నారు. వెనకాలే ధర్మయ్యగారు ఎంతో దయతో సుబ్బి గాడి శవం చూట్టానికి వచ్చారు. నడుంకు అంటుకుపోయిన పొట్ట, తోటకూర కాడ ల్లాటి కాళ్ళూ చేతులు, అంగుళం లోతుకు పోయిన గాజుకళ్ళు...పాపం అంతోటి పెద్దమనిషికి కళ్ళమ్మట నీళ్లొచ్చాయి (వచ్చేయో రాలేదోగాని భుజంమీద కండువాతో కళ్ళు తుడుచుకోవటం ప్రజలు చూసారు.)

"ఒరే! నాగన్నా! అలాచూస్తావేరా! మన కుడిభుజం పడిపోయిందిరా. దుక్కలావుండి బండెద్దులా పనిచేసే వోడు. ఏది చెప్పినా చిటికలో చేసిపెట్టే వాడు. నేటికి-వీడికి మనకి రుణం తీరి పోయింది. ఇన్ని లంకణాలు చేసినా నాకు తెలియదు. ఏ చిన్న కుర్రాడితో కబురు పంపినా ఒక పాతిక రూపా యలు ఇవ్వలేకపోదునా? అబ్బే వాడు ఎలా అడుగుతాడు. అభిమానంఎక్కువ. అసలు కూలిపనిలోకి వచ్చినపుడే అడిగే వాడు కాధు. ఇస్తే పుచ్చుకోవటం-లేక పోతే లేదు ఇలాటివాడు పోవటం మా దురదృష్టం. ఇవిగో యీ యాభై పట్టు కెళ్ళి పుల్లలుగట్రా చూడండి," అంటూ మళ్ళీ కళ్లు తుడుచుకున్నారు ధర్మయ్య గారు.

"మారాజులు యిట్టేవచ్చి అట్టే ఏభై రూపాయ లిచ్చారు."

"ముందే ఓ వంద అడిగి వుంటే యీడికి చావు రాకపోనుగదా."

...ధర్మయ్యగారి ధర్మగుణాన్ని ప్రజలు ఆశ్చర్యపోతూ చెప్పుకున్నారు.

* * *

ఈ సారికూడా ఎలక్షనులో ధర్మయ్య గారే గెలిచారు. అందుకు కారణం- 'ఆయన ఔదార్యం. సాటిమనిషిని కన్న బిడ్డలా చూసే తత్వం. ఆయన గుణమే గుణం-ధర్మగుణం' అన్నారు ప్రజ లంతా.

కాని ఒక తూరీగ మాత్రం- 'ఆయన గుణం మీకేం తెలుసు, బ్రతికి నంతకాలం సుబ్బయ్య శక్తిని జలగా పీల్చాడు. తీరా చచ్చిన తరువాత వాడి శవానికి ఏభై రూపాయలు పెట్టుబడిపెట్టి ప్రజల అభిమానాన్ని కొన్నాడు'— అంటూ త్వరున ఎగిరిపోయింది.



# రెండో పెళ్ళి

కొడవటిగంటి కుటుంబరావు

శేషాచలంగారు ముప్ఫైతొమ్మిదో ఏట పదేళ్ల పిల్లని రెండో పెళ్ళి చేసుకున్నాడు. ముప్ఫైతొమ్మిదేళ్ళవాడికి పెళ్ళాం అవసరమనేది శేషాచలంగా రంగీకరించాడు గాని తనకన్న ఇరవైతొమ్మిదేళ్లు చిన్నదైనపెళ్ళాం ఆయనకుతృప్తికరంగాలేదు. తనకు ముప్ఫై ఏళ్ల కన్య ఎట్లా దొరుకుతుందీ? దొరికితే మటుకు పెళ్లాడితే నలుగురూ ఏమంటారు? పోనీ, పెళ్ళిచేసుకోకుండా ఉందామా అంటే ఇతర విషయాలట్లా ఉంచి తనకిన్ని నీళ్లు వదలటానికన్నా లేరే!

తీరా పెళ్ళి అయింతరవాత ఆలోచిస్తే నలుగురూ బలవంతాన తన పెళ్ళి చేసినట్టుగా తోచిందాయనకు.

"ఇంకా నలభై కూడా రాలేదుగా!" అన్నారు కొందరు, ఇంకో సంవత్సరంలో తనకు వివాహ యోగ్యత లేకుండా పోయేటట్టు.

"నీకు బుద్ధిఉందా! నీకన్న ముప్ఫయ్యేళ్లు చిన్నపిల్లనేమని పెళ్ళాడావు!" అన్నవాడు లేడు. రేపటినించీ ఆ మాట అననివాడూ ఉండడు.

పెళ్ళికి ఎదిగిన పిల్లలు రెండు జాతులుంటే బాగుండును తనకు ఈడయిన వారిని చేసుకోదగినవాళ్లూ, ముసలి వాళ్లను మాత్రమే చేసుకోదగినవాళ్లూ అంటూ! ఒక పిల్లకు చిన్నమొగుడే దొరుకుతాడో పెద్ద మొగుడే దొరుకుతాడో నిర్ణయించటానికి లేకపోవటం దారుణం.

లేదా చిన్నపిల్లల ఆటల్లో 'దొంగ' అయే మనిషిని నిర్ణయించటానికి కొన్ని నిబంధనలు పెట్టినట్టు, పెద్దవాళ్ళకు చిన్నపిల్లల్ని అంటగట్టటానికికూడా కొన్ని నిబంధనలు పెడితే?

తన పెళ్ళాన్ని ఏ డెబ్భయ్యేళ్ళ మొగుడికో ఇవ్వాలని శాసనం జరిగి ఉండి ఆ మీదట తను...నలభై కూడా




లేని వాడు—మొగుడైతే ఎంత సంతోషించేది!

ఆడవాళ్లెంతలోకి ముసలాళ్లవుతారో! ఇద్దరి పిల్లల్ని కంటే తన భార్య మరో పదేళ్లలో అవ్వ అవుతుంది.

శేషాచలంగారను కున్నట్టే పార్వతమ్మ ఇరవై ఏళ్ళయినా రాకపూర్వమే ఇద్దరుపిల్లల్ని కని నేవళం పోగొట్టుకొన్నది. ఆ దంపతుల వయస్సులో తేడా గమనించటంకూడా మరిచారు ప్రజలు. చిన్నపిల్ల మొగుడుకావటం వల్లనో ఏమో శేషాచలంగారి పదిసంవత్సరాల కాలంలోనూ ఏమీ మారలేదు తెల్ల వెంట్రుకలు జాస్తికావటం తప్ప.

ఇంకో ఇరవైఏళ్ళు గడిచినై. శేషాచలంగారు రాయల్లే ఉన్నాడు. చత్వారం లేదు, పల్లుకదలటంలేదు, నడుమునొప్పి లేదు, చెవుడు లేదు. పార్వతమ్మ అప్పుడే రెండు దంతాలు పీకించి కళ్ళజోడు పెట్టింది. ఆవిడ తలకట్టు జనపనారపాళానికి వచ్చేసింది.

శేషాచలంగారు తన వివాహంగురించి ఒకప్పుడు పడ్డ దిగులంతా పూర్తిగా మరిచాడు.

వాళ్ల పెద్దబ్బాయి బి. యే. ప్యాసయి, ఉద్యోగం సంపాదించి పైకొస్తున్నాడు. వాడు కథలూఅవీరాస్తున్నట్టూ, వాటిని నలుగురూ బాగున్నవంటున్నట్టూ విని శేషాచలంగారు సంతోషించారే, కాని ఆ కథలేవీ తనుమాత్రం చదవలేదు

ఒకనాడు అబ్బాయి ఇంట్లో లేని సమయంలో పోస్టు బంట్రోతొచ్చి ఒక పత్రిక పడేసి పోయినాడు. శేషాచలంగారు పరధ్యానంగా పత్రిక తిప్పి పేజీలు తిప్పుతుంటే కుమారుడిపేరు కళ్లపడింది. ఆయన చిరునవ్వు నవ్వుకుంటూ చదవనారంభించాడు. కథ పేరు 'మా తాత.' అబ్బాయికి మంచి ఊహాజ్ఞానం ఉండి ఉండాలి. లేకపోతే వాడేతాత నెరుగును గనుకా!

చదువుతున్నకొద్దీ శేషాచలంగారి మొహం పాలిపోయింది. అబ్బాయికథలో తాత మూడు మూర్తులా శేషాచలంగారే!

# మరి, మీరేమంటారు?

-అరిగే రామారావు-



శ్రీదేవి బస్సులోంచి చెయ్యి బయటికి జాపి సూరిబాబు అందించినవక్కపొడి పొట్లం అందుకుంది.

సూరిబాబు పొట్లం అందిస్తూ ఆమె చేతిని మృదువుగా నొక్కాడు.

ఆమె వంక దిగులుగా చూస్తూ, "ఇప్పుడు నీవు హైద్రాబాద్ వెళ్ళక పోతేనేం దేవీ!" అన్నాడు బరువుగా.

అతని వంక ముసిముసిగా చూస్తూ, "వెళ్లకపోతే ఎట్లా దేవరా?" అంది తేలిగ్గా నవ్వేస్తూ.

మళ్ళీ కిసకిస నవ్వింది; నవ్వుతూ సీట్లోంచి ముందుకువంగి ముందున్న జడను వెనక్కేసుకుని మళ్ళీ వెకక్కి వాలుతూ బుక్‌స్టాల్‌కేసి చూసింది.

ఆశ్చర్యంగా, "అరే అప్పుడే 'స్టార్ డస్ట్' కొత్తది వచ్చేసిందే!" అని "తీసి కోండి!" అంది గోముగా.

సూరిబాబుకు ఆడంబరానికి అనవసరపు ఖర్చులు పెట్టటమంటే గిట్టదు. అందుకే, "మూడురూపాయలు తగలేసి కొంటం దేనికి? ఎటూ మా ఆఫీసు 'బుక్ సర్కిల్‌కి' వస్తుందిగా, అప్పుడు చదువుదువుగాన్లే!" అన్నాడు.

చదివినా చదవకపోయినా ప్రయాణాలు చేస్తూన్నప్పుడు చేతిలో మేగ

జైన్లు - అందులో ముఖ్యంగా ఇంగ్లీషువి- పట్టుకొనటం 'రూలూ' ఫ్యాషనూ, అని అతనికి తెలియదు. కాని, అతని సతీ మణికి తెలుసు. అతనికి తెలియకపోవ టాన్ని 'పిశనారి' తనంగా కట్టి "ముష్టి మూడురూపాయలకు మీ ముల్లేం పోదు లేండి!" అంది.

భార్య మూతి విరుపుకు ఏమను కున్నాడో ఏమో మారు మాట్లాడకుండా వెళ్ళి పుస్తకం కొనుక్కొచ్చాడు.

పుస్తకం అందిస్తూ, "ఇంటర్వ్యూ కెళ్ళుతున్నదానివి జనరల్ నాలెడ్జి పుస్తకాలు చదవాలిగాని, ఈ మేగ జైన్లా చదివేది!" అని అన్నాడు

"ఎంత పిచ్చివారండీ! ఉద్యోగాలు యిచ్చేది మన జనరల్ నాలెడ్జిని చూశా?" అంది.

సూరిబాబుకూడా నవ్వేడు. నవ్వ టానికి నవ్వేడు గాని, మళ్ళీ వెంటనే బోలెడు దిగులు అతన్ని కమ్ముకుంది.

"ఆఫీసులో వెధవది ఈ ఇన్స్పెక్షన్ తగలడకపోతేనేనూనీ వెంట వచ్చేవాడ్నే! పాపం, నీవు అక్కడ ఎంత యిబ్బంది పడతావో ఏంటో?" అన్నాడు దిగులుగా.

శ్రీదేవి గర్వంగా నవ్వేసి, "తెలియని వాళ్లకిబ్బందిగాని, నా కేం టి? నేను బియ్యేని——" అంది.

"అప్పుడే కాదు.ఇంకా రెండు పార్టులు మిగిలిపోయాయి - మర్చిపోయావా ?" అన్నాడు.

ఆ మాటకి శ్రీదేవికి కోపం వచ్చింది. కొనదేలిన ఆమె ముక్కుమీదికి వంటి కాలిమీద వచ్చిన కోపంకు కూడ అందం వచ్చేసింది. ఆమె మూలంగా ఆ సూపర్ డీలక్సు బస్సుకు కూడా బోలెడు అందం వచ్చేసింది. బస్సులోకి కాలు పెట్టిన ప్రతి వారూ ఆమె మీదనుంచి కళ్లుతిప్పుకోలేక పోతున్నారు. అందుకు కారణం ఖరీదైన కాశ్మీరు సిల్కుచీరలో, మెళ్లో ముత్యాల గొలుసుతో, చెవులకు ముత్యాల దుద్దు లతో ఒక చేతికి ఖరీదైన రిస్టువాచీతో, మరోచేతికి మూడుజతల బంగారు గాజు లతో ఆమె ధగధగలాడిపోవటమే కాదు; పోత పోసిన దేవతావిగ్రహంలాగా ముందు వరుస సీట్లో కాలుమీద కాలేసు కుని యువరాజ్ఞి ఠీవితో కూర్చున్న ఆమె అందం కూడా కారణమే!

ఇంతలో సూపర్ యూనిఫారంలో సూపర్మేన్ పోజులో (బీడి త్రాగుతూ) బస్సెక్కిన డ్రైవరు మరో అయిదు నిమిషాలల్లో గణగణా గంటకొట్టి బస్సును స్టార్టుచేసి, 'రైట్కు కోసి' అవుట్ గేట్లోంచి దూసుకు పోయాడు.

సూపర్ డీలక్సు చుట్టూ తిరిగి వచ్చే సరికి సూరిబాబు ఫైర్స్టేషన్ దగ్గర సైకిలుపట్టుకుని నిలబడి మళ్లీ ఇంకోసారి చెయ్యూపి శ్రీదేవికి 'టా టా' చెప్పాడు.

కనకదుర్గ గుడి దీపాల్ని చూచి కళ్ళుమూసుకుని మనస్సులోనే మొక్కు కుంది. తనకి ఉద్యోగం వస్తే ఆమెకు




కుంకుమపూజ చేయిస్తానంది; వంద కొబ్బరికాయలు కొట్టుతానంది; లక్షపత్రి పూజ చేయిస్తానంది.

తనకు రాబోయే ఈ ఉద్యోగానికి జీతం నెలకు మూడొందలఏభై పైనే వస్తుందంట. తను ఉద్యోగం చెయ్యటం సూరిబాబుకి సుతరామూ యిష్టంలేదు. నీవు ఉద్యోగం చేయవల్సిన ఖర్మ మన కేంటి? మనకేం తక్కువయిందనీ; నాకు వచ్చేజీతం మనకుసరిపోదా.మనకువోగంపెడు పిల్లా పీచూ వున్నారనా, వాళ్ళను పోషించలేమనా తాపత్రయం-అని అంటాడు. నిజమే ఏమీ తక్కువ కాలేదు, ఆయనకు జీతం నెలకు ఆరొందలు పైనే వస్తుంది. ఎంత జల్సాగా ఖర్చుచేసినా ఇంకా వందా రెండొందలు మిగులుతాయి కూడా. ఇక పిల్లా పీచూ మాటకొస్తే ప్రస్తుతానికి ఎవరూలేరు. (పెళ్ళయి ఇంకా రెండేళ్ళు కాలేదు. కాబట్టి తనకూ కంగారుగా లేదు!)

అలాగని అదనంగా నెలకు మూడు నాల్గొందలు వస్తూంటే చేదా? మనకేం తక్కువ అని బంగారంలాంటి ఉద్యోగం కాళ్ళదగ్గరకు వస్తుంటే వద్దంటామా? నెల నెలా వచ్చే ఈ డబ్బులతోఎన్నో కొనుక్కోవచ్చు. ఇంకా ఎంతో జల్సాగా, దర్జాగా, ఆడబంరంగా బ్రతకవచ్చు. డబ్బు చేదా?

ఇలా ఆలోచిస్తూంటే శ్రీదేవికి సైకిలు పట్టుకుని రైల్‌స్టేషన్ ముందు నిలబడ్డ భర్తా అతని చేతిలోని సైకిలూ గుర్తుకు వచ్చాయి. ఆ సైకిలుకు (అవ్వటానికి కొత్తదే! ఈ మధ్యే అయిదొందలు పెట్టి కొత్తది కొన్నాడు) బదులు ఏ స్కూటరో పట్టుకుని వుంటే ఎంత బాగుంటుంది! ఎంత దాబుగా వుంటుంది!

తనకి ఉద్యోగం రాగానే వాయిదాల పద్ధతిమీద ఒక స్కూటర్ కొనేయాలని అప్పటికప్పుడు నిశ్చయించుకుంది. ప్రతినెలా తనకొచ్చే జీతం డబ్బులు కట్టేస్తే ఒక్క ఆర్నెల్లల్లో అప్పు తీరి

పోతుంది. రోజూ స్కూటర్ మీద యిద్దరమూ ఆఫీసుకెళ్ళవచ్చు. షాపింగ్‌కూ, సినిమాలకూ, గుళ్ళకు గోపురాలకూ, విందులకు వినోదాలకూ 'ఝుయ్' మంటూ వెళ్ళవచ్చు.

తన జీతం డబ్బులతో ఇంకా ఏవేమి కొనాలా అని ఆలోచించింది, గాడ్రేజ్ బీరువా, సీలింగ్‌ఫాన్, ఖరీదైన రేడియో సెట్టు, రోజ్ వుడ్ టాయిలెట్ టేబిల్, స్ప్రింగ్ మంచాలు, డన్‌లప్ పరుపులూ. బాయిలర్, గ్యాస్‌పొయ్యి, స్టీలు సామాన్లూ — ఇవన్నీ ఉన్నవే; వీటిలో కొన్నింటిని తన పుట్టింటివాళ్లు యిచ్చారు. మరికొన్ని భర్త జీతంలోంచి కొన్నవి. సొంత ఇల్లూవాకిలీ వుంది; అతని తాత తండ్రులు సంపాదించి యిచ్చింది. కట్నం క్రింద తనవాళ్ళిచ్చిన ఆరెకరాల మాగాణి కూడ వుంది

ఇంతలో, "నీవూ హైదరాబాదుకేనా పాపా?" అని ప్రక్కన కూర్చున్న ముసలమ్మ మెల్లగా తనని మాటల్లోకి దింపింది.

తనకు చిరాకనిపించింది. తనేదో సీరియస్‌గా ఆలోచించుకుంటూంటే తనని అనవసరంగాడిస్టర్బ్‌చేస్తూన్న ఆ ముసలమ్మమీద కోపంకూడా వచ్చేసింది. పైకి ఆమె అడిగినవాటికి పొడిపొడిగా సమాధానాలు చెప్పింది.

"దొంగలు బస్సుల్నాపి దోచుకుంటున్నారంటగా పాపా!" అంది ఆ ముసలమ్మ మెళ్ళో బంగారుకంటెను భయం భయంగా చేత్తో తడుముకుంటూ.

"ఏమో, నాకు తెలియదు—" అని సీట్లోకి జారగిలపడి కూర్చుంది. ఆ ముసలమ్మతో మాట్లాడడం యిష్టంలేక కళ్ళు మూసుకుని నిద్రపోతున్నట్లు నటించింది. నిజంగానే మరి కాసేపటికి కలతనిద్రలోకి జారిపోయింది. ముసలమ్మ గురక నిద్రలోకి దిగింది.

కలత నిద్రలోనే శ్రీదేవికి ఆల్విన్ కంపెనీవారి అందమైన చిన్న ఫ్రిజ్ కనిపించింది. అలాంటి ఫ్రిజ్‌ను ఈ మధ్యనే తన బంధువులింట్లో చూసింది. అందులోంచి కూల్‌డ్రింకు తీసి తనకిచ్చారు. కూల్‌డ్రింక్ త్రాగుతూ అలాంటిది తనకు కూడా వుంటే ఎంత బాగుంటుందని మనస్సులో అనుకుంది.

...బస్సు కుదుపుల్లో కలతనిద్ర కాస్తా చెరిగిపోయింది. కాని ఆ ఫ్రిజ్ బొమ్మమాత్రం మనస్సులోంచి చెరిగిపోలేదు తనకు ఉద్యోగం వచ్చిన తర్వాత అలాంటిఫ్రిజ్ కొనుక్కోవాలనుకుంది. దాన్తోపాటు రేడియోగ్రాం, బట్టలు వుతికే మిషన్, పిండి రుబ్బే మిషన్, రవ్వలసెట్ — ఇలా ఎన్నో ఐటమ్స్ తన బంధువుల ఇళ్లళ్లోనో, ఫ్రెండ్సు ఇళ్లళ్లోనో చూచినవన్నీ ఆ క్షణంలో తన కళ్ళముందు కనిపించాయి. మనస్సులోనే ఒక పెద్దలిస్టు తయారయింది. ఆ లిస్టును ఒక్కసారి క్రిందనుంచి పైకి చూచి,

అమ్మో! ఇన్ని వస్తువులు తనకు లేవా అనుకుంది. ఇప్పటివరకు త న క న్నీ వున్నాయే అనుకుంది. తనకు లేనివి ఇంకా ఎన్నో వున్నాయని ఇప్పుడే తెలుసుకుంది.-తనెంతో తక్కువస్థితిలో వున్నాననుకుంది. తను ఎంతో హీనస్థితిలో వున్నట్లు చిత్రించుకుంది. తను అనుభవిస్తున్న దారిద్ర్యాన్ని రకరకాలుగా ఊహించుకుని కుమిలిపోయింది. తనంత దురదృష్టవంతురాలు తను తప్ప ఇంకెవరూ వుండబోరనుకుంది. తనమీద తనకు చిరాకేసింది. తన భర్తమీద చిరాకేసింది. ప్రభుత్వంమీద చిరాకేసింది. అసలు తను ఉద్యోగం ఎప్పుడో చెయ్యవల్సింది. తన కీ అవకాశాన్ని ఇంత ఆలస్యంగా అందిస్తూన్న ప్రభుత్వం యొక్క చేతకానితనాన్ని తిట్టుకుంది. ఇప్పటికయినా చేయబోతున్నాను. ఇది మేలే అనుకుంది—ఇలా అనుకుంటూ మళ్లీ నిద్రలోకి జారిపోయింది.

* * *

తలుపు తెరచి ఎదురుగా శ్రీదేవిని చూచి చాల ఆశ్చర్యపోయాడు సీతాపతి.

మీటర్‌చార్జీ మీద ఒక రూపాయి అదనంగా 'టిప్' యిచ్చేసరికి టాక్సీడ్రైవరు చాల సంతోషించాడు. తానే సూట్‌కేస్ తెచ్చి లోపలపెట్టి సలాం చేసి వెళ్ళిపోయాడు.

"ఏంటి, ఉత్తరం పత్తరం లేకుండా ఇలా ఊడిపడ్డావ్?" అన్నాడు సీతాపతి.

"ముందుగా లెటర్ వ్రాయటానికి టైం లేకపోయిందన్నయ్యా!" అని తనొచ్చిన పనిగురించి చెప్పింది.

సీతాపతి తన పిన్నికొడుకు. హైద్రాబాద్‌లో ఏదో ప్రైవేటు కంపెనీలో ఆఫీసరుగా పనిచేస్తున్నాడు.

"అయితే నీవూ ఉద్యోగం చేస్తావన్నమాట!" అని నవ్వి సూట్‌కేస్ లోపల పెట్టబోయి తన చేతులవంక చూచుకున్నాడు.

చేతులనిండా మసి వుంది. బాయిలర్‌లో బొగ్గువేస్తూ వచ్చాడు. మసిచేతులు శ్రీదేవికి చూపించి, ఆమెతోపాటు తనూ నవ్వేడు.

"వదిన ఏది?" అంది.

"ఇంకా నిద్ర లేవలేదు.'' అని అంటుండగా అతనిభార్య అరవింద చంటిపిల్లను ఎత్తుకుని బయటికి వచ్చింది నవ్వి శ్రీదేవిని పలకరించింది.

"ఇదేనా మొన్న రిలీజయిన కొత్త బొమ్మ!" అంటూ పాపను ఎత్తుకుంది శ్రీదేవి.

"మొదటి బొమ్మ కూడా ఇదే!''అని సీతాపతి నవ్వుతూ బాయిలర్ వెలిగించటానికి దొడ్లోకి వెళ్ళాడు.

''పాప డల్‌గా ఉందేం వదినా?"

"రాత్రంతా ఊరికే ఏడుస్తూనే ఉంది." రాత్రంతా నాకూ దానికీ నిద్రలేదు. మీ అన్నయ్యమాత్రం గురకపెట్టి మరీ నిద్రపోయాడు" అంది నవ్వుతూ.

పలకరింపులయ్యాక తను మొగం కడగటానికి సిద్ధమయింది.

గడియారంలో ముళ్ళు కదులుతున్న కొద్దీ ఆ ఇంటిలో హడావుడి జాస్తి అవుతూంది. పాత్ర సామానుల చప్పుళ్లూ, విసుక్కోవటాలు, కసురుకోవటాలు, పాప ఏడ్పూ, గదమాయింపులూ—అదంతా ఒక పెద్ద సీనులాగా వుంది.

సీతాపతి ఉదయం తను వచ్చినప్పుడు బాయిలర్‌లో బొగ్గు వెయ్యడమే కాదు, భోజనాలు చేసి ఆఫీసుకెళ్ళే లోపల ఎన్నో మొగపనులూ, ఆడపనులూ తనే చేస్తూ ఈ గదిలోంచి ఆ గదిలోకి, ఆ గదిలోంచి ఈ గదిలోకి బొంగరంలాగా తిరుగుతున్నాడు. అరవిందకు పాప సవరింపుతోనే సరిపోతూంది. అతనికి ఉదయం పేపరు చదవటానికి కూడా క్షణం తీరికలేదు, తను కాఫీ త్రాగుతూ బద్ధకంగా అవులిస్తూ పేపరు తిరగేస్తూ కూర్చుంది. అతను హడావుడిగా అటొచ్చీ ఇటొచ్చీ - కిసింగర్ ఢిల్లీలో దిగేడా, ఇంతకీ మన మొగాన ఆహారధాన్యాలు పడేస్తానంటున్నాడా లేదా—అని అడుగుతూ తనని పలకరిస్తోన్నాడు.

అతడ్ని చూస్తూంటే తనకు నవ్వూ, జాలీ కూడ కలుగుతున్నాయి. ఇంత 'ఎవ్వర్ బిజీమేన్' అతను లోగడ చదువుతున్న కాస్టింగ్ పూర్తి చేసి వుంటాడా అని అనుమానం వచ్చింది. అదే అడిగింది. అప్పుడతని చేతిలో పప్పుతెడ్డు వుంది

"కాస్టింగ్" పోయి, ఇదిగో ఈ తెడ్డింగ్ వచ్చింది. "అని నవ్వుతూ తెడ్డు చూపిం చాడు"

మళ్ళీ అన్నయ్యే అన్నాడు. మీ వదిన జాబులో చేరాక అంతకుముందు చదువుతున్న కాస్టింగ్ మానేశాను. అది పాసయి వుండే ఇంకా పెద్ద ఆఫీసరుపోస్టు వచ్చి వుండేది..."

అరవింద రుసరుసలాడుతూ "వదిన జాబులో చేరింది కాబట్టే మీ అన్నయ్యకు 'రాజ్‌దూత్' వచ్చిందమ్మాయి!" అంది.

అప్పుడు తను ముందు గదిలో (టార్పాలిన్) ముసిగేసి వున్న మోటర్ సైకిల్ను చూచింది. ఒక చిన్న రథం లాగా ముచ్చటగా వుంది. తనూ సూరి బాబుకు ఇలాటిదే కొనివించాలి. వెధవ స్కూటర్ దేనికీ అనుకుంది.

గంట తొమ్మిది కొట్టేసరికి యిద్దరూ ఆఫీసుకు బయలుదేరారు. చెరొక టిఫిన్ కారియర్‌లో అన్నం పెట్టుకున్నారు. అరవింద తనకు భోజనం వడ్డిస్తానంది తనప్పుడే వద్దు, తర్వాత తింటానంది. ముగ్గురూ సీతాపతి చేసిన వుప్మా తిని మరో విడత కాఫీలు త్రాగారు.

సీతాపతి డూప్లికేట్ తాళం చెయ్యి యిచ్చి "నీవు బయటికి పోవాలంటే ఇంటికి తాళం వేసిపో," అని తనతో చెప్పాడు.

"ఇంటర్‌వ్యూ రేపుగా, ఇవాళ్ళంతా రెస్టు తీసుకోనీయండి!" అంది అరవింద.




సీతాపతి తన రథాన్ని తీసి బయట యింటిముందు పెట్టాడు.

అరవింద ట్రిమ్‌గా తయారయి కళ్ళకు జోడు తగిలించుకుని, ఒక భుజాన వేనిటీబాగ్ తగిలించుకుని, మరో భుజాన ఆ ఆర్నెల్ల పాపను వేసుకుని, ఒక చేత్తో టిఫిన్ కారియర్ పట్టుకుని పొరుగూరుకు ప్రయాణమైనట్టు బయలు దేరింది.

"పాపనుకూడ ఆఫీసుకు తీసుకెళ్తావా?" అని తను అమాయకంగా అడిగాడు.

అరవింద నవ్వి "మా ఆఫీసుకు దగ్గర్లో ఒక 'ఛైల్డ్ కేర్' సెంటర్ వుంది. అందులో వదిలేస్తా," అంది.

"పాప నలతగా వుందికదా వొదినా పోనీ ఈ రోజుకు శలవు పెట్టక పోయావా?"

"శలవులన్నీ డెలవరీకి లాగేసింది. మళ్ళీ ఇప్పుడు శలవు పెట్టితే వాళ్ళ ఆఫీసరు వూరుకోడు. అసలికే ఛండశాసనుడు." అన్నాడు సీతాపతి.

తీరా బయల్దేరబోయేముందు అరవింద, "అయ్యో మరచిపోయా!" అని మళ్ళీ లోపలికి వచ్చింది.

కారియర్ క్రిందపెట్టి కుర్చీలో కూర్చుని జాకెట్ గుండీలు విప్పి పాపకు పాలు ఇవ్వటం మొదలుపెట్టింది. సీతాపతి టైం అయిపోయిందంటూ చిందులు త్రొక్కుతున్నాడు,

"మధ్యలో పాపకు పాలు కావాలంటే ఎలా వదినా?"

'మధ్యలో రెండుసార్లు వెళ్ళి నా పాలు ఇచ్చి వస్తూ వుంటా. అంతకీ ఏడుస్తే ఆయా డబ్బాపాలు పట్టుతుంది. రోజూ ఉదయం సాయంత్రం, ఆఫీసు టైంలో పాలివ్వటానికి సెంటర్ కెళ్తున్నానని మా ఆఫీసరు వూరికే మండి పడుతున్నాడు" అంది అరవింద.

ఉద్యోగాలు చేసే ఆడవాళ్ళకు పసిపిల్లలుంటే కష్టమే అనుకుంది. యింట్లో ఎవరన్నా ముసలమ్మలుంటే ఫర్వాలేదు. కొంతవరకు అనుకుంది, అదేఅరవిందతో

అంటే ఆమె నవ్వి. "మనం వుద్యోగాలు చేస్తున్నామని చచ్చి స్వర్గాన వున్న మామ్మలు రావాలీ ఇక" అంది బ్లౌజు గుండీలు తిరిగి పెట్టుకుంటూ.

టాటాలు అయినాక 'రాజదూత్' దూసుకపోయింది. శ్రీదేవి తలుపువేసి లోపలికి వచ్చింది, ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. జడివాన కురిసి వెలిసినట్లుంది. బిక్కుబిక్కుమంటోంది. ఆమెకు ఏమీ తోచలేదు. వీళ్ళకేమేమి సామానుందో తెలుసుకుందామనే కుతూహలంతో అల మారలూ అవీ ఇవీ తీసి చూచింది. పెద్దగా చెప్పుకోదగ్గంత సామానులు లేవు. సామాన్యమైనవి మాత్రమే వున్నాయి. ముఖ్యంగా ఫ్రిజ్; రేడియో గ్రామ్ లాంటివి లేవు. మరి నెల నెలా వీళ్ళకొస్తున్న జీతం డబ్బులు ఏంచేస్తు న్నారో? సీతాపతి అన్నయ్య జీతమే వెయ్యిదాకా వస్తుందని తనకు తెలుసు ఇంత డబ్బు ఏంచేస్తున్నారో అను కుంది. ఆదేవిషయం రాత్రికి అరవిందమ అడిగితే ఇల్లుకొంటానికి డబ్బు కూడ బెట్టుతున్నామని చెప్పింది.

శ్రీదేవి కాసేపు రేడియో పెట్టుకుని కూర్చుంది. వూరికే ఆవలింతలు వస్తూ వుంటే స్నానం చేద్దామని చీరా. టవల్ తీసుకుని బాత్‌రూంలోకి వెళ్ళింది.

బాత్‌రూం వెనుక వైపు దొడ్లో ఉంది. అది అందరికీ కామన్ బాత్‌రూం లాగా వుంది దానికి ఆనుకుని వేరేచిన్న పెంకు టింటి పోర్షన్ వుంది. ఆ యింటికీ దీనికీ మధ్య గోడే అడ్డు ఆ యింటిలో వాళ్ళు మాట్లాడుకునే మాటలన్నీ బాత్‌రూంలోకి స్పష్టంగా వినిపిస్తున్నాయి.

"అమ్మా ఈ పూటకు బియ్యంలేవే!" ఒక యువతి కంఠం వినిపించింది.

వాళ్ల అమ్మ రోగిష్టి మనిషిలాగా వుంది, వూరికే దగ్గుతూ, ఆయాస పడుతూ, "బియ్యంలేకపోతే ఏంచేస్తావు? నాలుగు రొట్టెలన్నా చేసి పడేయ్. మాయ దారి మంద వున్నారుగా నా ప్రాణానికి. తలా వొక రొట్టె తిని ఇన్ని నీళ్ళుతాగి పడివుంటారు—" అంది

"పిండికూడ లేదు" అంది ఆమె కూతురు.

"లేపోతే దేంట్లోనన్న పడి చావండి పీడా విరగడయిపోతుంది. లేపోతే ఇంత ఎలుకలమందు నీళ్ళల్లో కలిపి తలా ఒక గ్లాసు త్రాగండి—అంతా కట్టకట్టు కుని చద్దాం—"

మిగతా మాటలు దగ్గుతెర మాటున అణిగిపోయాయి. కంగు కంగున దగ్గి ఆయాసపడుతూ మళ్ళీ, "అమ్మా, నాయన...ఓరి దేముడా, ఆ చచ్చి నోడితోపాటు నన్నూ తీసుకపోతే నాకీ కష్టాలుండేవికాదు గదరా తండ్రీ!" అంది.

"అమ్మా, నీవు అనవసరంగా మాట్లా డకు—వూరికే ఆయాసపడుతూ. ఈ పూటకు నేనేదో చేస్తాలే!"

"ఏంచేస్తావే తల్లీ? తొలిచూలువు నీవు ఆడముండ వయిపోయావు-అదే ఏ మొగ వెధవో అయివుంటే మనకిన్ని కష్టాలుం డేవికావు." అంది ఆ రోగిష్టామే.

ఇంతలో చిన్న పిల్లలు కాబోలు కొట్టు కుని యిల్లంతా ఎగిరిపోయేటట్లు ఏడు స్తున్నారు.

శ్రీదేవికి చాల చిరాకనిపించింది. హాయిగా స్నానం చేద్దామని వస్తే ఇదె క్కడి పీడరా బాబు అని విసుక్కుంది. వేడి వేడి నీళ్లు కాని, ఫారిన్ సబ్బు వెద జల్లే ఆ సువాసనలు గాని ఆమెకు సేద గలిగించలేదు పక్కింటి భాగవతంతో ఆమె మనస్సుకు ఆలసట ఇంకా ఎక్కు వయింది. గబగబా రెండు చెంబుల నీళ్లు దిమ్మరించుకుని వచ్చేసింది.

భోంచేస్తూ ఈ పూట ఆ యింట్లో వాళ్లు ఏమి తిన్నారో అనుకుంది. అన్నం సహించలేదు. చెయ్యి కడుక్కుని మంచంమీద వాలిపోయింది. గాఢనిద్ర వచ్చేసింది.

...ఎవరో బయటి తలుపులు బద బడా బాదుతున్న శబ్దానికి శ్రీదేవికి మెలకువ వచ్చింది. కళ్లుతెరచి చూచింది. చేతి వాచిలో టైం నాల్గున్నర గంటలే అయింది. అరవిందవాళ్ళు అయిదున్నర దాటితేగాని రామని చెప్పారు. మరి తలుపు కొట్టుతోంది ఎవరా అని ఆశ్చర్య పోయింది.

బద్ధకంగా ఆవులిస్తూ లేచి వెళ్ళి తలుపు తెరచింది. ఎదురుగుండా అర వింద

"అన్నయ్య ఏడి?"

"నేను ముందు వచ్చేశాను."

"పాపకెలా వుంది వదినా?" కంగా రుగా అడిగింది.

"నాకే బాగాలేదు. పాప బాగానే వుంది!" అని లోపలికి వచ్చి మంచం మీద వాలిపోయింది. వూరికే బాధతో మూలుగుతోంది. తలనొప్పి, జ్వరం ముంచుకు వచ్చాయి.

"పొద్దున బాగానే వున్నావుగా వదినా, ఇంతలో ఇలా అయిందేంటి?"

"ఆఫీసులో గొడవ జరిగిందమ్మాయి అదంతా తర్వాత చెప్పుతాగాని, ప్లీజ్, నీవు కాస్త టీ చేసి ఇవ్వగలవా? అలాగే అలమారులో శారిడాన్ ఉంది ఇవ్వు," అంది వుస్సురుస్సురు మంటూ.

శ్రీదేవికి అంతా అయోమయంగా వుంది. టీ పెట్టి యిచ్చింది. శారిడాన్ వేసుకుని టీ త్రాగిన తర్వాత అరవింద కాస్త తేరుకుంది అప్పుడు ఆఫీసులో జరిగింది చెప్పింది. ఆ వుదంతం విని ముక్కున వేలేసుకుంది శ్రీదేవి జరిగిం దేమిటంటే — అరవింద రోజూలాగే ఇవాళ పదకొండు గంటలకు పిల్లకు పాలిచ్చి రావటానికి సెంటరుకు బయలు దేరబోయింది ఆఫీసరు వెళ్ళటానికి వీల్లే దన్నాడు. చేతిలో వున్న అర్జంటుపని పూర్తి చేసి వెళ్ళమన్నాడు. అవతల నా

పిల్ల ఏడుస్తోందని అరవింద గట్టిగా అంది. (బహుశా పెడసరంగా అని వుంటుంది.) ఆఫీసరుకు తిక్కరేగి వుంటుంది. అలా రూల్‌గా మాట్లాడితే నీవు అసలు ఎప్పుడూ వెళ్ళటానికి వీల్లేదన్నాడు. అరవిందా, ఆమెతోపాటు ఆమె సెక్షన్‌లో వున్న మిగతా ఆడవాళ్లూ ఆఫీసరుతో 'మధ్య మధ్యలో వెళ్ళి మా పిల్లలకు పాలిచ్చి రావటం మా జన్మ హక్కు. అన్నట్లుగా వాదించారు. మిగతా ఆడవాళ్ళల్లో ఇంకా పెళ్ళికాని వారు పిల్లలులేని తల్లులు వుండవచ్చు. అది వేరే సంగతి.) ఆ ఆఫీసరు మొండి ఘటమయి వుంటాడు, వెంటనే అరవిందకు చేతికి ఒక మెమోకూడా ఇచ్చాడు. విషయం కాగితాలమీదకు వెళ్ళిన తర్వాత అసలు వెళ్ళటానికి వీలులేదు, అందువల్ల ఈ రోజు వుదయం, మధ్యాహ్నం కూడ పాలు ఇవ్వటానికి కుదురలేదు. ఫలితం అరవింద పాలరొమ్ములు నిండిపోయి, బరువెక్కి గడ్డల్లాగా సలుపెక్కి బాధించటం మొదలుపెట్టాయి సాయంత్రానికి తలనొప్పి, జ్వరం ముంచుకొచ్చాయి సీతాపతికోసం కూడ చూడకుండా ఆఫీసరు పోయిన వెంటనే పిల్లను భుజాన వేసుకుని ఆటోలో యింటికి వచ్చేసింది.

శ్రీదేవికి రకరకాలయిన ఆలోచనలు వచ్చాయి. ఇంతలో సీతాపతి వచ్చాడు. విషయం తెలుసుకుని ఆ ఆఫీసరుమీద కారాలూ మిరియాలూ నూరాడు. యూనియన్‌తో పెట్టిస్తానన్నాడు. (అతను పని చేస్తున్నది వేరే ఆఫీసులో) స్త్రీ సంక్షేమ శాఖ మంత్రిణితో చెప్పుతానన్నాడు. అవసరమయితే ఇందిరాగాంధీకే రిపోర్టు చేస్తానన్నాడు. చిందులు త్రొక్కి చివరికి అరవిందను ఆ వీధిలో వున్న డాక్టరు దగ్గరకు తీసికెళ్ళి ఇంజక్షను చేయించి తీసికొచ్చాడు. ఇంకా ఏదో మందులు కావాలంటే షాపులో కొనుకొస్తానని వెళ్ళాడు.

అతను వెళ్ళిన తర్వాత మరొకామె వచ్చింది. ఎలా వచ్చింది పెళ్ళికెళ్ళబోతున్న పేరంటాలులాగో, మొదటి రాత్రి గదిలోకి వెళ్ళబోతున్న కొత్త పెళ్ళికూతురులాగో, డ్రీమ్‌సీన్ షూటింగులో నటించబోయే సినీతారలాగో పెద్ద పట్టు చీరతో, సర్వాలంకారాలతో కళ్ళు చెదిరిపోయే ఫుల్ మేకప్‌తో వచ్చింది.

ఆమెకూడా పాప. ఆడ యన్జీవోనే అరవింద ఆఫీసులోనే మరో సెక్షన్‌తో మరో బిల్డింగ్‌లో పనిచేస్తోంది. ప్రక్క వీధిలో వుంటుంది. ఆమెకు ఈ వుదంతం ఇందాక బస్‌స్టాండులో తెలిసింది. వివరాలు అడగటానికి, సానుభూతి తెలుపటానికి వచ్చింది.

అంతా విని కళ్ళు అర్చుకుంటూ చేతులు త్రిప్పుతూ వూరికే ప్రతి మాటను సాగదీస్తూ మాట్లాడడం మొదలుపెట్టింది.




ఈ 'త్రిప్పులాడి' ఆఫీసులో ఎలా పని చేస్తోందా అని శ్రీదేవికి అనుమానం వచ్చింది. ఇంకాసేపు ఆమె మాటలు విన్నాక ఆ అనుమానం కాస్తా తీరి పోయింది.

"...విషయాన్ని ఇంతదాకా రాని చ్చావోయ్? మనం ఆఫీసులో పని చేస్తున్నామంటే ఎందుకు? గొడ్డుచాకిరీ చెయ్యటానికికాదు. అందరితో పోట్లాడి మన హక్కులు తేల్చుకోటానికీ కాదు. ఏదో అలా అలా కాలక్షేపంచేసి ప్రతి ఫస్టుకూ బెస్టుగా ఆ జీతం డబ్బులు చేజిక్కించుకుని మన మన సంసారాలను హాయిగా, దర్జాగా గడుపుకునేందుకు అనువయిన సాధనాలు ఈ ఆఫీసులూ, ఈ వుద్యోగాలూ. అందుకు ఎక్కడి కక్కడ నేక్‌గా నెట్టుకు రావటమే మన అభిమతం! నిజంగా అంతేనండి, మీ పేరేంటో నాకు తెలియదు! అందాక ఎందుకు. మా ఆఫీసులో ఒక అకౌం టెంట్ వున్నాడు. ఆడవాళ్ళు కాస్త నవ్వుతూ, మరికాస్త కులుకుతూ మాట్లా డితే ఐస్ అయిపోతాడు. కాస్త నవ్వుతూ మాట్లాడినంతమాత్రాన మనకు పోయేది లేదు. వాడికి వచ్చేదీ లేదూ. వచ్చేవి మనం అడిగినప్పుడల్లా పర్మిషన్లూ, లీవులే!..."

—ఈ ధోరణిలో మాట్లాడింది.

అబ్బ, ఉద్యోగం అంటే ఎన్నెన్ని చెయ్యాలిరా బాబూ! అనుకుంది, శ్రీదేవి

వచ్చినామె తిరిగి వెళ్లుతుండగా సీతా పతి బయటినుంచి వచ్చాడు.

లోపలికి వస్తూ, మీ స్కీముల లక్ష్మి ఏ వంటుంది?" అన్నాడు.

'స్కీముల లక్ష్మి' ఏంటన్నట్లు ఆశ్చ ర్యంగా చూచింది శ్రీదేవి

"అవును చెల్లాయి! ఈవిడగారిపేరు స్కీముల లక్ష్మి ఎందుకో తెలుసా? ఫస్టు తారీకున జీతం తీసుకుంటుందా- అందులోంచి ఒక్క రూపాయి కూడా యింటికి తీసికెళ్ళదు, స్టీలు సామాను స్కీమూ, బీరువాల స్కీమూ, టేబిల్ ఫ్యాన్స్, స్కీమూ, నెక్‌లెస్‌ల స్కీమూ పట్టుచీర్ల స్కీమూ ఇలా ఎన్నో స్కీము

లకు ఇన్‌స్టాల్‌మెంట్స్ కింద కట్టేసి వుత్త చేతులతో యింటికిపోతుంది—"

"మరి ఇల్లు గడిచేది ఎలా ?" అంది శ్రీదేవి అమాయకంగా.

"వుద్యోగాలు చేసే ఆడవాళ్ళంతా యిల్లు గడవకే చేస్తున్నారా ఏంటి ? వాళ్ళాయనకు మంచిజీతం వస్తుంది. పైగా రెండు చేతులతో 'పై డబ్బులు' సంపాదిస్తాడు. వీళ్ళకు గుడివాడ తాలూకాలో కాలవ క్రింద మాగాణి పది ఎకరాలుంది. యిల్లు గడవకేం దొబ్బుడాయా ?" అన్నాడు

ఆ రాత్రి భోజనాలయిన తర్వాత శ్రీదేవికి ఇంటర్‌వ్యూ వచ్చిన డిపార్టుమెంటు, ఉద్యోగం మిగతా వివరాలన్నీ అడిగేడు సీతాపతి.

"అయితే పెద్ద రికమండేషన్ మీదే వచ్చావన్నమాట! అంటే అమ్మాయి, రికమండేషన్లు లేకపోతే వుద్యోగాలు రావు. మీ వదిన వుద్యోగానికి చాల తంటాలుపడ్డాను. మా ఊళ్ళో సారాకొట్టు గైరమ్మ రికమెండ్ చేస్తేనే ఆమినిష్టరు గారు స్వయంగా కల్పించుకుని ఈ వుద్యోగం యిప్పించాడు మరి—" అన్నాడు సీతాపతి ఆవులిస్తూ.

* * *

మర్నాడు అరవింద ఆఫీసుకెళ్ళలేదు యింట్లోనే వుండిపోయింది.

శ్రీదేవికి ఇంటర్‌వ్యూ కెళ్ళటానికి టైం దగ్గర పడుతూంది. ఆమె హడావుడిగా స్నానానికి బయలుదేరింది. బాత్‌రూంలో అంతకుముందేదూరి ఎవరో స్నానం చేస్తున్నారు.

శ్రీదేవి అసహనంగా బయట తచ్చట్లాడుతూంది. మరో అయిదు నిమిషాలకు తలుపు తెరుచుకుంది. సన్నగా ఎత్తుగా అందంగా వున్న యువతి బయటికివచ్చి శ్రీదేవికి సారీ' చెప్పి తను వెనుకవైపు వున్న పాత పెంకుటింట్లోకి వెళ్ళిపోయింది. నిన్న తను స్నానంచేస్తూ విన్నది ఈ అమ్మాయిగొంతే అయివుంటుందనుకుంది.

శ్రీదేవి స్నానం చేస్తూండగా మళ్ళీ ఆ అమ్మాయి గొంతు వినిపించింది. "అమ్మా! బస్సు చార్జీలకు ఒక్క రూపాయి కావాలే!" అంది. ఆ తల్లి ఏదో గొణిగింది దగ్గుతూనే.

"పోనీ అర్ధరూపాయి ఉన్నా ఫర్వాలేదే! మళ్ళీ వచ్చేటప్పుడు నడిచి వస్తాను "

ఆ రోగిష్టామె దగ్గుతూ ఏమన్నదో వినివించలేదు దగ్గుతగ్గాక అన్న మాటలు వినకుండానే శ్రీదేవి స్నానం పూర్తిచేసుకుని లోపలికి వచ్చేసింది.

—శ్రీదేవి ఇంటర్‌వ్యూ జరిగే ఆఫీసు కెళ్ళేసరికి చాల ఆలస్యమయిపోయింది. తెలియక ఒక ఆఫీసుకెళ్ళవలసింది మరో ఆఫీసుకెళ్ళింది. టాక్సీ చార్జీలే పన్నెండు రూపాయలు దాటింది.

టాక్సీ దిగి విసవిసా ఆఫీసరు రూం

లోకి వెళ్ళింది. తను ఫలాన అనిచెప్పింది. ఆ ఆఫీసరుకు తన బట్టతల మీద కని పించని 'వుంగరాల చెయ్యి' మొత్తినట్లయింది

"ఏ. శ్రీదేవి నీవేనా? మినిష్టరుగారి దగ్గర్నుంచి మళ్ళీ ఇందాక కూడా నీ గురించే ఫోను వచ్చింది."

శ్రీదేవి గర్వంగా చూచింది.

"ఇంత ఆలస్యంగా వచ్చావేం తల్లీ? ఇంటర్వ్యూలు పూర్తి అయ్యాయి. ఇంత వరకు నీవు రాకపోతే ఇక రావేమో అనుకున్నా, అందుకనే ఒక కేండిడేట్‌ను పెండింగ్‌లో పెట్టి వుంచా—"

ఎందుకు ఆలస్యమయిందో శ్రీదేవి చెప్పింది. ఆయన చాల నొచ్చుకున్నాడు.

"సరే, నీవు వచ్చావుగా! ఇక ఆ కేండిడేట్‌ను పంపించేస్తా—" అని బెల్ నొక్కాడు. ప్యూను వచ్చాడు.

"బయట వుంది చూడు, ఆ అమ్మాయి —ఆ ఆ- సీతే- ఆమెను లోపలికి పంపించు."

ఆ అమ్మాయి వచ్చేలోపల తన టేబిల్‌గ్లాసు కిందవున్న శ్రీరాముడి ఫొటోవంక చూస్తూ కూర్చున్నాడు. పాపం ఆయనకు పాపభీతి వుందికాని ఏంచేస్తాడు? మామూలు ఆఫీసరు. తన చేతుల్లో ఏముంది? అంతా రాజకీయ నాయకుల చేతుల్లో వుంది. తనే వాళ్ళ చేతుల్లో వున్నాడు. ఇంత పెద్ద దేశమే వాళ్ళ చేతుల్లో వుండగా లేంది ఇక తనెంత? అందుకే తన అంతరాత్మకు వ్యతిరేకంగా ఏదైనా పని చేయాల్సి వచ్చినప్పుడల్లా టేబుల్ గ్లాస్‌కింద్ర వున్న ఆ రాముడి ఫొటోకి 'నా చేతుల్లో ఏమీ లేదు రామా!, అని విన్నవించుకున్నట్లుగా రెండుచేతులా జోడించి మరీ దణ్ణం పెట్టుతాడు. ఇప్పుడూ పెట్టాడు.

లోపలికి వచ్చిన అమ్మాయిని చూచి కుర్చీలో కూర్చున్న శ్రీదేవి అదిరి పడింది ఆ అమ్మాయిఎవరో కాదు. పొద్దుట 'సారీ' చెప్పిందే సన్నగా, ఎత్తుగా అందంగా వున్న యువతి-ఆమే ఈమె! అరవింద వాళ్ళ యింటివెనక పాత పెంకుటింట్లో వుంటున్నామె! ఆమె సర్టిఫికెట్స్ మళ్ళీ ఆమెకు తిరిగి యిస్తూ,

"సారీ అమ్మాయి ! ఫోన్ మీద హెడ్డాఫీసువార్ని అడిగేను. ఈ ఉద్యోగానికి గ్రాడ్యుయేట్స్ అక్కర్లేదన్నారు. ఇక నీవు వెళ్లొచ్చు-" అని అన్నాడు ఆ బట్టతల ఆఫీసరు.

పాపం, ఆ అమ్మాయి నీళ్ళుకారి పోయిరేది; నెత్తిన పిడుగు పడ్డట్టు మొగం పెట్టింది. వెళ్ళుతూ శ్రీదేవివంక అదొక మాదిరిగా చూచి వెళ్ళింది.

బట్టతల ఆఫీసరు మళ్ళీ 'ఆ రాముడికి' దణ్ణం పెట్టాడు.

"పాపం ఫస్ట్‌క్లాసులో బియ్యే పాస యింది. నీవు రావేమో ఆ అమ్మాయికి

ఈ ఉద్యోగం యిస్తామనుకున్నా. ఇంకెందుకు—నీవు వచ్చావుగా!" అన్నాడు.

"మరి నాకు ఆర్డర్సు——"

"విజయవాడకే పంపిస్తాం నీకు పోస్టింగ్ కూడ విజయవాడ ఆఫీసులోనే! అక్కడున్న వాళ్లెవర్నయినా లేపేసి నిన్ను వెయ్యమని మినిష్టరుగారు చెప్పారు. "అని ఏడుపో నవ్వో తెలియని ఒక నవ్వు నవ్వి! "మీ నాన్నగారూ మినిష్టరుగారూ చిన్ననాటి స్నేహితులంటగా!" అన్నాడు.

"అవునండి, మా నాన్న లేకపోతే అసలు ఆయన మినిష్టరయ్యేవాడే కాదు. వస్తానండి! తొందరగా ఆర్డర్లు పంపిస్తారుగా-" అని వచ్చేసింది.

బట్టతల ఆఫీసరు పాపం చెంపలు వాయించుకుని మళ్లీ, 'ఆ రాముడు' కి ఇంకోసారి దణ్ణం పెట్టుకున్నాడు.

శ్రీదేవికి చాల ఆనందంగా వుంది. తనొచ్చిన పని ఇంత సులువుగా అవుతుందనుకోలేదు. ఆ ఆఫీసునుంచి నేరుగా ఆబిడ్స్‌కు వెళ్ళింది. తనకు చీరలూ, గాజులూ, టాయిలెట్ సామాన్లూ. సూరిబాబుకు నెక్‌టైలు—అవీ, ఇవీ అన్నీ తన ఇష్టం వచ్చినట్లు కొనేసింది; మూడు పచ్చకాగితాలు ఖర్చుచేసింది. బస్సు డిపోకి వెళ్ళి ఆ రాత్రికి సూపర్ డీలక్స్ బస్సులో సీటు రిజర్వు చేయించుకుంది.

టాక్సీ ఎక్కి యింటికి బయలుదేరింది. వేనిటీ బాగ్‌లోంచి టాయిలెట్ అద్దం తీసి మొగం చూచుకుంది. ముంగురులు సవరించుకుంటుంటే ఆ అద్దంలో సీత బొమ్మ కనిపించి నట్లనిపించింది; ఆఫీసరుగదిలో తనవంక ఆమె చూచిన చూపు గుర్తుకు వచ్చింది. ఆ పిల్లకు రావల్సిన ఉద్యోగాన్ని తను కొట్టేశానా అని ఒక్క క్షణం అనిపించింది......

అరవింద తనకు ఉద్యోగం వచ్చినట్లు తెల్సుకుని ఆనందించింది. తను బజారులో కొనుక్కొచ్చిన స్వీట్స్ ఆమె వద్దన్నా నోట్లో కుక్కింది. అరవింద కూతురుకు తను ఇందాక కొన్న కొత్త గౌను తొడిగి ముద్దులాడింది.

తను బట్టలు మార్చుకుంటుండగా దొడ్డి వయిపునుంచి గోలగా అరుపులు, కేకలు, ఏడ్పులూ వినిపించాయి. అరవింద తలుపులు తీసుకుని దొడ్లోకి వెళ్ళింది, ఆ గొడవేంటో చూద్దామని. తను సూట్‌కేసు సర్దుకుంటూ కూర్చుంది.

కొద్దిసేపటికి బయటి గొడవ తగ్గిపోయింది. అరవింద తిరిగి వచ్చింది. "పాపం, వెనుకింట్లో ఉంటున్న సీత బావటానికి వురేసుకోబోయింది. ఇంతలో ఆ తల్లికి మెలకువ వచ్చి కేకలుపెట్టింది. సమయానికి ఆ తల్లి చూచి వుండకపోతే ఈ పాటికి నిండు ప్రాణాలు నిలువునా పోయి వుండేవి; నట్టింట శవం వుండేది——" అని అంది జాలిగా.

"ఆత్మహత్య చేసుకోవటం దేనికి?"

వణుకుతున్న కంఠంతో మెల్లగా అడిగింది శ్రీదేవి.

"దేనికేముంది? దారిద్ర్య బాధలకు తట్టుకోలేక"—అంటూ వాళ్ళకుటుంబ పరిస్థితిని గురించి చెప్పింది.

సీత తండ్రి ఏదో చిన్న ఫ్యాక్టరీలో చిన్న గుమస్తా ఉద్యోగం చేస్తూండేవాడు. ఈ మధ్యే ఒక సంవత్సరం క్రింద అకస్మాత్తుగా గుండె ఆగి చనిపోయాడు తండ్రి పోయిన దగ్గర్నుంచి తల్లికూడా మంచం పట్టింది. సీత కాక ఇంక ఇద్దరు చిన్నపిల్లలున్నారు. ఇంట్లో ఉన్న చిన్న మూ-చితకా అమ్ముకుని తింటూ కాలక్షేపం చేస్తున్నారు. సీత సంవత్సరం నుంచి ఉద్యోగంకోసం ప్రయత్నాలు చేస్తూనేవుంది. బియ్యే డిగ్రీ పట్టుకుని ఆఫీసుల చుట్టూ కాళ్ళరిగిపోయేటట్లు తిరుగుతూనే వుంది. కాని, ఫలితం శూన్యం.

"—ఇవ్వాళ ఉదయం కూడా ఏదో ఇంటర్‌వ్యూకు వెళ్ళి వచ్చిందంట... ఇకెటూ తనకు ఉద్యోగం రాదనుకుందో ఏమో. ఈ బాధలు పడలేక జీవితంమీద విసిగిపోయి ఆఖరికి ఈ అఘాయిత్యానికి తలబడింది...." అంది అరవింద.

అరవింద చెప్పిందంతా వినేసరికి శ్రీదేవికి తల తిరిగిపోయింది. తల నొప్పిగా వుందని కళ్లు మూసుకుని పడుకుని ఉండిపోయింది.

అరవిందకూడా పిల్లకు పాలిస్తూ వారపత్రికలో క్రొత్త సీరియల్ చదువుతూ కూర్చుంది. ఆ సమయానికి ఏదో సానుభూతిగా మాట్లాడింది కాని ఆ మరుక్షణంలోనే సీతను గురించిగాని అసలు సమస్యను గురించిగాని ఆలోచించడం మానివేసింది. అసలు ఆ విషయమే మర్చిపోయింది. మామూలు ధోరణిలో పడిపోయింది. ఆమె కూడా అందరిలాంటిదే!

కాని శ్రీదేవిమాత్రం సీతను గురించే ఆలోచిస్తూంది. తనకు కళ్లుమూసుకున్నా సీత మొగమే కనిపిస్తోంది ఆలోచనలతో తల బరువెక్కిపోయింది. గుండెల్లో ఏదో తెలియని దిగులు క్షణ క్షణానికి పేరుకుపోతూంది; బరువు పెరిగిపోతూంది.

అలా కొద్దిసేపు తనలో చెలరేగుతున్న సంఘర్షణల తాకిడికి నలిగిపోయి చివరికి ఒక నిర్ణయానికొచ్చినట్లు లేచి కూర్చుంది. తెలిగ్గా గాలి పీల్చుకుంది. తలుపు తీసుకుని సీత ఇంటివయిపు నడిచింది.

రెండు కాళ్ళ మధ్యన తల పెట్టుకుని కుమిలి కుమిలి ఏడుస్తోన్న సీత మధ్యలో తలఎత్తి గుమ్మంలో నిలబడ్డ శ్రీదేవిని చూచి ఆశ్చర్యపోయింది.

శ్రీదేవి లోపలికెళ్ళి సీత ప్రక్కనే నేలమీదే కూర్చుంది. ఆమె తలమీద చెయ్యి పెట్టి అనునయిస్తోన్నట్లు నిమిరింది.

"ఆ ఉద్యోగం నీకే వస్తుంది. దిగులు పడవాకు" అంది మెల్లగా.

ఆమె చెప్పుతోంది మొదట్లో అర్థం కాక, అర్థం అయ్యాక నమ్మలేక, నమ్మాక కృతజ్ఞతతో నోటమాటరాక పూరికే అలా బొమ్మలాగా చూస్తూండిపోయింది సీత.

"అలా చూస్తావేంటి? నిజమే - లే, తొందరగా ఆఫీసుకెళ్లుదాం—" అని తొందరపెట్టి సీతను తీసికొని టాక్సీలో బట్టతల ఆఫీసరు దగ్గరకు బయలు దేరింది.

* * *

—సీతాపతి కళ్ళు ఇంతవి చేసుకుని, వింతగా చూస్తూ, "ఏంటి చెల్లాయి! ఉన్నట్లుండి ఇలా 'త్యాగమయి' వి 'కరుణామయి' వి అయిపోయావు?" అన్నాడు నాటకీయంగా.

"మినిష్టరుగారు సిఫార్సు వెంటపెట్టుకుని ఉద్యోగంకోసం ఇంత దూరం వచ్చింది ఈ పెంకుటింటి సీతకు ఉద్యోగం ఇప్పించటానికా?" అంది అరవింద ఆశ్చర్యంగా.

శ్రీదేవి కొద్దిగా సిగ్గుపడింది ఈ పొగడ్తలకు. ఆతర్వాత మెల్లగా ఇలా అంది: "అవునొదినా, నిజంగా మనం ఉద్యోగాలు చెయ్యటం అంత అవసరమా? భర్తల కొస్తున్న జీతంతో, మనకున్న ఆస్థి పాస్తులతో మనం సుఖంగా జీవించలేమా? ఆర్థికంగానూ, అన్ని విధాలుగానూ లక్షణంగా వున్న మనం ఉద్యోగాల కోసం సీతలాగా కటిక దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నవారితో పోటీపడుతున్నాం. ఈ పోటీలో మనం మన డబ్బుతో, సిఫారస్సులతో (ఎక్కువ విద్యార్హతులున్న) సీతలాంటివారికి దక్కవల్సిన ఉద్యోగాలను తన్నుకుపోతున్నాం. మనలాంటివాళ్ళం ఉద్యోగాలు చెయ్యటం కాలక్షేపం కోసం, విలాసం కోసం ; కాని అది సీతలాంటి వాళ్ళకు జీవన్మరణ సమస్య. మనం ఆ జీతం డబ్బులతో ఇంకా ఎన్నో విలాస వస్తువులు కొనుక్కొని ఆడంబరంగా, దర్జాగా వుంటాం; కాని, వాళ్లు రెండు పూటలా ఇంత తిండితిని పోతున్న ప్రాణాలను నిలబెట్టుకుంటారు—"

మళ్లీ శ్రీదేవే అంది: "ఏమో బాబూ, ఈ సీత పరిస్థితీ, ఉద్యోగాలు చేస్తున్న మీ పరిస్థితీ కళ్లారా చూశాక నాకు ఉద్యోగం చేయాలనిపించటం లేదు. ఇలాంటి సీతలు దేశంలో ఇంకెంతమంది వున్నారో?"

సీతాపతి చప్పట్లు చరిచి "సెహబాష్‌గా చెప్పావు చెల్లీ! ఏమండోయ్ శ్రీమతిగారూ! మరి, మీరేమంటారు?" అన్నాడు.

అరవింద ఆలోచిస్తూ వుండిపోయింది.

శ్రీదేవి సూట్‌కేసు చేత్తో పట్టుకుంది.

---




# కృతజ్ఞత

మల్లాది వెంకట కృష్ణమూర్తి

బస్‌స్టాండు చేరేసరికే బస్ ఆగి ఉంది. పూర్తిగా నిండివుంది. యభపడుతూనే వచ్చాను. నాకు నా భయం నిజం అయింది. పద్నాలుగు మైళ్ళు నిల్చుని ప్రయాణం చెయ్యాలి, ఆ రద్దీలో.

అలా ప్రయాణం చేయగల వయసు కాదు నాది. మట్టిగడ్డమీద కుదుపు లెక్కువ. దానికితోడు మలేరియా తన గుర్తుగా వదిలిన బలహీనత.

బస్ ఎక్కాను. బహుశా పద్మనాభస్వామి నన్ను మెచ్చుకుంటాడు ఇలా అవస్థపడుతూ వెళితే. అప్పుడే పుణ్యం వచ్చేది.

బస్ బయలు దేరింది. కొద్దిగా తూలాను కుదుపుకి. బస్‌నిండా భక్తులే. కొండ ఎక్కుతోంది బస్ అప్పుడే. మలుపులే దారంతా.

"మాష్టారు మిమ్మల్నే." ఎవరో పిలిచారు, నా భుజం తట్టి.

ఏమిటన్నట్లుగా చూసాను.

"అక్కడ కూర్చున్న అమ్మాయి పిలుస్తోంది.''

అతను చూపించినవైపు చూసాను. పాతికలోపే వుంటాయి. సరిగ్గా నా కూతురు వయసు. అనుమానంగా చూసాను ఆ కొత్త అమ్మాయి వంక. నన్నే!

దారిచేసుకుని దగ్గరకు వెళ్ళాను.

"మీరు కూర్చోండి ఇక్కడ."

లేచింది.

మొహమాట పడలేదు. కూర్చు న్నాను వెంటనే ఎప్పుడో నా స్టూడెంటు అయివుంటుంది, లేకపోతే నన్నే గుర్తు పెట్టుకుని సీట్ ఇచ్చేవాళ్ళు అరుదు. నా వయసును చూసి నాకు సీట్ ఇచ్చేవాళ్ళు కూడా అరుదు. ఇప్పుడు యువతరం ఆలోచనలు మారాయి, నా చిన్నప్పుడు లాగా కాదు.

"థాంక్స్ అమ్మాయి. నువ్వు చాలా మంచిదానివి," అన్నాను.

నవ్వింది.

కొద్దిగా బలహీనంగావుంది. కదిలే బస్‌లో నించోటం అలవాటు లేనట్లుంది. దానికితోడు కొండమీదకువెళ్ళే రోడ్డంతా మలుపులే.

బస్ ఆగింది అందరూ దిగారు. నేనూ కూడా దిగాను. ఎదురుగా కన బడే గోపురానికి నమస్కరించాను. ఆ అమ్మాయికి మరోసారి కృతజ్ఞత తెలుపు కుందామనుకున్నాను. కాని కనపడలేదు.

క్యూలోంచి, దైవదర్శనం చేసు కున్నాక బయటికి వచ్చాను. కోనేటి ప్రక్కన కూర్చుని ఉంది ఆ అమ్మాయి. ప్రక్కన మొగుడయి వుండచ్చు.

"నమస్తే గుర్తున్నానా?" అడిగింది నవ్వుతూ.

ఓ సారి బట్టతల తడుముకున్నాను. కళ్ళజోడు సర్దుకున్నాను. తల అడ్డంగా వూపాను.

"ఏ బేచ్?" అడిగాను.

"అంటే?"

"నా స్టూడెంట్‌వి కదా నువ్వూ?"

"మరి టీచరా?"

"కాదు మరి!"

"మరి పదహేడేళ్ళ క్రితం విజయ వాడలో ఉండేవారు కదూ?"

"అవును. అప్పుడు తెలుసన్నాను?" ఇంతకాలం నన్నెందుకు గుర్తుపట్టలేక పోయావో నాకు అర్థంకాలేదు.

"అప్పుడు నాకు పన్నెండో ఏడను కుంటాను నేనూ, మా తాతయ్యా రోజూ ఉదయం ఆరుగంటల బస్‌లో మంగళగిరి కెళ్ళేవాళ్ళం. బాగా రష్‌గా ఉండేది. ప్రతీరోజు లేచి మీరు తాతయ్యకి సీట్ ఇస్తుండేవారు."

"విజయవాడలో ఉంటూ గుంటూ రులో పనిచెస్తుండేవాణ్ణి అప్పుడు."

"అలా ఓ నెల జరిగాక తాతయ్య మంగళగిరిలోని టి. బి. హాస్పటల్‌లో చచ్చిపోయారు. ఎందుకో మీరు మాత్రం నాకు గుర్తుండిపోయారు."

మళ్ళీ ఏదో గోణిగాను.

"మీకు అప్పటి నుంచే కళ్ళజోడు, బట్టతల ఉండటం వల్లనేమో?" అన్నది ఆ అమ్మాయి నవ్వి.

నేనూ నవ్వాను.

---




గోపాలరావును నేను కలుసుకొని చాలా సంవత్సరాలయింది. మే మిద్దరం ఒకటో ఫారంనుంచీ ఇంటర్మీడియేటు దాకా ఒకే బల్లమీద కూచుని చదివాము. ఆ తరువాత వాడి దారి వేరు, నా దారి వేరు అయింది.

హఠాత్తుగా మొన్న సెంట్రల్ స్టేషన్‌లో కనిపించాడు. ఎవరో స్నేహితుడు కలకత్తా మెయిలులో వూరికి వెడుతూ వుంటే, అతణ్ణి పంపించడానికి నేను స్టేషనుకి వెళ్లాను, అందమైన ఆడవాళ్ళు ఎవరైనా కనిపిస్తారేమో చూదామని. ఆఫీసు పని అయిపోగానే స్టేషనుకి వచ్చాడు గోపాలరావు.

"ఏమిరోయ్, ఎన్నాళ్ల కెన్నాళ్లకు!" అంటూ భుజం మీద చెయ్యివేసి నన్ను పలకరించాడు. చిన్ననాటి స్నేహితుడు కనిపిస్తే ఎవరికి ఆనందంగా వుండదు గనక! నేను చాలా ఆనందించాను. ఒకర్ని వొకరు కుశల ప్రశ్నలు వేసుకున్నాము నా సంగతి అంతా వాడికి చెప్పాను. వాడు తన సంగతి అంతా చెప్పాడు. తాను సెంట్రల్‌కు యెందుకు వచ్చిందీ గోపాలరావు చెప్పినప్పుడు, నాకు ఆశ్చర్యం ఏమీ వెయ్యలేదు. చిన్నపుటినుంచీ వాడి స్వభావం అంతే.

"అదిగో, ఆ ఆంగ్లో ఇండియన్ పిల్ల చూడరా! ఫస్టుక్లాస్ బాడీ'' అనీ, "అదిగో, అయ్యంగారి పిల్లచూడు, ఎంత షోగ్గా నడుస్తోందో!" అనీ మాటమాటకీ, ప్రతి పడుచునూ చూపిస్తూ గోపాలరావు తన్మయత్వం పొందుతూ ఉంటే, నేను కూడా కొద్దో గొప్పో ఆనందం పొందక పోలేదు.

గోపాలరావును మా యింటికి రమ్మన్నాను. వాడు సరేనన్నాడు. కలకత్తా మెయిలు వెళ్ళిన తరవాత యిద్దరమూ, మైలాపూర్ ట్రాము యెక్కడానికి వచ్చి, బ్రిడ్జిమీద నిలుచున్నాము నేను ట్రాము కోసం చూస్తున్నాను.

""ఒరేయ్, చూడారా. తెలుగు పిల్లలా ఉంది. అలా వుండాలి; మెడ్రాసులో వున్న తెనుగు పిల్లలంతా 'యీసురో దేవుడా' అంటూ వుంటారు కదా. అందానికి తగిన ఒడ్డు పొడుగు పొంకం కూడా అలా ఉండాలిరా" అని చిన్న లెక్చరుతో, మూర్ మార్కెటువైపు నుంచి వస్తున్న పద్దెనిమిదేళ్ళ పిల్లను చూపించాడు గోపాలరావు,

చూశాను. ఆ పిల్లను చూడగానే నాకు కొద్దిగా నవ్వు వచ్చింది. నవ్వాను. ఆ పిల్లకూడా

నవ్వుతో వచ్చి, మైలాపూర్ ట్రాం కోసమే మాకు కొంచెం దూరంలో నిల బడింది.

"నిమిషంలో కత్తు కలిపావులే వెళ్ళి మాట్లాడుకో. భలే ఛాన్సు. చాలా ఫార్వర్డు రకంలాగ వుంది, లేకపోతే, ఇట్లే నవ్వుతుందా!" అని నన్ను కొంచెం ప్రోత్సహించాడు గోపాలరావు!

నాకు ఏమి చెయ్యాలో తోచలేదు. కాని నవ్వు మాత్రం వచ్చింది.

ఆ పిల్లకేసి చూసి, మళ్ళీ నవ్వాను. నా నవ్వుకి, ఆ పిల్ల మళ్ళీ నవ్వింది. ఆ పిల్ల చాలా చక్కనిదే అని నా వుద్దేశం. పైగా ఆ నవ్వులో ఎంతో తియ్యదనం ఉందని యిప్పటికీ అనుకుంటూ ఉంటాను. బహుశా, ఎప్పటికీ అను కుంటానేమో కూడాను.

"అదృష్టవంతుడివిరా, ఛాన్సు కొట్టే శావ్. శుభస్యశీఘ్రం. వెళ్ళి మాటలు కలుపుకున్నావంటే, ఎట్లైనా లాక్కుపో వచ్చును–" అని నన్ను హుషార్ చెయ్యడం ఆరంభించాడు గోపాలరావు.

ఆ సందర్భంలో ఏం చెయ్యాలో నాకు తోచలేదు.

ఇంతలో నా బాధ కొంచెం సర్దటానికి భగవంతుడు తోడ్పడినట్టుగా ట్రాము వచ్చేసింది.

ఆపిల్ల ట్రాము యెక్కి, చివరవైపున లోపలికిపోయి కూచుంటే, సరిగ్గా ఆ మొహం చూడటానికి వీలుండదేమోనని, చివర డ్రైవరు ప్లాట్ఫారం మీద నుం చుందామని నిర్బంధ పెట్టాడు గోపాలరావు.

అందుకు ఏమీ అభ్యంతరం పెట్టకుండా వొప్పుకున్నాను.

కండక్టరు టిక్కెట్లకోసం వచ్చాడు. ఆ పిల్ల దగ్గరకు వెళ్ళి అడిగాడు. నన్ను దగమని చూపించింది. నాకు నవ్వొచ్చింది. గోపాలరావు ఉద్రేకం పట్టరాక పోయింది

ఆ పిల్లకి, నాకూ, గోపాలరావుకి మూడు టిక్కెట్లు కొన్నాను.

"పిల్ల వలలో పడిందిరా. ఇంత ఈజీ అని నేను యెప్పుడూ అనుకోలేదు సుమా. తొణుకూ, బెణుకూ లేకుండా, నిన్ను చూపించేసిందే! మధ్య నేనెందుకు సత్ర కాయలాగ? ఏ రాయపేటలోనే దిగిపో తాను. నువ్వా పిల్లను ఎగరేసుకుపో" అని ఉపాయం చెప్పాడు గోపాలరావు.

ఏమని జవాబు చెప్పడానికి నాకు తోచలేదు.

ఆ పిల్ల పక్కన చోటు మౌంటు రోడ్డులో ఖాళీ అయింది.

"వెళ్ళి ప్రక్కన కూచో, మంచి సమయం" అని నన్ను ముందుకు తోశాడు, గోపాలరావు. విధిలేక వెళ్ళి కూచున్నాను. వాడుకూడా, నా దగ్గరకు వచ్చి నిలబడ్డాడు. వాడు రావడంతోనే ఆ పిల్ల కొంచెం సిగ్గుపడింది.

ఏం చెయ్యడానికీ తోచక, ఆ పిల్ల వైపు తిరిగి, "వీడు, నా స్నేహితుడు గోపాలరావు. రాత్రి మన యింట్లోనే భోజనం చేస్తాడు!" అనేశాను.

గోపాలరావు తెల్లబోయి నా వైపు చూశాడు. మా ఆవిడ మాత్రం సరే నన్నట్టు తల వూపింది.

---




(గత సంచిక తరువాయి)

"ఏమైంది బావా? అత్తయ్య ఏడుస్తోంది?"

"ఇక రాధను చూచుకొని మన మందరం జన్మంతా ఏడవవలసిందే?"

"అంటే?" జమున ప్రశ్న గొంతులోనే పూడిపోయింది.

"రాధ ఇక శాశ్వతంగా ఇక్కడే వుండటాని కొచ్చింది." పెగిలివస్తూన్న దుఃఖాన్ని ఆపుకోవడానికి వ్యర్థప్రయత్నంచేస్తూ రెండు చేతులతో ముఖాన్ని కప్పుకున్నాడు.

శిలాప్రతిమే అయ్యింది జమున. 'ఇది... ఇది... సంభవమా? ఏ కారణమైతే ఆడపిల్ల పుట్టింట శాశ్వతంగా వుండటాని కొస్తుంది?'

శ్మశాన గాంభీర్యం అలముకున్న ఆ గృహంలో చిన్ని వేణు ఏడుపు మినహా ఏ వ్యక్తి గళమూ పలుకగా వినరావడం లేదు.

## 31

రాగ విరాగాలు పడుగుపేకలుగా అల్లుకుపోయినదే మానవజీవితం. ప్రతి మానవజీవితంలోనూ ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక కారణంగా విరక్తి జనించుతుంది; జీవితంపై, ప్రపంచంపై మమకారమే పూర్తిగా నశించిపోతుంది. మృత్యువుకు వెరచే ప్రాణి ఆ మృత్యువునే ఆప్యాయంగా ఆహ్వానించగల సమర్థుడౌతాడు, ఆ విరాగ దశలో,

అయితే, ఈ దైనందిన కర్మకాండలో ఆ విసుగూ, విరక్తీ క్రమేణా అంతరించి మరల అనురక్తీ, ఆసక్తీ జనించడమే మహానుభావులకు కూడా అవగతంకాని జగన్మాయ!

అత్తింటినుండి వచ్చిన అనంతరం లోకపు ముఖమే చూడనిచ్చగించనట్లుగా ఏకాంతవాసం చేసింది రాధ కొన్నాళ్ళు. ఆమెను కన్నతల్లి దేవకికంటె బాధపడి కన్నీరు కార్చింది జమున. తల్లి ఒడికి తాత్కాలికంగా దూరమైన వేణు ప్రకృతి సహజమైన కోర్కెలనుండీ, లోక సహజమైన సాంసారిక సుఖంనుండికూడ వంచింపబడిన అభాగిని జమునా అప్రయత్నంగానే దగ్గరైపోయారు.

"చూడు రాధా, వేణు ఎలా నవ్వుతున్నాడో? సార్థకనాముడు కొంటె కోణంగి!" అన్నది జమున ఒకనాడు.

రాగమే ఎరుగనంత రాయిగామారిన రాధలో రవ్వంతకూడా అలరింపు కలుగలేదు.

మరొకనాడు: "వేణు ఎంత మారాం చేస్తున్నాడో చూడు రాధా ఒక్కసారి నువ్వు చేతుల్లోకి తీసుకో," అన్నది దేవకి కన్నీటితో.

పాషాణమూర్తిని పసిపాప శోకం కవ్వించగలదా? ఒకనాటి కలగా, నీటి అలగా చెదరిపోయిన జీవితాన్ని తలచుకు తలచుకు శోకించే ఆ కన్నీటి కడలిని కన్నతల్లి శోకం క్రొత్తగా కలవర పెట్టగలిగిన దేమున్నది?

"ఎన్నాళ్ళిలా కృశిస్తావ్ రాధా? నాల్గురోజులనుంచీ ఇలాగే వున్నావ్. లేచి భోజనం చెయ్యి." రాధ వచ్చిన నాల్గురోజుల అనంతరం కన్నీటితో అర్థించింది జమున

"అబ్బ, వేధించకు జమునా. నన్నిలా చావనీ."

జమున నేత్రాలు జలపూరితమయ్యాయి.

"ఈ ఇంట అష్టైశ్వర్యాలూ నాట్యమాడుతున్నాయి. కాని ఈ ఇంటిలో ఏ ప్రాణికీ సుఖసంతోషాలు మాత్రం లేవు లోకుల దృష్టిలో అదృష్టవంతులుగా ఆనందదేవత అనుంగుబిడ్డలుగా కన్పట్టే మనం నిజానికెంత దురదృష్టవంతుల రాధా!''

ఆ మాటలు వింటూనే రాధ జమునను పెనవైచుకుని భోరుమన్నది ఒక్కసారిగా. ఇన్నాళ్ళుగా ఆమె మనస్సులో పేరుకుపోయిన దుఃఖమంతా ఈనాడు కట్టలు త్రెంచుకు బయటకు పొంగింది వెల్లువై.

అంతలో తప్పటడుగులతో అటుగా వచ్చిన వేణు, రాధకు తేబడిన భోజన పాత్రలలో ఒకదానిలో చేయిముంచడం, కెవ్వుమనడం జరిగిపోయింది.

జమునతోపాటు రాధకూడా దిగ్గున మంచందిగి వచ్చింది.

వేడికి కందిపోయిన ఆ చిన్నచేతిని సవరిస్తూ జమున రాధతో అన్నది: "చూడు రాధా, ఎవరి నేరానికి శిక్ష ఎవ రనుభవించుతున్నారో? ఈ పసివాడి నిలా నిర్లక్ష్యంచేయడం నీకు భావ్యం కాదు...... ఈ రోజు నువ్వు అన్నం తినకపోతే ఇక ఈ ఇంట వంటలే వుండవ్. కానీయ్, అందరం ఒక్కసారే ప్రాణాలు విడుద్దాం.''

రాధ శోకం ఇనుమడించిందే కాని తగ్గలేదు.

''నువ్విక్కడ, బావ మేడమీద, అత్తయ్య పూజగదిలో. అందరూ ఇలా గైతే ఎలాగ? లే రాధా. చదువుకున్న దానివి. కష్టాల్ని ధైర్యంగా ఎదుర్కో లేకపోయినా భరించక తప్పదు."

ఎలాగైతే నయానా, అనునయానా ఆనాడు రాధచేత అన్నం తిన్పించగలి గింది జమున.

అలా అలా క్రమంగా రాధ మామూలు మనిషి కాలేకపోయినా, మనుషుల ముఖాలు చూస్తూ ఇంట్లో మసలడం మాత్రం ప్రారంభించింది.

ఇంతకూ రాధకు వచ్చిన కష్ట మేమిటో ఇన్నాళ్ళుగా మురళి ఎవ్వరికీ చెప్పలేదు. ప్రియసోదరికి కలిగిన దుస్థితికి కుమిలిపోతున్న అతడు అసలు విషయం తన నోటితో తాను ఎవరికీ వివరించలేకపోయాడు.

అయితే, ఇన్నాళ్ళుగా ఏవేవో వ్యాప కాలతో గ్రామాంతరాలలోవున్న తండ్రి వాసుదేవరావు స్వస్థలానికి తిరిగివచ్చి ప్రశ్నించడంతో తప్పనిసరిగా నివేదించక తప్పలేదు మురళికి.

రాధ భర్త సురేష్‌కు విచ్చలవిడిగా తిరిగే అలవాటు వున్నది చిన్నతనం నుంచీ. చేతినిండా డబ్బు, చుట్టూ స్నేహితులు, అంక్షపెట్టని తలిదండ్రులు. ఫలితంగా నీతి అనే మాట ఒకటి వున్న దనికూడా తెలియనంతగా దిగజారి పోయాడతడు. ప్రసిద్ధికెక్కిన పట్టణా లన్నిటిలోనూ అతడి కొక్కో పడతి వున్నదట. అయితే ఎందరు స్త్రీలతో పరిచయమూ, సంబంధమూవున్నా, ఒక సద్వంశ సంజాతతో వివాహమనేది తప్పనిసరిగా జరగాలి; గృహిణి అంటూ ఒకామె వుండాలి మహారాజుకు పట్టపు రాణీలాగా. అందుకే రాధతో వివాహం జరిగింది.

రాధ అణకువా, ఆమె వెంటవచ్చిన లక్ష కట్నమూ, లక్షను మించిన వస్తు వాహన సంపత్తీ సురేష్ విశృంఖల విహారాలను అధికం కావించాయి.

అతడెంత విధంచెడి తిరిగినప్పటికీ రాధ సహనం కోల్పోలేదు. ఉత్తమ వంశజ అయిన ఆమెకు మౌనంగా బాధపడటం, అతడిలో మార్పుకై ఆశగా నిరీక్షించటం మినహా ఆగ్రహం ప్రదర్శించి పోట్లాడటం చేతకాలేదు. అందుకే ఆమె ఓర్మిని లోకువగా చేసు

కాని సురేష్ ఇప్పుడు ఒక స్త్రీనితెచ్చి బాహాటంగా ఇంటనే వుంచాడు. ఆమెకు ఒక పిల్లవాడుకూడా!

కన్నబిడ్డ వేణును కన్నెత్తి చూడ టానికైనా తీరకలేని సురేష్ ఆ వుంపుడు కత్తె పిల్లవాడిని నిత్యం భుజా లెక్కించుకు తిరుగుతున్నా, రాత్రింబవళ్ళూ అమె గదిలోనే గడుపుతున్నా నోరెత్త కుండా భరించింది రాధ.

సురేష్ సంగతి అటుంచి, జగదాంబ కూడా ఆ ఉంపుడుకత్తెను అతి ప్రేమగా ఆదరించి ఇంట్లో వ్యక్తినిగా చూడటం మరింత మనస్తాపం కలిగించింది రాధకు.

అసలు కట్టుకున్న భార్య అంటూ ఒకతి వున్నదనీ, కన్న కుమారుడు వేణు తనకోసం తహతహ లాడుతున్నా డనీ తెలియనంత మూర్ఖదశలో పడి పోయాడు సురేష్.

మగవాడు ఎంత విలాసపురుషుడైతే అంత ఘనతగా గొప్పగా భావించే కుటుంబం అది. అందునా సురేష్ ఏకైక పుత్రుడు కావటానా, తరగని ధనరాసు లుండటంవలనా తలిదండ్రుల కది బాధా కరంగా అనిపించలేదు. మీదుమిక్కిలి కోడలు రాధపై ఒకవిధమైన చిన్న చూపుకూడా ఏర్పడింది.

"అంత అందమైన చీర సింగారించుకుని ఎవర్నాకర్షించాలి? ఏది కట్టుకుంటే ఇక నీ బ్రతుకు వెళ్ళిపోదు?" అన్నది ఒకనాడు జగదాంబ కోడలిని.

తన దురదృష్టానికి దురపిల్లుతూన్న రాధ మౌనమే శరణ్యంగా భావించింది. మామూలు దుస్తులు ఏమిటో, సాధారణ జీవిత మేమిటో తెలియని ఇంట పుట్టి పెరిగిందామె. అత్తకు ఆ సంగతి తెలి యనిదేమీకాదు. అయితే, కోడలిపై ఈ దేశంలో అత్తకుండే సహజాసూయా ద్వేషాలు ఆమెలో మరొకపాలు ఎక్కువగా వుండడమే గాకుండా, కొడుకే కోడలిని నిర్లక్ష్యం చేస్తూంటడంవల్ల ఇక తన రాక్షసత్వాన్ని ఎదిరించేవారు లేరనే ధీమా ఏర్పడింది.

ఇంత జరుగుతున్నా రాధ ఏ విష యమూ పుట్టింటివారికి తెలియపర్చలేదు. క్షేమసమాచారాలతో మాత్రమే ఉత్త రాలు వ్రాస్తోంది.

ఒకరోజు — రాధకు అగ్నిపరీక్ష అయినరోజు అది. వేణుకు అప్పటికి నాల్గురోజులుగా ఆరోగ్యం బాగుండ లేదు. వాంతులూ, విరోచనాలూ. ఆ తొలిరోజు సాయంత్రంనుండీ వాంతులు అధికమయ్యాయి. నీళ్ళకు నీళ్ళూ విరోచ నాలు. అంతవరకూ వైద్యుణ్ణి పిలచే నాధుడే లేకపోయాడు. రాధ కన్నీటితో బ్రతిమాలి ఒక నౌఖరుకు పదిరూపా యలు చేతిలోపెట్టి డాక్టర్ని తీసుకు రమ్మన్నది ప్రాధేయపడుతూ.

డాక్టరు వచ్చి చూచి, "చాలా విషమ స్థితికి వచ్చింది. ఇంత ఆలస్యం ఎందుకు చేశారు?" అని ప్రశ్నించాడు. తక్షణమే

తన నర్సింగ్ హోమ్‌లో జేర్చమనీ చాలా చికిత్స చేయాలనీ, ముఖ్యంగా ముందు ఆ నీరసాన్ని అరికట్టటానికి సెలైన్ ఎక్కించాలనీ అంటూ నిర్ధ్కారించాడు.

గుండె అగినట్లయింది రాధకు. "భగవాన్ ! అభం శుభం ఎరుగని ఈ పసిబిడ్డ కెందుకింత బాధలూ, జబ్బులూ ? ఈ రోగమేదో నాకు రారాదా ?" అని విలపించింది.

"ఎవరినడిగి పిలిపించావ్ డాక్టర్ని ?" అటు డాక్టర్ గడపదాటుతూండగానే ఇటు శివంగిలా లేచింది కోడలిమీదికి జగదాంబ.

సాక్షాత్తూ జగదాంబనే చూచినట్లుగా ఝడుసుకొన్నది రాధ.

"నీ హద్దులలో నువ్వు పడివుండు. పెత్తనం చేయాలని చూడకు. నీ బాబు ఎంత ధనవంతుడైనా కానీయ్. అన్ని విర్రవీగకు. నా కోడలివే. స్వతంత్రురాలి ననుకుంటున్నావా ?" ఈ అనవసర నిందారోపణలకూ, దూషణలకూ విస్మయంగా మూడసాగింది రాధ.

"బిడ్డకు జబ్బు ఇంత సీరియస్‌గా వుందని డాక్టర్ కూడా అంటున్నాడు. వైద్యం చేయించుకోవడం అపరాధమా ?" అని మాత్రం అనగలిగింది.

"అదుగో, నాకు ఎదురు సమాధానాలుకూడానా ? అనసవరంగా నోరు విప్పకు. నీ హద్దులలో నీ వుండు." ఇంట్లో ఏ గిన్నెలుతోమే పనిమనిషినో అన్నట్లు తేలికగా – బిగ్గర స్వరంతో వీధి అంతా విన్పించేట్లు అరుస్తూన్న జగదాంబను చూస్తూంటే ఆ క్షణంలో ఎంతైనా అసహ్యం కలిగింది రాధకు.

సరిగా అదే సమయంలో సురేష్ వుంపుడుకత్తెతో కలిసి ఎటో వెళ్ళిపోతున్నాడు. అత్తకు సమాధానం చెప్పకుండా ఒక్క ఉదుటున అటు పరుగెత్తింది రాధ.

"బాబుకేమీ బాగుండలేదు. మీ రెటో వెళ్ళిపోతున్నారు," అన్నది భర్త కెదురుగా వెళ్ళి దుఃఖం దిగమ్రింగుకుంటూ.

సురేష్ విసుగ్గా చూశాడు.

"ఫర్వాలేదు, ఒక్కడు ఛస్తే. భారత దేశంలో నిముష నిమిషానికీ జనాభా పెరిగిపోతూనేవుంది." చేతి సంచిని విలాసంగా త్రిప్పుతూ నిర్లక్ష్యంగా అన్నది వుంపుడుకత్తె

భర్త కొడితే దారినబోయే ముష్టివాడు కూడా కొట్టాడని సామెత !

క్రోధంతో అవమానంతో వుడికిపోయిన రాధ మరి నిగ్రహించుకోలేక ఆమె చెంప ఛెళ్ళుమన్పించడమూ, మేడపైమెట్టుపై నిలబడివున్న ఆమె ఆ దెబ్బ ధాటికి నిలద్రొక్కుకొనలేక మెట్లన్నీ దొర్లుతూ క్రింద పడటమూ జరిగింది. నుదుటిని చిమ్ముతూన్న రక్తం తుడుచుకుంటూ శివంగిలా లేచిందది.

"ఏం సురేష్ ? ఇందుకా నన్ను తీసుకొచ్చావ్ ? సిగ్గులేదూ ఆలా వాజమ్మలా నిలబడి చూడటానికి ? ఇదే మరో మగ

వాడైతే వెంటనే ఎముకలు సున్నం చేసును,'' అన్నది తీవ్రంగా.

ఆ పదజాలంలోని ఆఖరి మాట సురేష్‌కు చాలా పౌరుషాన్ని కలిగించి, కర్తవ్యం బోధించింది. అందుకే ఆ ఉంపుడుకత్తెకు తన ధీరత్వం ప్రదర్శించి ఆమె ప్రేమను నిలుపుకోవటానికై భార్యను నానా దుర్భాషలాడి, ఇక నోరెత్తితే చంపుతానని చెప్తూ బిడ్డతో సహా బయటికి గెంటివేశాడు.

రాధ రోదన అరణ్యరోదనే అయ్యింది. అత్తమామలు కూడా వెలయాలితో సమంగా సంతోషిస్తూ చూశారేకానీ న్యాయం చెప్పలేదు, కలిగించుకోలేదు.

అసహ్యతా విరక్తిలు పెనవైచుకొని పోగా రాధ వారిని ఏమీ ప్రాధేయ పడకుండా, తిన్నగా హాస్పిటల్‌కు వెళ్ళింది. బిడ్డను డాక్టర్ ఎదుటవుంచి నిలబడిన ఆమె దీన వదనాన్ని చూస్తూనే డాక్టర్ విషయమంతా గ్రహించాడు. ఆ యింటి సంగతులూ, సురేష్ గుణగణాలూ బాగుగా ఎరిగున్న అతడు తానే మురళికి ట్రంక్‌కాల్ చేశాడు. మర్నాడే రెక్కలు గట్టుకు చెల్లెలిదగ్గర వాలిన మురళి పౌరుషాభిమానాలతో మండిపోయి ఆమెనూ బిడ్డనూ వెంటబెట్టుకు వచ్చేశాడు.

## 32

"బృందా, త్వరగా రెడీగా. పార్టీ వుంది." హడావుడిపడుతూ వచ్చిన నాగేంద్ర బృందనుకూడా హడావుడి పెట్టేశాడు.

రికార్డ్ ప్లేయర్‌పై జయదేవుని అష్టపది వింటూ తన్మయమందిన బృందకు భర్త పిలుపు రెండవసారి కాని విన్పించలేదు.

"ఆహా! ఏం పతిభక్తి! ఏమి భారతావని! భర్త ఆగమనంకంటె గ్రామఫోను రికార్డులపై ప్రేమ ఎక్కువైందన్న మాట నేటి భారత నారికి!''

నాగేంద్ర స్వరంలో హేళన ధ్వనించినట్లు బృందకు అన్పించినప్పటికీ, అది భార్యపై ప్రేమతో భర్త విసిరే పరిహాసపు విసుర్లు కావచ్చునని సరిపెట్టుకొంది.

"సారీ." నిండుగా నవ్వుతూ విషయాన్ని మార్చివేసింది. ''ఇప్పుడే తయారౌతాను. ఏమిటి పార్టీ?''

"మాకు ఎప్పుడూ ఏవో ఒక పార్టీలు వుంటూనే వుంటాయిలే. కనీసం రెండు పార్టీలైనా లేనిదే మాకు నెల గడవదు. త్వరగా తయారుగా," ఆజ్ఞాపించినట్లుగా అనేసి వెళ్ళిపోయాడు.

బృంద గుండెలు దడదడ లాడాయి. అంతకు రెండు వారాలముందు జరిగిన పార్టీలో వింతలు విశేషాలూ ఆమె యింకా మర్చిపోలేదు.

నూతన దంపతులు నాగేంద్రా బృందల అభినందనార్థం నాగేంద్ర

స్నేహితులంతా కలసి ఒక పార్టీ ఏర్పాటు చేశారు.

విందులలోకూడా ఇన్ని రకా లుంటాయనీ, కొన్ని కొన్ని పార్టీలు కేవలం ఆడామగా విచక్షణా తారతమ్యాలు లేకుండా మృగాలలాగా ఆటవికులలాగా ప్రవర్తించడానికేననీ ఆ రోజు బృంద తెలుసుకున్నది.

పార్టీకి వచ్చిన మూడువంతులుమంది స్త్రీలు, అసలు శరీరంపై బట్టలు ఎందుకు ధరించాలో, వస్త్రాచ్ఛాదన ఎక్కడెక్కడ అవసరమోకూడా గుర్తించినట్లుగా లేరు. ప్రతి ఒక్కళ్లూ భర్తనూ, భార్యనూ వదలి పరాయివారి మీద పడి మాట్లాడటమూ, నృత్యాలు చేయటమే! చాలమంది స్త్రీలుకూడా త్రాగుతున్నారు.

'నన్ను ఏవగించుకొనే సభ్య సమాజపు అసలు రూపం యిదా?!' అని ఆశ్చర్యపోయింది బృంద.

నాగేంద్ర శ్రీరాముడనీ ప్రవరాఖ్యుడనీ ఆమె ఎప్పుడూ తలపోయలేదు కానీ ఆ రోజు స్పష్టంగా చూచి గ్రహించ గలిగింది, అత డెంత జారుడూ, నీతి మాలినవాడో!

అందరూ జంట జంటలుగా విడిపోయి నాట్యం చేస్తూంటే మధ్యలో అయిదు నిముషాలపాటు లైట్లన్నీ ఆర్పి పూర్తిగా అంధకారం చేశారు. విద్యుచ్ఛక్తి సరఫరా ఆగిపోవటం కాదది, ప్రోగ్రాంలో - విందులో అదీ ఒక భాగమే!

నాగేంద్రకు అసలు బృందతో మాట్లాడే తీరికేలేదు. ఒక్క రెండు నిముషాలు ఒక్కొక్కామెతో అతడు నాట్యం చేస్తున్నాడు. ఇంచుమించు ప్రతి స్త్రీ అతడితో కలసి గంతులేయడానికి ఉవ్విళ్ళూరుతూన్నది.

బృందతో నాట్యం చేయటానికి ఇద్దరు పురుషులు ప్రయత్నించారు. కాని ఆమె అనంగీకారాన్ని సూచిస్తూ అందరికీ దూరంగా ఒక తావున నిలబడింది.

అంతలో మరొకడు వచ్చాడు ఒంటరిగా నిలబడిన బృందవద్దకు. చనవుగా ఒక చేయి నడుముమీదా, మరో చేయి భుజంపైనావేసి ఆమెతో కలసి నృత్యం చేయ ప్రయత్నించుతూంటే బృంద మొదట ఆశ్చర్యపోయింది. తర్వాత సంబాళించుకుని ఏదో చెప్పేలోగా నాగేంద్రవచ్చి రహస్యంగా చెవిలో అన్నాడు: "బ్రూట్‌లాగా ఏమిటా నిలబడడం? అందర్నీ చూడు, ఎంత 'జాలీ'గా వున్నారో! కానీయ్ అలా నింమంటే ఏమిటి లాభం?"

వెర్రిదానిలా చూడసాగింది బృంద.

"విన్పించలేదా? వెర్రివేషాలేసి నాకు కోపం తెప్పించకు." అన్నాడు.

నాగేంద్రతోవున్న మరో యువతి వెకిలిగా పళ్ళన్నీ బయటపెట్టుతూ, "మా అందరికంటె ఫార్వర్డ్‌గా వుండి

మాకే యింకా నేర్పవలసినదానవు నువ్వే ఇలావుంటే ఎలా ?" అన్నది.

అవమానంతో బృందతల భూమిని తాకింది.

నాగేంద్ర తానే బలవంతంగా బృందను అందరి మధ్యకూ చేయిపట్టుకు తీసుకువెళ్ళాడు.

"మన పద్ధతులు క్రొత్తగా వున్నా యనుకుంటాను." అంటూ నాగేంద్ర స్నేహితు డొకడొచ్చి, నాగేంద్రకు కన్ను గీటటంతో, అతడు నిష్క్రమించాడు.

విందు అంటే మత్తుపానీయాలు త్రాగటమూ, విచక్షణే ఎరుగకుండా గంతులు వేయడమూనా ? శక్తికి నరబలీ జంతు బలీ యిచ్చే అనాగరికులు త్రాగి తందనాలాడతారు విపరీతంగా. వారికీ మనకీ ఎందులో తేడా !

ఆలోచిస్తూ అయిష్టంగానే అతడితో కలసి స్టెప్స్ వేయసాగింది బృంద.

కానీ... హఠాత్తుగా వాద్యగానం హెచ్చు అయ్యింది. అందరూ శివమెత్తినట్లు ఊగిపోతున్నారు. అంతలో లైట్లు ఆరిపోయి పూర్తిగా గాడాంధకారం. వాద్య సంగీతం మరింత హెచ్చుగా ఆవేశకరంగా వినవస్తోంది. సంతోష పూర్వకంగా కొందరు ఈలలు వేసూన్నట్లు వినవస్తోంది. ఆ తరుణంలో తనతోవున్న అతడు అభ్యంతరకరంగా ప్రవర్తిస్తూంటే మాత్రం బృంద మరి సహించలేక పోయింది. ఆమె అయిష్టాన్ని గమనించిన అతడు, "క్రొత్తగా వుందా ? క్రొత్తపెళ్ళి కూతురివి కదూమరీ ?" అని యింకా విపరీతచేష్టలు చేస్తూంటే సహనం కోల్పోయిన బృంద అతడి చేతులు కరచి వదిలించుకుని, బయటకు పారిపోయింది ఆ చీకటిలోనే.

ఒంటరిగానే ఇల్లుజేరింది, కానీ ఆమె గుండె గుబగుబ తగ్గలేదు. ఏడుపు తన్నుకు వచ్చింది.

తాను ఏ యింట పుట్టినందుకు సిగ్గిలుతూన్నదో, ఏ వాతావరణంనుండి అయితే తప్పించుకోవాలని శతవిధాలా ప్రయత్నించి పారిపోయిందో, ఏ వృత్తి అయితే అసహ్యకరమనీ నీచమనీ భావించిందో - అంతకంటె ఎక్కువే ఇక్కడ జరుగుతూన్నది కానీ తక్కువేమీ లేదుగా ?

భర్తను పరస్త్రీ పొందులో ఆనందంగా చూడగలిగిన ఆడదీ, స్వహస్తాలతో భార్యను పరాయి పురుషునికి ఒప్పగించే మగవాడూ ! త్రాగుడూ, గంతులూ ! ఇంతకంటె మా కులంవారు అధములా ? కాదు ! వారి కొరకు వాదించేవారూ, గౌరవించేవారూ లేరు. అంతే.

నాగేంద్ర వచ్చి ఏమంటాడోనని హడలిపోతూ జాగారం చేసింది బృంద ఆ రాత్రంతా. అతడు అర్ధరాత్రి తర్వాత రెండున్నర ప్రాంతంలో పూర్తిగా ఒళ్ల

తెలియని స్థితిలో ఇల్లు జేరాడు. అతడి విపరీత రూపాన్ని చూడటం యిదే మొదలు బృందకు. నిలువునా కొయ్య బారి పోయింది భయంతో.

అతడు ఏం చేస్తున్నాడో ఏం మాట్లాడుతున్నాడో అతడికే తెలియదు. బూట్లు తీసి సోఫాలో పెట్టాడు. నేల మీద పడుకున్నాడు. వాంతి చేసు కున్నాడు. భయంతో చూస్తూన్న బృందను దగ్గరకు పిలిచాడు. ఆ భయం కరాకారాన్నీ, వికారపు వాసననూ భరించలేని బృంద అలాగే దూరంగా నిలబడివుంది.

"విన్పించలేదూ, రమ్మంటుంటే ?" బిగ్గరగా కసరుకుంటూ మళ్ళీ పిలిచాడు.

భయపడిన బృంద బయటికి పారి పోయి, లీలావతి గదివేపు పరుగెత్తింది. గది బయటే పామును చూచినట్టు ఆగి పోయింది.

లీలావతీ, హోటల్ మేనేజర్ సుకు మార్......

కొంతసేపు తాను చూస్తూన్నదేమిటో అర్థంకాలేదు బృందకు. ఈ వయస్సులో లీలావతి... తన కుమారుని వయస్సున్న సుకుమార్‌తో... ఛీ, ఇదా ఈ యింటి అసలు రహస్యమూ వాతావరణమూ ? లీలావతి కుమారుని కోపపడి బుద్ధిగరప గలదనే ఆశతో తాను ఆమెకోసం వచ్చింది. కానీ ఆమే అవినీతికి ఆటపట్టని గ్రహించిన బృంద ముఖం వాల్చుకుని నిరాశతో నిస్సహాయగా తిరిగి గదిలోనికి వచ్చింది.

## 33

మానవ ప్రాణికి విఫల ప్రేమకంటె అధికమైన చిత్రహింసలేదని బృంద అనుభవపూర్వకంగా తెల్సుకొన్నది.

యౌవన ప్రాంగణంలో అడుగిడిన నాటినుండీ ఏ సంసార జీవితం కోసమైతే పలవరించిందో, ఎ గృహిణీత్వం పవిత్ర మని భావించి సాధించిందో అది ఇంతటి బుద్బుదప్రాయమైనదా ? సంఘంలో పరువుగా గౌరవంగా బ్రతుకుదామని ఆశపడిందికానీ తాను గౌరవవించే గౌరవ ప్రతిష్ఠలూ పరువుమర్యాదలూ కేవలం మేడిపండు సదృశ్యమని తెలుసుకొనలేక పోయింది ; ఇప్పుడు తెల్సుకొనీ లాభం లేదు. సుడిగుండంలో చిక్కుకుపోయిన తనను భగవంతుడుకూడా రక్షించలేడు.

తలగడను కౌగలించుకుని నేలమీద పడుకొని కాళ్ళు సోఫామైకి తన్నిపెట్టి విపరీతంగా వాగుతున్నాడు నాగేంద్ర...

"పతివ్రతంటే ఎవతె ? మొగుడు నిప్పుల్లో దూకమన్నా దూకాలి, గంగలోపడి చావ మన్నా చావాలి. అంతేకాని మొగుడికి ఏ సాయంలేకుండా ముక్కు మూసు కూర్చునేదాని పవిత్రత ఎందుకు ఏడవ టానికి ? తీస్కెళ్ళండ్రా. ఈ గ్రంథా లన్నీ గంగలో కలపండి, పెట్రోల్‌పోసి నిప్పెట్టండి. క్రొత్తవి రాయించండి... వెయ్యిమందితో వ్యభిచరించినా తప్పు

లేదు మొగుడి అంతస్థు పెంచటానికి. అదే పతివ్రత. అదే ఇల్లాలు......" ఇంచుమించు తెల్లవారేవరకూ అలా ఒళ్ళు తెలియకుండా వాగుతూనేవున్న నాగేంద్ర తెల్లవారుతూండగా నిద్ర పోయాడు. ఇక అతడు లేచేది మధ్యాహ్నం పన్నెండు దాటాకనే.

ఉదయమే లేచి లీలావతి ముఖం చూడటానికికూడా ఆమెకు ముఖం చెల్ల లేదు. తప్పుచేసినది లీలావతి అయినా, తానే అపరాధినిలాగా బాధపడసాగింది బృంద.

పూజాపార్వణాలతో ఆహ్లాదకరమైన ప్రశాంత మధురిమలతో నిండి ఒకరి నొకరు ఆప్యాయంగా, గౌరవంగా చూచుకొనే మధురమైన కుటుంబ వాతావరణంలో అడుగిడుతున్నానని అనుకొన్న ఆమె ఎంతటి కలుషిత వాతావరణంలో వున్నదో గ్రహించి నిలువెల్లా ఏదో తీరని బాధా ఆరని జ్వాలా రగిలించి వేస్తూండగా చింతిస్తూన్న ఆమె వద్దకు నాగేంద్ర వచ్చి పది నిముషాలు అలాగే ఆమెను పరిశీలనగా చూస్తూ నిలబడ్డాడు. కలవరపడి అవనత వదన అయింది బృంద.

"రాత్రి అలా పారిపోయావేం విందులోనుంచి?" అన్నాడు కొంత తీక్షణంగా.

బృంద మాట్లాడలేదు.

అతడు రెట్టించాడు.

"నా కివన్నీ నచ్చవు నాగేన్. రాత్రి... అతడి ప్రవర్తన ఎంత ఘోరంగావున్నదో మీకు ఎలాచెప్పేది?" అంటూన్న ఆమె కనులనుండి రెండు కన్నీటి చుక్కలు రాలిపడ్డాయి.

నాగేంద్ర కోపపడలేదు. ''పిచ్చి దానా! మోడరన్ సొసైటీలో మెలగటం నీకు తెలియదు గనుక నేర్చుకో. నా దగ్గర. గబ్బిలాయిలాగ యింట్లో పడుండటానికికాదు విలువైన జీవితాలు. అనుభవించటానికే ఆనందించటానికే పుట్టాం. ఇంకెప్పుడూ అలా పారిపోకు. ఏదో చెప్పి సర్దేశానులే నిన్న అడిగిన వాళ్ళందరికీ." భుజంతట్టి వెళ్ళి పోయాడు, బృందను దహించివేసే ఆలోచనలతో వదిలేసి.

మళ్ళీ ఈనాడు పార్టీ వుందంటున్నాడు? భగవాన్ ఈ రోజేం జరగబోతున్నదో!

''లే. తయారవ్వటమంటే యింత పొడుగు జడవేసి, తలైడు పువ్వులు పెట్టుకొని ఓ మునలి పట్టుచీర కట్టుకోవడంకాదు. హోటల్‌నుంచి రీటాను తీసుకొచ్చాను. ఆమె తయారుచేస్తుంది. ఊఁ. హరీ అప్!"

అతడు చెప్పటమేకాని, ఆమెమాటను అడగటంలేదు, వినటంలేదు!

లీలావతి పర్యవేక్షణలో రీటా తనను అలంకరించుతూంటే ఒంటినిండా చిన్న

చిన్న తేలుపిల్లలు ప్రాకుతూన్నట్లే అనుభూతి చెందింది బృంద.

"అబ్బ! నడినెత్తిన ఈ ముడి, ఈ చేతుల్లేని జాకెట్లూ నా కొద్దుబాబూ. నన్ను మామూలుగా వుండనీయండి." అన్నది ప్రాధేయ పూర్వకంగా లీలావతిని.

నిత్యం కోపం కురిపించుతూనేవుండే లీలావతి ముఖం ఇంకా రౌద్రంగా మారి పోయింది. "నోరు మూసుకో. అడుగడుగునా ఏమిటీ గొణుగుడు? నా యింట్లో నా యిష్టప్రకారం వుండాల్సిందే! తెల్సిందా?"

రీటా అందుకుంది. "కొద్ది రోజులు క్రొత్తగా వుంటుంది. తర్వాత అదే అలవాటై పోతుందిలెండి. ఆయన మాట వింటేగానీ నాగేంద్ర ప్రాణం యిస్తారు; అంత మంచిమనసు."

విష పానం చేస్తూన్నట్లే వున్నది బృందకు. తమ చేతిక్రింద కూడు — అదైనా హోటల్ కాల్‌గర్ల్‌గా నీచపు కూడుతిని బ్రతికే రీటా తన యజమానురాలికే యజమానిని గురించి చెప్తోంది! 'అయినా నా పిచ్చికానీ నన్ను ఇంటి కోడలిగా, కాబోయే యజమానురాలిగా ఎవరు చూస్తున్నారు? క్రిందవాళ్ళకు నాపై గౌరవం ఎందుకుంటుంది — అయిన వాళ్ళైన అత్తా భర్తే అందరి ఎదుటా అవమానకరంగా మాట్లాడి చిన్నబుచ్చుతూంటే!

అంతా తయారయ్యాక అద్దంలో తన ప్రతిబింబం తనకే క్రొత్తగా ఎప్పుడూ చూడని క్రొత్తమనిషెవరో వచ్చి ఎదుటనుంచున్నట్లుగా అన్పించింది. 'ఛీ, మగవాడిని రెచ్చగొట్టి, నీచాభిప్రాయం కల్గించేట్లుండే ఇలాంటి వేషం వేసుకొని బ్రతక్కపోతేనేం? అత్తే కోడలిని స్వయంగా యిలా విలాసినిగా తయారు చేయడమా?'

బృందకు అన్నివిధాలా వెగటు పుట్టిం చేట్లుగావున్న ఆ పార్టీలో శశికాంత్ అనే వ్యక్తిని పరిచయం చేశాడు నాగేంద్ర అతడు తన స్నేహితుడూ, ఉత్తర హిందూస్థానంలోని వాసికెక్కిన ధనవంతులలోకెల్లా ధనవంతుడనీ.

అతడు బృందతోనే ఏమేమో మాట్లాడ సాగాడు ఎన్నోఏళ్ళ పరిచయమూ, స్నేహమూ వున్నట్లుగా. బిడియపడ్తూనే సమాధానా లీయసాగింది బృంద.

"నాగేంద్ర చాలా ఆదర్శ పురుషుడు, మీరు అదృష్టవంతులు. నాగేంద్ర వంటి వారు ఊరికి నలుగురున్నా మీవంటివారు ఉద్ధరింపబడతారు." అన్నాడు శశికాంత్.

అయిష్టంగా ఊ కొట్టింది బృంద.

"మీ గురించి నేనేన్నీ తెల్సుకున్నాను. నా గురించి మీరేమీ అడగరేం?" అన్నాడు.

"అంటే?"

"ఏముందీ? పెళ్ళైందా? ఏం

చేస్తున్నారు? ఎన్ని లక్షల కధికారి మీరూ వగైరా వగైరా." అంటూ నవ్వేశాడు.

బృంద ముఖం మలినమైంది. మౌనం వహించింది.

బేరర్ డ్రింక్స్ తెచ్చాడు.

శశికాంత్ వైన్‌గ్లాస్‌తీసి బృందకు అందీయబోతే ఆమె తీసుకోకుండా, మృదువుగానే 'వద్ద'ని చెప్పింది.

శశికాంత్ వదలలేదు. "ఏం తప్పు లేదు. ఈ రోజులు కూల్‌డ్రింక్స్ బదులు హాట్ డ్రింక్! అంతేకదా! ఈ వయస్సులోవాళ్ళంతా తాగాల్సినవికూల్ డ్రింక్స్‌కాదు."

"కరెక్ట్." నాగేంద్ర వచ్చాడు. ఎవ్వరూ గమనించకుండా బృందను తీక్ష్ణంగా చూస్తూ, "శశికాంత్ కరెక్ట్‌గా చెప్పారు. తీసుకో."

బృంద బెదరిపోతూ తీసుకుంది కానీ ఒక్క గుటకూడా వేయలేకపోయింది.

వాంతి అయ్యేంత పర్యంతమైంది.

కోపంగా చూసి నిష్క్రమించాడు నాగేంద్ర.

శశికాంత్‌కు అవకాశం దొరికింది. "ఫర్వాలేదు, క్రొత్తకదా." అంటూ గొంతు సవరించాడు. "ఈ లాకెట్ చాలా బాగుందే!" అన్నాడు బృంద మెడలోని గొలుసుకున్న లాకెట్ పట్టి చూస్తూ. "ఈసారి సింగపూర్ వెళ్ళినప్పుడు నీ కోసం మంచి డైమండ్స్ తీసుకొస్తాను. ఇలాటి మామూలు రవ్వలు కాదు నీలాంటి అందగత్తె మెడలో వుండవలసినవి."

అక్కడినుండి రక్షించుకోవటానికి బృందకు ఒకటే మార్గం తోచింది. 'ఒంట్లో బాగులేదు' అంటూ ఒంటరిగానే వెళ్ళిపోయింది యింటికి.

"బృందా?"

వేయి పిడుగులు ఏకకాలమందు పడ్డట్లున్న ఆ గర్జనకు నిలువెల్లా వణికిపోయింది బృంద.

అప్పుడే పార్టీ ముగియకుండానే ఆ విందునుంచి భార్యను వెతుకుతూ వచ్చాడు నాగేంద్ర. బృంద దుస్తులూ నగలూ మార్చుకోవడానికి తన గదిలోనికి వెళ్ళింది. అంతలో ఆ ఉరుము!

"బృందా!! విన్పించలేదా?" మరో పొలికేక పెట్టాడు నాగేంద్ర.

నిలువునా గజగజ లాడిపోయింది బృంద.

అతడు బాగా త్రాగివున్నాడు పార్టీలో. అసలే అపరిమితమైన కోపిష్టి. ఇక తప్పత్రాగిన స్థితిలో...

ఊహించనుకూడా ఊహించుకోలేకపోయిందామె. భయంతో రక్తం గడ్డకట్టుకుపోయింది. పాదాలు భూమికి అంటుకుపోయినట్లయి అడుగు ముందుకు కదల్చలేకపోయింది.

"ఏం విన్పించలేదా? ఎన్ని కేకలు పెట్టానని?" తానే ఆ గదిలోకి వచ్చాడు

నాగేంద్ర. మనిషి తూలిపోతున్నాడు నాలుక వంకరతిరిగి కష్టపడ్తూన్నది మాట్లాడటానికి.

"నేనేం చెప్పాను, నువ్వేం చేశావ్?" ఒక్కటే చెంపదెబ్బకు మంచంమీద పడి పోయింది బృంద.

''నీ అందంచూచి కొరుక్కుతింటానికి కాదు నిన్ను నేను పెళ్ళాడినది. జాగ్రత్త! నా మాట వినకపోయావో — నీ ప్రాణం నీదికాదు.'' ముఖంలోకి చూస్తూ క్రూరంగా చెప్పాడు

'భగవంతుడా! ఎందుకింత పోరాట నరక జీవితంలో పడవేశావ్ నన్ను? అక్కడ తల్లిపోరు తప్పిందంటే ఇక్కడ ఈ పోరా? ఇక ఎలా నేను బ్రతికేది!' నిస్సహాయంగా రోదించటమేకాని ఆమె చేయగలిగిందేముంది?

## 34

కొంత కాలపు సాన్నిహిత్యంలో, భార్యాభర్తల నడుమ సమస్యలు సమసి పోయే అవకాశమున్నదని పెద్దలనమ్మిక ఒక్కచోట మసిలినంత మాత్రాన మారి పోయే మామూలు మనుష్యులకు మాత్రమే వర్తించగల సామాన్య సిద్ధాంతం అతి, పరిపక్వ హృదయాలకు వర్తించదు.

వివాహమైననాడు-ఎలా వున్నారో-రెండు సంవత్సరాలు గడచిన అనంతరం ఈనాడూ అలాగే వున్నారు జమునా మురళీ. వారి మధ్య అనురాగం అణు మాత్రమైనా పెరగలేదు; మురళి నిర్లిప్త నిస్తబ్ధ ధోరణిలో ఇసుమంతైనా మార్పు రాలేదు; జమున ఆశాపూర్వక ఆరాధన అలాగేవున్నది.

బృంద గుర్తుకురాని క్షణమూ, రోజూ వుండవు మురళికి, రాధ పుట్టింటికి శాశ్వతంగా వచ్చేసి నాటినుండీ ఆ ఆలోచనలు మరింత అధికమై దివారాత్రాలూ తపన అధికం కాసాగింది, రాధ జీవితం అలాగ-జమున జీవితం ఇలాగ, బృంద జీవితం మరొక గాడిలో-తన సోదరీ, బాంధవి, ప్రియ-ముగ్గురిలోనూ ఎవరి జీవితమూ సుఖవంతంగా సాగటం లేదు.

రాధ పుట్టింటికి వచ్చివేసిన యింత కాలానికి అత్తమామల నుండి కబురు వచ్చింది, "రాధనూ బిడ్డనూ పంప" మని

ఆ ఉత్తరం చూపుతూ వాసుదేవరావు రాధ అభీష్టాన్ని అడగగా ఆమెమౌనంగా వుండిపోయింది, నేలచూపులు చూస్తూ, తండ్రి మరి తర్కించలేదు.

"ఆ మూర్ఖుడు వచ్చి రాధను స్వయంగా క్షమాపణ కోరితే తప్ప పంపేదిలే" దని మురళి ఖచ్చితంగా అన్నాడు, "ఇదంతా అసలు రాధ డబ్బు కోసం కానీ, రాధమీద ప్రేమకా" దనే అనుమానం కూడా వెలిబుచ్చాడు.

అతడి అనుమానమే నిజమని పించారు కొలది రోజుల అనంతరం వచ్చిన రాధ అత్తామామలు.

వారెంత దాచినా దాగకుండా అసలు

విషయం అందరికీ తెలిసి పోయింది. గొప్పవారి విషయాలలో వెర్రి స్వజనాని కంటె ఊరూ, వాడా అందదిరికీ ముందు తెలుస్తుంది. ఊరందరికీ వారం రోజులు ముందుగానే తెల్సిన విషయం వాసుదేవ రావు కుటుంబానికి మాత్రమే ఆలస్యంగా తెల్సింది.

రాధ అత్తవారి ఆర్థికస్థితి మేడిపండు సదృశ్యమై పోయింది. త్రాగి ఒళ్ళు తెలియని స్థితిలో సురేష్ ఆస్తినంతనూ ఒక ఉంపుడుకత్తె పేర వ్రాసివేయడం జరిగింది. నిషా దిగిపోయిన అనంతరం జరిగిన విషయం తెల్సుకున్న అతడు ఆవేశంలో ఆమెను హత్య చేశాడు. ఫలితంగా ప్రస్తుతం కారాగారంలో వున్నాడు అతడిని విడిపించు కోవాలన్నా, తిరిగీ దర్జాగా బ్రకాలన్నా సురేష్ తలి దండ్రు లకు అర్థబలమూ అంగబలమూ కూడా అవసరం, అందుకే లేనిప్రేమను ఒలక బోస్తూ కోడలినీ మనుమడినీ తీసుకు వెళ్ల డానికి వేంచేశారు అప్పుడు రాధ మీది మమకారంతో ఆమె భర్తను విడిపించే బాధ్యతను వాసుదేవలావు తన భుజ స్కంధాలపై సునాయాసంగా మోస్తాడని వారి అంచనా.

అయితే విషయం విన్న రాధ శిలలా మారిపోయింది. ఆమె అంతరంగాన ఏ అగ్నిపర్వతం బ్రద్దలౌతున్నదో, ఎటు వంటి హాలాహల జలధి కెఱటాలు కొడ్తూ న్నదో అంతర్యామికే ఎరుక.

మురళి అసహ్యాన్ని కప్పిపుచ్చు కున్నాడు—సురేష్‌పట్ల అతడి తలి దండ్రుల యెడలా.

వాసుదేవరావు వారి నసలు ఖాతరు చేసి మాట్లాడనే లేదు.

దేవకి మాత్రం కుమార్తెకు సలహా యిచ్చిందనడం కంటె ఆదేశించిందని చెప్పవచ్చు! "మన దేశం యింతే పురుషుడు అంతే, అటువంటి పట్టుదల మన వంశానికి తగదు, స్త్రీ స్థానం భర్తవద్దనే, నువ్వు త్వరలో వెళ్ళిపోతేనే బాగుం టుంది. ఇక్కడుంటే గౌరవం వుండదు. అతడిని ఆ నేరం నుంచి బయటకు తెచ్చే బాధ్యత నాది, మీ నాన్నగారిది! సరేనా?"

మౌనంగా విన్నది రాధ, సజలనేత్రా లతో అన్నది; "నీ యిష్ట ప్రకారమే కానీ యమ్మా, నన్ను రేపే పంపేసేయి!"

కుమార్తె బుద్ధిమంతనానికి సంత సించి గర్వించిన దేవకికి, మర్నాటి వరకూ రాధ అసలైన ఆంతర్యం ఏమిటో తెలియరాలేదు.

ఇల్లంతా శోకసముద్రంలో మునిగి పోయింది. నిశ్చింతగా శాశ్వతనిద్రలో నికి జారుకుపోయిన రాధనుచూసి.

"రాధా! రాధా!" ఏడ్పులతో ప్రతి ధ్వనించింది.

"ఎంతపని చేశావు తల్లీ!" వాసుదేవ రావు కుప్పకూలిపోయాడు. "ఇదంతా నా ఖర్మ, నా పాపం, నాబిడ్డల్లో ఎవరూ

DISTA'S-DR-349 TE

అందమైన
ప్రతి ముఖం వెనుక
ఒక రమ్యమైన
రహస్యం
ఉన్నది.

అందంగా ఉండాలనుకోవటం మీ ఆశయం. మీ చర్మాన్ని ఆ విధంగా ఉంచటం క్రూక్స్ లాక్టో-కేలమైన్ పని.

క్రూక్స్ లాక్టో-కేలమైన్ పగలు, సాయంత్రము, రాత్రి నిద్రపోయే ముందు ఉపయోగించండి. మీ కాంతి ఇనుమడించి, ఎల్లప్పుడూ వికసించి ఉండేలా చేయగలదని మీరు కనుగొంటారు.




క్రూక్స్
# లాక్టో-కేలమైన్

[illegible]
పోస్టు బాక్సు నం. 6582,
బొంబాయి 400 018

## అందంగా ఉండటానికి సరిక్రొత్త రహస్యం

సుఖంగాలేరు." అంటూ జుట్టు పీక్కుంటూ ఏడ్వసాగాడు.

దేవకి కడుపుశోకం వర్ణనాతీతం. రాధ తన ఆఖరి మాటలను పొందుపర చిన కాగితం ఆమె చేతిలోనే వున్నది. బిగుసుకపోయి

"నాన్నగారూ, అన్నయ్యా!

ఆఖరి నమస్కారాలందుకోండి, ఈ నా నిష్క్రమణ మీకెంత బాధాకరమో తెలసు, క్షమించండి నా జీవితానికి యింతకంటే పరిష్కార మార్గంలేదు, నేను దిక్కుమాలినదానిగా చూడబడి అక్కడినుండి వచ్చేసినప్పుడే అతడిని మృతులైనవారిలో అంచన వేశాను. ఇప్పుడు నేను విధవనే కాని సధవనని అనుకోవడంలేదు......

ఖూనీకోరు, జూదరీ, త్రాగుబోతూ, అయిన సకల దుర్గుణాల పుట్టకు పుత్రు నిగా గాక ఆదర్శవంతంగా, ఉత్తము డిగా తీర్చి దిద్దండి. నా బిడ్డ వేణును ఇదే నా ఆఖరి కోరిక, వేణు ఆ నీతి మాలిన ఇంట అడుగు పెట్టడానికి వీల్లే దని బాగా గుర్తుంచుకోండి....ఆఖరుగా ఒక్కమాట—మనం బృందను పెట్టిన ఉసురు యిలా శాఖోపశాఖలై మనయింట తిష్ఠవేసి అశాంతి పీఠాన్ని స్థాపించిందను కుంటాను. సకల కులాలవారితోనూ నీచ సంబంధం పెట్టుకున్న వ్యక్తితో జీవితం పంచుకున్న నా కులం ఏది ఔతుంది? వేణు కులం ఏమిటి!

ఏనాడైనా భవిష్యత్తులో బృందవంటి వారు ఎదురుపడితే వారిని అవమానించక ఆదరించగలరని భావిస్తాను. వేణు జాగ్రత్త!.

రాధ స్వర్గస్థురాలవ్వడమంటేఏమిటో నమ్మలేని విషయంగా భావించారు. అందరూ శవాన్ని ఎదుటే చూస్తూకూడా.

దేవకి మంచం దిగటంలేదు.

వాసుదేవరావు ఏ వ్యవహారమూ పట్టించుకోకుండా స్తబ్ధుగా ఒకచోట పడివుంటాడు. తన విలాస జీవితమూ, అధికారంతో—మదంతో చేసిన పాపాలు తన సంతానంపై దెబ్బతీశాయని అతడు స్పష్టంగా గుర్తించాడు.

జమునా, మురళీ రాధను తలుచుకు తలుచుకు ఏడుస్తారు. చిన్ని వేణును అక్కున చేర్చుకుని విలపిస్తుంది జమున

జీవితపు క్షణభంగురత్వాన్ని కను లారా చూచిన వారి మనసులలో విషాద ముద్ర శాశ్వతంగా తావు చేసుకొన్నది.

చైతన్యమంతా రాధవెంట తీసుక పోయి విషాదాన్ని మాత్రమే ఆ యింటికి మిగిలించినట్లున్నది.

## 35

రాధ చనిపోయిన విషాదానికి తోడు రాధ పుత్రుడు వేణు నిత్యం కనుల ఎదుట తిరుగుతూంటే రోహిణి బాధ అధికం కాజొచ్చింది.

"జమున సంతానవతి కాకుంటే ఇక ఆ వంశం అంతటితో అంతమే కదా?"

ముసలి ప్రాణాలు బొత్తిగా సహించలేని ఘోర విషయాలలో కెల్లా ఘోరమైనది యిది.

దేవకి మనసున కూడా ఈ బాధ లేకపోలేదు. అయితే ఆమె ముసలి రోహిణి అంత ఛాందసంగా మాత్రం ప్రవర్తించి పైకి ఆమె మనసును ప్రకటించదు.

"జమునా! త్వరగా తయారుకా అలా బయటకుళ్దాం." అన్నది రోహిణి ఆనాడు ఉదయమే ఏడు గంటలకు.

"ఎక్కడికీ?'' భయపడ్తూనే ప్రశ్నించింది జమున.

రోహిణితో కలిసి ఎక్కడికైనా వెళ్ళడమంటే జమునకు గుండెలు దడదడలాడతాయి. ఆలయాలలో ప్రదక్షిణలూ, నదీ స్నానాలూ, వ్రతాలూ, దానాలూ అన్నీ ముగిశాయి. ఈ మధ్య మరో కార్యక్రమం ప్రారంభించింది. రోహిణి సాధువులకూ, బైరాగులకూ మ్రొక్కించటం ఎక్కడికయినా వెళుతుంటే దారిలో దైవం ప్రతిరూపంలో ఏ రాయి కన్పించినా అక్కడ మ్రొక్కించటం.—వర్ణనాతీతమైన నరక బాధగా వున్నదది జమునకు.

అంతేకాదు. కాస్త్రజ్యోతిషం చెప్పే వారెవరైనా వరే జమున చేతిలో రేఖలు చూడమనడమూ, సంతాన యోగ్యత ఉన్నదో లేదో చెప్పమనటమూ.

ఒక్కొక్కడే రేఖలన్నీ పరిశీలనగా చూడటమూ, ఏమిటో శ్రమపడిపోతూ మీనమేషాలు లెక్కపెట్టి ఏదోపెద్ద అవస్థ పడిపోతూ ఎన్నో గుణించి ముగ్గురు పిల్లలనీ: నలుగురు పిల్లలనీ: చెప్పి అయిదులూ, పదులూ తీసుకుంటుంటే జమునకు ఆ కపట జ్యోతిష్కులను నిందించాలో లేక తన కపట సంసార నాటకాన్ని నిందించాలో అర్థమయ్యేది కాదు.

ఆఖరుకు ఒకరోజున ఏదో బజారు పనిమీద వెళ్తూ దారిలో ఎవరో కోయ దొర దారినపోతూ కన్పిస్తే పనిమాలా కారు ఆపుచేయించి రోహిణీ, అతగాడిని పిలిచి "అమ్మాయి చేయిచూడ" మని అడిగింది,

కారు డ్రైవరూ: ఇద్దరు నౌకర్లూ, ముఖముఖాలు చూచుకుంటూంటే జమునకు అక్కడికక్కడ తల పగలకొట్టుక చావాలన్పించినంత అవమానం అనుభవమైంది.

అతను కృష్ణాజినం పరచి కూర్చుని, ఏదో ఇంత దండకం చదివి, ఆఖరుకు అద్భుతమైన విషయం చెప్పాడు, రోహిణికి వీనుల విందుగా. "అమ్మాయిగారిది చాలా గొప్ప జాతకమండీ, మహారాణి జీవితం."

''కాదుమరీ! మా కోడలు మహారాణే!" రోహిణి ఉవాచ.

"అయితే అమ్మాయిగారికి సర్ప దోషం వుందండి."

"ఏంచేయాలి నాయనా?" రోహిణి ఆత్రత!

(సశేషం)

Printed and Published by A. Sudhakara Rao, at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press.



తళ తళ లాడే
తెలుపు ఇస్తుంది రిన్






హస్తి ప్రమాణమైన ఉతుకు
రిన్ సబ్బుకన్న 50% మిన్నగా
బట్టలను ఉతుకుతుంది!

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్-RIN. 4-736 TL (RB)

## Statement about ownership and other particulars about newspaper

# FORM IV

(See Rule 8)

| | | |
|---|---|---|
| 1. | Place of publication | ... Hyderabad |
| 2. | Periodicity of its publication | ... Monthly |
| 3. | Printer's Name | ... A. Sudhakara Rao for Yuva Publications |
| | Whether citizen of Iddia | ... Indian |
| | Address | ... 5-9-88, Public Garden Road Hyderabad-500 001 |
| 4. | Publisher's Name | ... A. Sudhakara Rao for Yuva Publications |
| | Whether citizen of India | ... Indian |
| | Address | ... 5-9-88, Public Garden Road Hyderabad-500 001 |
| 5. | Editor's Name | ... Sri A. V. Subba Rao (Alias Chakrapani) |
| | Whether citizen of India | ... Indian |
| | Address | ... 2 & 3, Arcot Road, Vadapalani Madras-26 |
| 6. | Names and addresses of individuals who own the newspaper and partners or share-holders holding more than one per cent of the total capital | ... Sri A. V. Subba Rao (Alias Chakrapani) Managing Partner<br>A. Chandra Sekhar Rao<br>2 & 3 Arcot Road, Vadapalani<br>Madras-26<br><br>A. Raja Sekhar Rao } Minors<br>A. C. Chakrapani }<br>2 & 3 Arcot Road, Vadapalani<br>Madras-26<br><br>A. Sudhakara Rao, 5-9-88, Public Garden Road, Hyderabad-500001. |

I, A. Sudhakara Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief:

Sd/- A. SUDHAKARA RAO

*Signature of Publisher*

Dated : 1-3-1975